అపరాధ పరిశోధన అనుబంధం—34

# తెలుగు నవలలు

(మీ కోసం "అపరాధ పరిశోధన" అందజేస్తున్న
మీరు మెచ్చే క్రైమ్ నవలలు)

## దొంగలు దోచిన సొమ్ము

రచన: వి. నాగేశ్వరరావు

## చెక్క బొమ్మ

రచన : కంచర్ల రమణ

## చావు జోస్యం

7

రచన : వసుంధర

## అంతరిక్ష దొంగలు

రచన : అజీజ్

"క్రైమ్‌లో తమాషాలు"

అపరాధ పరిశోధన సప్లిమెంట్—34
అక్టోబర్, 1976
వెల : 3-00 రూపాయలు
ఏడాది చందా 39 రూపాయలు
జీవిత చందా 250 రూపాయలు

మేనేజింగ్ ఎడిటర్ :
శ్యామ దామోదర్ రెడ్డి

సంపాదక వర్గం :
టెంపోరావ్
శ్యాంబాబు
రమణశ్రీ
ఏ. వీ. మోహన్రావ్
సుజనశ్రీ
వసుంధర
కంచర్ల రమణ

కార్యాలయం :
అపరాధ పరిశోధన కార్యాలయం
నారాయణగూడ, హైదరాబాదు-29
ఫోన్-36959

ముద్రణ :
క్రాంతి ప్రెస్,
12, ఫ్రాన్సిస్ జోసెఫ్ స్ట్రీట్, మద్రాసు-1.

గెడా రంగారావు

# దొంగలు దోచిన సొమ్ము!

వి. నాగేశ్వరరావు

అదొక చిన్న పల్లెటూరు.

అది సముద్రతీరాన్ని ఆనుకొని ఉంది. కాని అక్కడ వర్తకం అన్నదే ఏమి జరగదు. అసలక్కడ సముద్రతీరం ఉన్నట్లే చాలామందికి తెలియదేమో. అందుకే అది పల్లెటూరుగానే ఉండిపోయింది.

ఆ సముద్రతీరానికి కొంచెం దూరంలో చిన్న హోటల్ ఉంది. దానిని నేను, నా ముసలి తండ్రి నడుపుతున్నాం. అది సముద్రతీరాన్న ఉండటంవలన దానిలోకి అంత ఎక్కువమంది రారు.

ఎప్పుడో షిప్ వచ్చినపుడు మాత్రం చిన్న చిన్న బోట్లు వేసుకొని మా హోటలుకు నావికులు వస్తుంటారు.

వారు ఒక్కొక్కసారి రెండు, మూడు రోజులుకూడా ఉండిపోతారు. వారు వచ్చినప్పుడే మాకు చేతినిండా పని.

ఆరోజు హోటల్ అంతా డల్ గా ఉంది. దానిలో నలుగురు, అయిదుగురు తప్పించి ఎక్కువమంది లేరు. నేను కౌంటర్ లో కూర్చున్నాను.

హోటల్ లోవాళ్ళు ఏవో కబుర్లు చెప్పుకొంటున్నారు. అప్పుడే ఒకతను హోటల్ లోకి ప్రవేశించాడు. అతని వెనుక ఒక కూలివాడు పెద్ద పెట్టెను తలమీద పెట్టుకొని నిలబడ్డాడు.

అతను ఎత్తుగా బలంగా ఉన్నాడు. వెంట్రుకలు తెల్లబడి ఉన్నాయి.

అతనికి అరవై సంవత్సరాలుండవచ్చు ననిపిస్తుంది. ముఖమంతా అక్కడక్కడ ముడతలు పడింది. కళ్ళు లోతుకుపోయి అదో మాదిరిగా కనిపిస్తున్నాడు. అతను నావికులు ధరించే డ్రెస్ వేసుకొని ఉన్నాడు. అతను కూలీవాడిచేత పెట్టెను ఓ టేబుల్ దగ్గర పెట్టించి, వాడికి కూలి ఇచ్చి పంపించివేసి అక్కడే ఓ కుర్చీలో కూర్చు న్నాడు.

అతని చూపులు హాలు నలువైపులా కలజూస్తున్నాయి. కొంతసేపటికి అతని కళ్ళలో ఒక విధమయిన తృప్తి కనిపించింది.

"విస్కీ" అన్నాడతను తనదగ్గరకు వచ్చిన కుర్రాడితో. ఆ కుర్రవాడు గ్లాసునిండా విస్కీ నింపుకొని వెళ్ళి అతనిముందు పెట్టాడు.

అతను నెమ్మదిగా దానిని సిప్ చేస్తూ "ఈ హోటల్ కు

ఎక్కువమంది వస్తుంటారా?'' అన్నాడు.

అప్పటికే అక్కడినుంచి ఆ కుర్రవాడు వెళ్ళిపోయాడు.

''అంత ఎక్కువమంది రారు సార్'' అన్నాను నేను నమ్రతగా.

''గుడ్. ఈ చోటు చాలా బావుంది. నేనుకూడ ఇటువంటి హోటల్ కోసమే వెదుకుచున్నాను. నాకు రూమ్ ఒకటి ఏర్పాటు చేయండి,'' అన్నాడు.

అతను ముసలివాడయినా కంఠం గంభీరంగా ఉంది. నేను అతనిని నాతో పైకి తీసుకువెళ్ళి అతనికి రూమ్ చూపించాను. అతను ఎంతో జాగ్రత్తగా తనతో తీసుకు వచ్చిన పెట్టెను రూమ్‌లోకి చేర్చాడు. దానికి బరువయిన తాళంకప్ప ఒకటి వ్రేలాడుతుంది.

అతను నాకు వందరూపాయలు అడ్వాన్సుగా ఇచ్చి తాను పిలిచినపుడే లోపలకు రమ్మని, తన అనుమతి లేకుండా లోపలకు రావద్దని చెప్పాడు.

తరువాత నెమ్మదిగా అన్నాడు.

''నీవు కౌవుంటర్‌లోనే కూర్చుంటావా ఎప్పుడూను.''

''ఎస్ సార్.''

''అయితే నేను చెప్పినట్లు విను. రోజుకు నీకు అయిదు రూపాయలిస్తాను. ఈ హోటల్‌కు ఎవరయినా కుంటివాడుగాని వస్తే వెంటనే నాకా విషయాన్ని చెప్పాలి,'' అన్నాడు.

నేను ఆ విషయానికి ఒప్పుకున్నాను. నేను కౌంటర్‌లో కూర్చొనే అదనంగా అయిదు రూపాయలు సంపాదించ వచ్చు.

''మీ పేరు ఏమిటి సార్'' అన్నాను నేను. మేము

సాధారణంగా హోటల్‌కు వచ్చేవారి పేర్లు అంతగా తెలుసుకోం.

"కెప్టెన్ బ్రిల్. మరి నీ పేరు."

"అనంత్."

"గుడ్. నేను చెప్పిన విషయాన్ని మాత్రం మర్చిపో వద్దు." అంటూ అతను మరీ మరీ హెచ్చరించాడు.

నేను అలాగేనని చెప్పి క్రిందకు వచ్చేసాను.

## 2

కెప్టెన్ బ్రిల్ ప్రతివిషయానికి భయపడిపోయేవాడు' తన రూమ్‌లోనుంచి బయటకు రావాలంటే ముందు తలుపును ఓరగా తీసి దానిలోనుంచి క్రిందకు చూచి, తరువాత క్రిందకు వచ్చేవాడు.

అతనిదగ్గర చిన్న రివాల్వర్ కూడ ఉంది. ఆ రివాల్వర్‌ను, కొన్ని బులెట్స్‌ను జేబులో వేసుకొని ఒక టెలిస్కోప్ పట్టుకొని కొండ గుట్టలమీద, సముద్ర తీరాన్ని ఒంటరిగా తిరిగేవాడు.

అలా ఒంటరిగా తిరిగి తిరిగి వచ్చి గ్లాసుమీద గ్లాసు విస్కీ త్రాగి పాటలు పాడేవాడు.

తరువాత తన రూమ్‌లోకి భోజనం తెప్పించుకు తిని, మత్తుగా నిద్రపోయేవాడు.

నాకు ఇవ్వవలసిన జీతం రోజుకు అయిదురూపాయలు రెండు రోజులకు ఒకసారి ఇచ్చేవాడు. కాని రూమ్ రెంట్ గాని, భోజనానికిగాని ఏమి ఇచ్చేవాడు కాదు. అవి మాత్రం అడిగితే మామీద కయ్‌మని లేచేవాడు.

అతనిని చూస్తే నాకు చాలా భయం వేసేది. మాకు ఇవ్వవలసిన బిల్ ఇచ్చేవాడు కాదు. రూమ్ ఖాళీ చేయ

మంతే ఖాళీ చేయడు. కెప్టెన్ బ్రిల్ కట్టిన అద్దాన్ని ఎప్పుడో అయిపోయింది.

ఏమారు నెలరోజులు గడిచిపోయాయి.

ఒకసారి ఒకతను మా హోటల్ కు వచ్చాడు.

అతను వచ్చి కెప్టెన్ బ్రిల్ గురించి అడిగాడు.

కెప్టెన్ బ్రిల్ సముద్రతీరానికి వెళ్ళారని చెప్పాను నేను.

"సరేలే" అంటూ అతను అక్కడే ఉన్న కుర్చీలో కూర్చున్నాడు. అతను అసహనంగా అటు ఇటు కదులుతూ ద్వారం వైపు చూస్తున్నాడు.

కొంతసేపటికి కెప్టెన్ బ్రిల్ టెలిస్కోప్ పట్టుకొని లోపలికి వచ్చాడు. వచ్చీ రాగానే కుర్చీలో కూర్చున్నతని వైపు ఆశ్చర్యంగాను, భయంగాను చూచాడు.

అతను కెప్టెన్ బ్రిల్ ను చూచి చిరునవ్వు నవ్వాడు.

కెప్టెన్ బ్రిల్ నెమ్మదిగా అతని దగ్గరకు వెళ్ళి "నీ విక్కడకు ఎలా వచ్చావు?" అన్నాడు.

"అది ఏమంత కష్టమయిన పని కాదులే" అంటూ అతను కెప్టెన్ బ్రిల్ చేతిలో ఒక కాగితాన్ని పెట్టి వెళ్ళిపోయాడు.

కెప్టెన్ బ్రిల్ ఆ కాగితాన్ని విప్పి చూచాడు.

ఆ కాగితం మధ్యలో ఒక నల్ల చుక్క వేసి ఉంది. దానిక్రింద ఏదో రాసి వుంది. కాని అది నాకు సరిగ్గా కనిపించలేదు.

ఆ కాగితాన్ని పట్టుకొని కెప్టెన్ బ్రిల్ చాలాసేపటి వరకు ఆలోచిస్తూ ఉండిపోయాడు.

తర్వాత తన రూమ్ లోకి వెళ్ళిపోయి విస్కీ బాటిల్ ఒకటి తీసుకురమ్మన్నాడు.

నేను తీసుకువెళ్ళి ఇవ్వగానే అతను ఆ బాటిల్ అంతా ఖాళీ చేసేసి, నిషాలో ఏమేమో మాట్లాడసాగాడు.

అతని మాటలవలన తెలిసిందేమిటంటే, కెప్టెన్ బ్రిల్ ఒకప్పుడు దొంగలముఠాలో వాడని, వారి దగ్గరున్న తాళాలను ఏదో దొంగిలించడంవలన వారు తనకోసం వెదుకుతున్నారని, తన ఇష్టమొచ్చినట్లు మాట్లాడసాగాడు.

కెప్టెన్ బ్రిల్ ఉన్నట్లుండి మెట్లమీదనుంచి వేగంగా క్రిందకు దిగుతూ చటుక్కున కాలుజారి మెట్లమీదనుంచి దొర్లుకుంటూ క్రింద పడిపోయాడు.

నేను వేగంగా క్రిందకు దిగి అతనిని చూశాను. అతని తల మేడమెట్లుకు కొట్టుకుపోయి రక్తం కారుతూంది.

అతని ముక్కుదగ్గర వేలుపెట్టి చూశాను. శ్వాస ఆడటంలేదు. గుండెలమీద చేయివేసి చూచాను. గుండె కూడ కొట్టుకోవటం లేదు.

కెప్టెన్ బ్రిల్ శవాన్ని చూడగానే వణికిపోయాను.

అదృష్టవశాత్తు ఆ సమయంలో ఆ హోటల్ లో ఎవరూ లేరు.

హోటల్ తలుపులు మూసి జరిగినదంతా నా తండ్రితో చెప్పాను.

అదంతా విని ఆయనా వణికిపోయాడు.

"అయితే ఇప్పుడేం చేద్దాం," అన్నాడు గొంతు పెగల్చుకొని.

"మనం ఈ హోటల్ విడిచి పారిపోదాం. వీడసలే దొంగల ముఠాలోవాడు. మన పీకలమీదికి వస్తుంది" అన్నాను నెమ్మదిగా.

"మనం వెళ్ళిపోతే వాళ్ళు మన హోటల్‌ను ధ్వంసం చేసేస్తారు" అన్నాడు నా తండ్రి కొంతసేపు ఆలోచించి.

"అయినా సరే! మనం ఇక్కడ ఉంటే మనమే కెప్టెన్ బ్రిల్‌ను చంపాలని చంపామని, వాళ్ళు మనల్ని చంపేస్తారు," అన్నాను.

"సరే! పద వెళ్దాం" అంటూ నా తండ్రి పైకిలేచాడు.

"ఉండు. ఇప్పుడే వస్తాను," అంటూ నేను మేడ మీదకు వెళ్ళి కెప్టెన్ బ్రిల్ తీసుకువచ్చిన పెట్టెకోసం చూశాను. అతను మా హోటలుకు చాలా బాకీపడి ఉన్నాడు.

అతని పెట్టె మంచం క్రింద ఉంది.

దానిని బయటకు లాగాను. దానికి రాగాసిలా ఒక తాళంకప్ప వ్రేలాడుతుంది. అది ఎప్పటిదో పాతది.

అక్కడ గోడకు ఉన్న మేకను తీసుకువచ్చి దానిని తాళంగాపెట్టి తిప్పాను.

కొంచెంసేపటికి అది ఊడి వచ్చింది. దానిని తీసేసి పెట్టె తెరచి చూశాను.

అందులో కొన్ని బట్టలున్నాయి.

ఆ బట్టలను పైకితీసి పెట్టె అడుగున చూశాను. పెట్టె అడుగున గుప్పెడు బంగారు నాణాలు, చిన్ని పార్సిలు ఉన్నాయి.

ఆ బంగారు నాణాలను జేబులో వేసుకొని, ఆ పేకట్ తీసి పరిశీలించాను. దానికి నాలుగువైపులా సీల్సు వేసి ఉన్నాయి.

దానినికూడ జేబులో పెట్టుకొని క్రిందకు దిగి, నా తండ్రిని తీసుకొని బయటకు వచ్చేసాను.

మా హోటల్‌లో ఉన్న లైట్లని ఆర్పేసినందువలన ఆ ప్రదేశమంతా చీకటిగా ఉంది.

నేను, నా తండ్రి కలిసి మా దగ్గర బంధువయిన డాక్టరు మూర్తి గారింటికి బయలుదేరాం.

కొద్దిదూరం వెళ్ళేటప్పటికి దూరంనుంచి మాకు ఏదో జీప్ శబ్దం వినిపించసాగింది.

సాధారణంగా మా గ్రామంలోకి జీప్‌లు, కార్లు ఏమి రావు. వాళ్ళు దొంగలముఠాలో వాళ్ళేమోనన్న భయంతో ముందుకు కదలలేక అక్కడే ఉన్న వంతెన క్రిందకు దూరి కూర్చున్నాం.

జీప్ మేమున్న వంతెనపై నుంచి వేగంగా మా హోటల్ ముందుకు వెళ్ళి ఆగింది.

దానిలోనుంచి సుమారు పదిమందివరకు బిలబిలమని క్రిందకు దిగారు.

వారందరూ చేతిలోని ఆయుధాలు రెడీగా పట్టుకొని హోటల్‌లోకి ప్రవేశించారు.

హోటల్‌లోనుంచి ఏమైనా చప్పుడు వినిపిస్తుందేమోనని శ్రద్ధగా వినసాగాను కాని నాకేమి వినిపించటంలేదు. వాళ్ళు కెప్టెన్ బ్రిల్ శవాన్ని చూచి ఆశ్చర్యపోయి ఉండాలి.

కొంతసేపటికి వాళ్ళు బయటకు వచ్చి టార్చిలైట్లు వేసుకొని ఆ చుట్టుప్రక్కల వెదకసాగారు.

వాళ్ళు వెదుకుతున్నది మా కోసమే అని గ్రహించడానికి ఎంతోసేపు పట్టలేదు.

వారిలో ఒకడు వారిని హెచ్చరిస్తున్నాడు. "వాళ్ళు ఇక్కడే ఎక్కడో ఉంటారు. బ్రిల్ చచ్చిపోయి ఎంతో

సేపు అవలేదు. వాళ్ళు ఎంతో దూరం పారిపోయి ఉండరు," అంటూ హెచ్చరిస్తున్నాడు.

నేను ఉన్నట్లుండి ఉలిక్కిపడ్డాను.

దూరంనుంచి మళ్ళీ ఏవో జీప్‌లు వస్తున్నాయి. వాటి హెడ్‌లైట్ల కాంతి బాణాల్లా దూసుకు వస్తుంది.

మేము భయంతో ఆ వంతెన క్రిందనే నక్కి కూర్చున్నాం.

ఆ జీప్ వంతెన మీదనుంచి దూసుకుపోయి హోటల్ ముందు ఆగింది.

దానిలోనుంచి పోలీసులు క్రిందకు దిగారు.

వారిని చూడగానే దొంగలలో అలజడి ప్రారంభ మయింది. వాళ్ళు గన్స్ ఎక్కుపెట్టి పోలీసులను ఎదు ర్కొన్నారు. పోలీసులు కూడ వారిని కాల్చసాగారు.

ఇరువైపులనుంచి అగ్నిప్వాలు రివ్వున దూసుకు వెడు తున్నాయి. రెండువైపుల నుంచి ఆర్తనాదాలు వినిపిస్తు న్నాయి. దొంగలలో అందరూ హతులైనట్లున్నారు. ఎవరూ మిగిలిలేరు.

కాల్పులు ఆగిపోయాయి. మేము నెమ్మదిగా వెనుక నుండి హోటలులో ప్రవేశించాము. హోటలునిండా, బయటా శవాలే పడివున్నాయి.

పోలీసులు ఆ శవాలను పరిశీలించి అవి సముద్ర దొంగల వని, దాని నాయకుడు ఫ్లింట్ అని, అతనుకూడ కాల్పు లలో మరణించాడని చెప్పారు.

సమయానికి పోలీసులు అక్కడకు ఎలా రాగలిగారో నాకు తెలియలేదు.

మేము మా హోటల్‌ను చూచుకొని బాగా దిగాలు పడిపోయాం. హోటల్‌లో ఉన్న కుర్చీలు, బల్లలు అన్నీ

తల్లక్రిందులై ఉన్నాయి. గాజు సామానులు, పింగాణీ ప్లేట్లు, వంట సామానులు మొదలయినవన్నీ పగిలిపోయి ఉన్నాయి.

పోలీసులు అన్ని శవాలతో పాటు బ్రిల్ శవాన్ని కూడా మున్సిపాలిటీవారిలా వేసుకొని వెళ్ళిపోయారు.

# 3

మా హోటల్ మీద దొంగలు దాడిచేసారని విని డాక్టర్ మూర్తి చాలా కంగారుపడిపోయి ప్రొద్దున్నే పరుగెత్తుకు వచ్చాడు. మమ్మల్ని చూచి తృప్తిగా నిట్టూర్చారు.

నేను జరిగిందంతా డాక్టరుగారికి చెప్పి, నేను తీసిన పార్సిల్ ను చూపెట్టాను.

డాక్టరు మూర్తి ఆ పార్సిల్ ను విప్పారు. దానిలో ఏవో కొన్ని కాగితాలు ఉన్నాయి. అంతకుమించి వాటిలో ఏమీ లేవు.

డాక్టరుగారు ఆ కాగితాల నన్నింటిని పరిశీలించి నన్ను కౌగిలించుకున్నంత పనిచేసారు.

నేను అవి ఏమిటో తెలియక తికమక పడిపోయాను. అదే విషయాన్ని డాక్టరుగార్ని అడిగాను.

తాను రేపువచ్చి ఆ విషయాల నన్నింటిని చెబుతానని చెప్పి, మమ్మల్ని జాగర్తగా ఉండమని చెప్పి, వెళ్ళిపోయారు.

ఆ మరునాడు అన్నట్లుగానే డాక్టర్ గారు వచ్చి నన్ను జమీందార్ భూపతిగారింటికి తీసుకు వెళ్ళారు.

భూపతిగారు ఆ గ్రామానికి మకుటంలేని మహారాజు లాంటివాడు. అతని మాట వేదవాక్యం. అయినా అతను

చాలా మంచి వాడవటంవలన అందరూ అతనిని గౌరవిస్తుంటారు.

మేము భూపతిగారింటికి వెళ్ళేటప్పటికి భూపతిగారు ఈజీఛేర్‌లో కూర్చొని పైప్ పీలుస్తున్నారు. మమ్మల్ని చూడగానే లోపలకు ఆహ్వానించి ఎదురుగావున్న కుర్చీలు చూపించారు.

మేము వాటిలో కూర్చున్న తరువాత, "ఏమోయ్ మూర్తీ! ఇలా వచ్చావు?" అన్నారు హుందాగా, డాక్టర్ మూర్తిని చూస్తూ.

డాక్టర్‌గారు చిరునవ్వు నవ్వి తనదగ్గర వున్న కాగితాలను తీసి ఆయన కిచ్చాడు.

జమీందారుగారు వాటిని జాగ్రత్తగా పరిశీలించి మా వైపు ఆశ్చర్యంగా చూస్తూ, "ఈ కాగితాలు మీ కెక్కడివి?" అన్నాడు.

డాక్టర్ మూర్తిగారు జరిగిందంతా ఆయనతో చెప్పి, "ఈ కాగితాలకోసమే ఫ్లింట్ ముఠా అనంత్ హోటల్ మీద దాడి చేసింది" అన్నాడు.

"ఎనిమిది కోట్ల బంగారు నాణాలు, ఇంకా విలువయిన వాటికి సంబంధించిన కాగితాలన్న మాట ఇవి. ఎనిమిది కోట్లు బంగారు నాణాలంటే చాలా పెద్ద మొత్తమే. అయినా ఇది అంతా ఆ దొంగల ముఠా దోచుకున్న సొమ్మే" అన్నారు భూపతిగారు.

"నిజమే. వాళ్ళు దోచుకొని అక్కడ దాచారు. కాని ఈ బ్రిల్ వాటికి సంబంధించిన కాగితాలను దొంగిలించి వుంటాడు. వాళ్ళందరూ తిరిగి బ్రిల్ మీద పడ్డారు," అన్నాడు మూర్తి.

"అయితే మనం దీనికోసం ప్రయత్నిద్దాం. ఇప్పుడు ఆ

దొంగ లెవరూ బ్రతికి లేరు. మనం ప్రయత్నించడంలో తప్పు లేదుగా," అన్నారు భూపతిగారు.

"అందుకే గదండి, వీటిని మీ దగ్గరకు తీసుకువచ్చాను" అన్నాడు డాక్టర్ మూర్తి.

"గుడ్. అయితే మనం వీటిని సంపాదించాలంటే సముద్రం మధ్యకు చేరుకోవాలి. సముద్ర ప్రయాణానికి కావలసిన సరంజామా అంతా సమకూరుస్తాను. మనం ఆ ధనాన్ని సంపాదిస్తే ఖర్చులు పోను అంతా సమానంగా తీసుకుందాం," అన్నారు.

దానికి మేమిద్దరము సంతోషంగా అంగీకరించాం.

పెట్టుబడి, ఇతర ఖర్చులు అన్నీ వారిదే కనుక మేము వారి మాటనే వినదలచుకున్నాం.

ఆ మరునాడే జమీందార్ భూపతి షిప్ కొనడానికి బొంబాయి వెళ్ళాడు.

ఐదవరోజున అతనినుంచి డాక్టర్ మూర్తికి లెటర్ వచ్చింది. దానిలో తాను మంచి షిప్‌ను కొన్నట్లు, షిప్‌కు కావలసిన ఇతర సరంజామా కూడ సమకూర్చినట్లు, మమ్మల్ని రెడీగా వుండమని, మర్నాడు తను షిప్‌తో వస్తున్నట్లు వ్రాశాడు.

డాక్టర్ మూర్తి నా తండ్రికి కావలసిన సదుపాయాలు సమకూర్చి, ఒక నర్సువాడిని కుదిర్చాడు. మాకు కావలిసిన ఇతర ఏర్పాట్లు చూడటంలో ఆ రోజంతా డాక్టర్ మూర్తి బిజీగానే వున్నారు.

# 4

మర్నాడు ఉదయమే షిప్ వచ్చింది.

భూపతిగారు మా ఇద్దరిని షిప్ దగ్గరకు తీసుకువెళ్ళి

దానిని చూపించారు.

అది సముద్రతీరంలో ఎంతో హుందాగా, గంభీర మూర్తివలె కనిపిస్తుంది. దాని పేరు హిస్పానియోలా.

కెప్టెన్ జగదీశ్ డెక్‌మీద నిలబడి కూలీలకు ఏదో ఆజ్ఞలిస్తున్నాడు.

షిప్‌లో అందరూ చాలా ఉత్సాహంగా వున్నారు. విషయమంతా భూపతిగారు వారికి చెప్పినట్లున్నారు. ఆ పద్ధతి నాకు నచ్చలేదు.

అదే విషయాన్ని కెప్టెన్ జగదీశ్ కూడ చెప్పాడు.

ఆ షిప్‌లో వంటవాడు సిల్వర్. అతనికి ఒక కాలు లేదు. అయినా అతను కాలు ఉన్నట్లుగానే చకచక పనులు చేస్తున్నాడు. అతను ఎన్నో షిప్‌లలో పనిచేసి ఎంతో అనుభవాన్ని సంపాదించాడుట.

కెప్టెన్ జగదీశ్ ముందు జాగ్రత్తకోసం అన్నీ చాలా జాగ్రత్తగా పరిశీలిస్తున్నాడు.

షిప్‌లో ఒక మూల మందుగుండు సామానులు జాగ్రత్త చేశారు. వాటిలో గన్స్, రివాల్వర్స్, హేండ్ గ్రయినేడ్స్, బులెట్ బాక్స్ ఎన్నో వున్నాయి.

పదిగంటల ప్రాంతంలో షిప్ బయలుదేరింది. చూస్తుండగానే మంత్రగాడు మంత్రం వేసినట్లుగా సముద్రతీరం అదృశ్యమైపోయింది. ఎటు చూసినా నీళ్ళే!

షిప్ నీటిని చీల్చుకొని ముందుకు దూసుకుపోతుంది. సముద్రంలో ఎత్తయిన కెరటాలు మానవుడి ఆశలలా ఎగిరెగిరి పడుతూ మధ్యలోనే విరిగిపోతున్నాయి.

చల్లని గాలులు శరీరాన్ని తాకి మనస్సును ఆహ్లాదపరుస్తున్నాయి.

నాకు సముద్ర ప్రయాణమంటే చాలా సరదాగా ఉంది.

సిల్వర్ వంట పనులు పూర్తి జేసుకు వచ్చి డెక్ మీద కూర్చొని రకరకాల కబుర్లు చెప్పేవాడు. అతనితో బాటు ఒక చిలకకూడ వుంది. అది రకరకాల మాటలు మాట్లాడేది. ఒక్కొక్కసారి అది ఒక్కొక్క గొంతుకతో మాట్లాడేది.

నేను డెక్ మీద నిలబడి ప్రకృతి సౌందర్యాన్ని తిలకిస్తున్నాను.

"ఏయ్ మిస్టర్! తిని కూర్చోవటానికా నిన్ను తీసుకువస్తే? పని చెయ్!" అంటూ నా వెనకనుంచి గంభీరంగా వినిపించింది.

"వీడెవరా నన్ను పనిచేయమంటున్న" దని వెనక్కి తిరిగి చూచి ఆశ్చర్యపోయాను.

నా వెనుక షిప్ త్రాడుమీద నిలబడి సిల్వర్ పెంపుడు చిలక నావైపు చూస్తుంది.

నేను దానిని పట్టుకోబోయేంతలో అది తుర్రుమని దూరంగా పారిపోయింది.

అదలా షిప్ మీద వున్న నావికుల నందరినీ అజమాయిషీ చేసేది. అది ఒకొక్కసారి కెప్టెన్ కంఠంతో అరిచేది. దాంతో అందరూ కంగారుపడటం చూచి హుషారుగా ఎగిరిపోయేది.

సిల్వర్ గురించి చాలామంది గొప్పగా చెప్పుకోవడం విని అతనిని కలుసుకొని అతనితో ఒకసారి మాట్లాడాలనుకున్నాను.

అతని గురించి మా సరంగు ఇంకా బాగా చెప్పేవాడు.

"అతను ఇప్పుడు సామాన్యమయిన మనిషిగా కనిపిస్తున్నాడు గాని, ఆ రోజులలో వట్టి చేతులతో పులులతో సైతం పోట్లాడేవాడు," అనేవాడు.

అప్పుడు రాత్రి ఎనిమిది గంటలయింది.

నేను సిల్వర్‌ను కలుసుకోవడానికి అతని రూమ్ దగ్గరకు వెళ్ళి లోపల గుసగుసలు వినిపించడంతో తలుపు తట్టబోయి ఆగిపోయాను.

వారు మాట్లాడుకొనేది మా గురించేనని గ్రహించగానే వారు మాట్లాడుకొనే మాటలను శ్రద్ధగా వినసాగాను.

వారి మాటలు వింటుంటే నాలో ఒక విధమయిన భయం చెలరేగింది.

"సిల్వర్! నెమ్మదిగా మాట్లాడు. మన మాటలు ఎవరయినా వింటే ప్రమాదం!" అన్నారెవరో.

"ఎవరొస్తారిప్పుడిక్కడికి. ఎవరొచ్చినా వారి పనంతే" అంది సిల్వర్ కంఠం.

"సిల్వర్! అసలు నీవు ఫ్లింట్ దగ్గర ఎలా చేరావు," అన్నారెవరో.

"నేను దొంగల నాయకుడు ఫ్లింట్ షిప్ మీద సరంగుగా ఉండేవాడిని. ఆ షిప్ పేరు వాల్రస్. మేమందరము కలిసి ఎంతో తెలివిగా షిప్‌లను దోచుకొనేవాళ్ళం. కాని, కొన్ని కారణాలవలన ఫ్లింట్, మేము కలిసి దొంగిలించినదంతా దాచేయవలసి వచ్చింది. మేమందరము కొంత కొంత డబ్బుతీసుకొని, మిగిలింది ఆ దీవిలో ఒక చోట దాచాం. దాని మ్యాప్ ఫ్లింట్ కుడిభుజం బ్రిల్ ఎత్తుకుపోయాడు. అది వీళ్ళకు దొరికింది. ఇప్పుడయినా మించిపోయింది లేదులే. అది మనచేతికి చిక్కడం, వీళ్ళను

ఇలాగే పైకి పంపంచివేయడం,'' అన్నాడు సిల్వర్ హుషారుగా.

''గుడ్! నీ ఆలోచన బావుంది కాని ఇంతకు మనం ఎంతమందిమి?''

''ఇప్పటికి మనం పన్నెండు మందిమి. ఇంకా మిగిలిన ముగ్గురూ కూడ మనతో చేరితే మనం పదిహేను మందిమి అవుతాం, వాళ్ళు నలుగురే అవుతారు. కాని ఆ మిగిలిన ముగ్గురిలో ఎవడూ మనలో చేరరు,'' అన్నాడు సిల్వర్.

నేనిక వారిమాటలు వినలేకపోయాను. వెంటనే నేను భూపతిగారికి, డాక్టర్ మూర్తికి ఆ విషయం చెప్పాలని వెళ్ళాను.

అక్కడ డాక్టర్ మూర్తి, భూపతిగారు, కెప్టెన్ జగదీశ్ కలిసి ఏదో చర్చించుకొంటున్నారు.

నేను వారిదగ్గరకు వెళ్ళి జరిగినదంతా వివరంగా చెప్పాను.

నేను చెప్పిన మాటలు విని ముగ్గురూ ఆశ్చర్యపోయారు.

మా నలుగురికి మాలో చేరే మిగిలిన ముగ్గురూ ఎవరో తెలియలేదు. మేము ఇప్పటినుంచి తగిన జాగ్రత్తలో మసలుకోవాలనుకున్నాం.

మా షిప్ ఏవో చిన్న చిన్న దీవులను దాటుకొంటూ ముందుకు పోతూంది.

# 5

నాలుగురోజులు మా ప్రయాణం సాఫీగా జరిగి పోయింది.

ఐదోరోజున దూరంగా ఏదో దీవి కనిపించసాగింది. అది ఇంతకుముందు కనిపించిన దీవులలా లేక ఇది ఏదో

ప్రత్యేకత నింపుకొన్నట్లుగా ఉంది.

"మీలో యెవరయినా ఇంతకుముందు ఈ దీవిని చూశారా?" అన్నాడు జగదీశ్ దగ్గరవుతున్న దీవిని చూపిస్తూ.

"నేను చూశాను సార్!" అంటూ ముందుకొచ్చాడు సిల్వర్.

"నీ వెప్పుడు చూశావు?"

"నేను ఇంతకుముందు పనిచేసిన షిప్ యిటువైపు వచ్చింది. అప్పుడు దీనిని చూశాను. ఈ దీవిమీదకు సామాన్యంగా ఎవరూ వెళ్ళరు" అన్నాడు సిల్వర్.

"సరే! ఎవరూ వెళ్ళకపోతే మనమే వెడదాం. షిప్‌ను ఇక్కడ ఆపండి," అన్నాడు కెప్టెన్ జగదీశ్.

నేనిప్పుడు గుర్తుపట్టాను దీవిని. అదే మాకు కావలసిన దీవి. ఆ దీవిలోనే ఫ్లింట్ ముఠా గుప్తధనం దాచారు.

"చూచారా, మనకు దూరంగా ఒక దిబ్బ కనిపిస్తుంది కదండి. దానిని డమాస్ దిబ్బ అంటారు. దానికి కొంచెం దూరంలో నున్న కొండను టెలిస్కోప్ కొండ అంటారు. దానిమీదకు ఎక్కి చూస్తే దూరాన్న ఉన్నవికూడ టెలిస్కోప్‌లో చూచినట్లు కనిపిస్తాయి," అన్నాడు సిల్వర్.

సిల్వర్ ఆ వివరాల నన్నింటిని మాకు అందించి వీలయినంత తొందరగా ఆ ధనాన్ని చేజిక్కించుకోవడానికి చూస్తున్నాడని గ్రహించాం.

నేను ఆ ద్వీపంమీద సౌందర్యాన్ని తిలకిస్తున్నాను.

ఆ ద్వీపంమీద ఎత్తయిన బూడిదరంగు చెట్లు దట్టంగా పెరిగివున్నాయి. వాటితోబాటు మధ్యమధ్య దేవదారు చెట్లుకూడ వున్నాయి. కొండలయొక్క గుట్టలు చెట్ల

కంటే ఎత్తుగా వుండి దూరంనుంచి నున్నగా కనిపిస్తున్నాయి. చెట్ల ఆకులమీద మంచు బిందువులు ఇంకా ఆకులమీదనే నిలబడి ముత్యాలవలె మెరుస్తున్నాయి సూర్యరశ్మికి. టెలిస్కోప్ కొండ అన్నింటికంటె ఎత్తుగా కనిపిస్తుంది.

ఆ ద్వీపానికి చెందిన రకరకాల పక్షులు మా షిప్ మీద నుంచి ఎగురుతూ రకరకాల ధ్వనులు చేస్తున్నాయి. సముద్రం మధ్యనుంచి బ్రహ్మాండమయిన కెరటాలు వచ్చి షిప్ ను తాకి షిప్ ను ఊయలలా ఊపుతున్నాయి.

షిప్ మీద వున్న కళాసీలను చూస్తుంటే భయమేస్తుంది. వారిలో వున్నకొలది తిరుగుబాటు లక్షణాలు ఎక్కువవుతున్నాయి.

అందరూ మావైపు అదోకలా చూస్తున్నారు. సిల్వర్ ఒక్కడే ఎంతో మర్యాదగా కనిపిస్తున్నాడు. మునుపటి కంటె ఇప్పుడు ఇంకా ఎంతో వినయంగా కెప్టెన్ చెప్పిన పనులను చేస్తున్నాడు. అంతమందిలో మాకు సహకరించే ముగ్గురూ ఎవరో తెలుసుకోవడం కష్టంగా వుంది.

వాళ్ళందరూ కెప్టెన్ చెప్పిన పనిని ఎంతో నిర్లక్ష్యంగా చేస్తున్నారు.

కెప్టెన్ జగదీశ్, భూపతిగారిని పక్కకు తీసుకుపోయి "ఇప్పుడు వారిలో తిరుగుబాటు లక్షణాలు ఎక్కువగా కనిపిస్తున్నాయి. నేను వాళ్ళకు ఏదయినా చెబితే ఎదురు తిరిగేటట్లున్నారు. వారికే పని చెప్పకుండా ఊరుకుంటే, మనం వాళ్ళ రహస్యం కనిపెట్టినట్లు గ్రహిస్తారు. ఇప్పుడు మనం ఏం చేద్దామంటారు?" అన్నాడు.

"ఏం చేస్తే బావుంటుందో మీరే చెప్పండి," అన్నారు భూపతిగారు.

"ఈ పగలంతా వారి నా దీవిలోకి పోయి విశ్రాంతి తీసుకోమంటాను. అందరూ వెడితే వాళ్ళు తిరిగి షిప్ మీదకు తిరిగి రాకుండా షూట్ చేసేసి అప్పుడు మనం ఆ దీవిలోకి వెడదాం. ఒక వేళ వాళ్ళు వెళ్ళకపోతే మనం దీవిమీద వుండేవారితో పోరాడుదాం. అయినా ఇది కష్టమయిన పనేగాని తప్పదు. మనం షిప్ దిగితే మనకు రక్షణ లేదు," అన్నాడు కేప్టెన్ జగదీశ్.

ఈ లోపున డాక్టర్ మూర్తికూడ అక్కడకు చేరుకొని జగదీశ్ చెప్పినది విని దానిని బలపర్చాడు. భూపతి గారుకూడ దానికి ఒప్పుకున్నారు.

కెప్టెన్ వారి దగ్గరకు వెళ్ళి, "మీరు భూమిమీద అడుగుపెట్టి చాలా రోజులయింది. ఈ రోజంతా దీని మీదకు వెళ్ళి విశ్రాంతి తీసుకోండి" అన్నాడు.

కెప్టెన్ మాటలు విని వారందరూ ఉత్సాహంతో గంతులు వేసారు.

వారిలో తొమ్మిదిమంది మాత్రమే బోట్లు వేసుకొని తీరంవైపు బయలుదేరారు. మిగిలిన ఆరుగురు షిప్ మీదనే వుండిపోయారు.

వారందరూ అంత ఉత్సాహంగా ఎందుకు గంతులు వేసారో నాకు తెలియలేదు. వాళ్ళు ముందుగా గుప్తధనాన్ని చేజిక్కించుకోవా లనుకున్నారో, ఏమో.

కొంతమంది షిప్ లో వుండిపోయారు గనుక, ప్రస్తుతం వారివలన మాకేమి భయం లేదని నిశ్చయించుకున్నాను.

నేనుకూడ వారితో వెళ్ళి, తీరంమీదకు వెళ్ళగానే వాళ్ళనుంచి విడిపోయి, వాళ్ళ మూమెంట్స్ గమనించా లనుకున్నాను.

అనుకున్న వెంటనే భూపతిగారి అనుమతి తీసుకొని, అప్పుడే బయలుదేరుతున్న చివరి బోటులో కూర్చున్నాను.

# 6

బోట్లు ముందుకు పోతున్నాయి. ఆ బోట్లలో వున్న వాళ్ళు నావైపు గుర్రుగా చూస్తున్నారు.

నా గుండెలు వేగంగా కొట్టుకోసాగాయి.

నేను ఇప్పుడు శత్రువుల దగ్గరున్నాను. వాళ్ళు నన్ను చంపేసినా మాకు తెలియదని అనినా అనవచ్చు. ఆ ఆలోచన రాగానే వణికిపోయాను.

నేను అనవసరంగా వారితో బయలుదేరినందుకు నన్ను నేనే తిట్టుకున్నాను మనస్సులో.

నేనున్న బోట్ తీరాన్ని చేరగానే క్రిందకు దుమికి చెట్ల చాటుకు తప్పుకున్నాను. నన్నెవరూ గమనించలేదు.

నేనక్కడ కొంతసేపు నిలబడి, చుట్టుప్రక్కల చూచుకొంటూ ముందుకు నడిచాను.

అక్కడక్కడ గుబురులో వున్న పక్షులు నన్ను చూచి పైకి ఎగురుతున్నాయి. అప్పటివరకు ఆకుల అడుగున దాగిన పురుగులు నెమ్మదిగా పైకి వస్తున్నాయి.

అంతలో నాకు దగ్గరలో ఏవో మాటలు వినిపించసాగాయి. అది సిల్వర్ కంఠం.

నాకు భయంవేసి శత్రువుల కళ్ళ బడకుండా ఒక చెట్టు చాటున నక్కాను.

ఇప్పుడు నాకు సిల్వర్, అతని అనుచరులు స్పష్టంగా కనిపిస్తున్నారు గాని, నేను వారి కంటికి కనిపించను.

సిల్వర్ తన ఎదురుగావున్న ఖలాసీవైపు తిరిగి మాట్లాడుతున్నాడు. అతని కంఠం గంభీరంగా వినిపిస్తుంది.

ఎదురుగా వున్న కళాసీ వణికిపోతున్నాడు.

"ఒరే! నీవంటే నాకు చాలా ఇష్టం. నీ మంచికోసమే నేను చెబుతున్నాను. నీవు మాతో కలిసిపో. నీవు అంగీకరించకపోతే వీళ్ళందరూ నిన్ను చంపితేగాని ఊరుకోరు" అన్నాడు సిల్వర్ మిగిలినవారిని చూపిస్తూ.

"సిల్వర్! నీవెన్ని చెప్పినా నేను నీ ముఠాలో చేరి హత్యలు, దోపిడీలు చేయలేను" అన్నాడు ఆ కళాసీ వణుకుతూనే.

అంతే! మిగతా కళాసీ లందరూ అతనిమీదపడి తలొక దెబ్బ వేసారు. అతను చేసే ఆర్తనాదాలకు చెట్ల మీద పక్షులు చెల్లాచెదురయినాయి.

వారిలో వొకడు రివాల్వర్ తీసి అతనిని కాల్చేసాడు. ఆ కళాసీ కిక్కురుమనకుండా తల వాల్చేసాడు.

నేను వారి కంటబడితే నా పని అంతేనని గ్రహించి ముందుకు పరుగుపెట్టాను.

నాకు కొంచెం దూరంలో విశాలమయిన మైదానం కనిపిస్తుంది. ఆ మైదానంలో చిన్న దిబ్బ ఉంది. నేను పరుగుపెడుతూనే హఠాత్తుగా ఆగిపోయాను.

నాకు ఎదురుగా ఉన్న దిబ్బమీద నుంచి రాళ్ళు, రప్పలు క్రిందకు దొర్లసాగాయి. కొంత సేపటికి ఆ దిబ్బ మీద ఒక ఆకారం ప్రత్యక్షమయింది. అది ఎంతో వేగంగా క్రిందకు గెంతుకొంటు రాసాగింది. అది ఏ జంతువో, ఏమిటో తెలియటం లేదు.

నేను వెనక్కి వెడితే సిల్వర్ ముఠా, నా ముందు నాకు తెలియని ఆకారం.

నేను తెగించి వెనక్కి తిరిగి పరుగుపెట్టాను. ఇరవై

అడుగులు పరుగుపెట్టకముందే ఆ ఆకారం ఎలా వచ్చిందో నా ముందు ప్రత్యక్షమయింది.

అదిప్పుడు స్పష్టంగా కనిపిస్తుంది. ఆ ఆకారం ఏ జంతువో కాదు. మనిషే! దూరంనుంచి చూడటంవలన ఏదో ననుకొని భయపడవలసి వచ్చింది. ఆ ఆకారం మనిషని తెలిసి, తరువాతకూడ నాలో భయం తగ్గలేదు.

ఆ అడవిమనిషి నన్ను చూచి కొద్దిగా వణుకుతూ నన్ను పరీక్షగా చూస్తున్నాడు.

నా కతనిని చూస్తుంటే కొంచెం భయం తగ్గింది.

"ఎవరు నువ్వు" అన్నాను కొద్దిగా జంకుతూనే.

"బెన్ గన్" అన్నాడు. అతని కంఠం త్రుప్పుపట్టిన డబ్బాలో గులకరాళ్ళు వేసి ఆడించినట్లుగా ఉంది.

"బెన్ గన్ అంటారు సార్ నన్ను. నేను బెన్ గన్ నండి బెన్ గన్ ని" అంటున్నాడు. అతను మాట్లాడేటప్పుడు మాటలను గుర్తుతెచ్చుకొంటూ మాట్లాడుతున్నాడు.

ఆ దీవిలో తెలుగుమాట్లాడే అడవిమనిషిని చూసి విస్తుపోయాను. వెంటనే తేరుకుని ఆశ్చర్యంగా నేనతనినే పరీక్షగా చూడసాగాను.

ఎండకు అతని శరీరం నల్లగా మాడిపోయి ఉంది. పెదవులు మొద్దుబారి లావుగా, బండగా ఉన్నాయి. తల, గడ్డం పెరిగిపోయి, జడలు కట్టినట్లున్నాయి. చిన్న గుడ్డపీలికను నడుంచుట్టూ కట్టుకున్నాడు. అదికూడ నల్లగా, చీకిపోయి ఉంది.

"నేను నాలుగు సంవత్సరాలనుంచి మనుష్యులను చూడలేదు. వారితో మాట్లాడలేదు. నేను ఈ దీవిలోకి

పారిపోయి దాక్కున్నాను సార్," అన్నాడు.

"ఎందుకు పారిపోయి దాక్కున్నావు?" అన్నాను ఆశ్చర్యంగా.

"నేను కెప్టెన్ ఫ్లింట్ ముఠాలోవాడిని. ఫ్లింట్ గొప్ప సముద్ర గజదొంగ. అతను దొంగిలించినదంతా ఈ దీవిలో రహస్యంగా ఉంచడానికి వచ్చాడు. అప్పుడు తనకూడ నలుగురిని తోడు తెచ్చుకున్నాడు. వారిలో నేనొకడిని.

తాను తీసుకువచ్చినదంతా మాచేత గోతులు తీయించి ఆ ధనాన్ని అందులో ఉంచి, మా నలుగురిని చచ్చి దెయ్యాలుగా ఆ ధనానికి కాపలా ఉండమని చెప్పి మమ్మల్ని కాల్చేసాడు. నాకు బులెట్ లోపలకు దూసుకు పోకుండా ఎముకకు తగిలి ఉండిపోయింది. నేను దానిని జాగ్రత్తగా తీసివేసి ఈ దీవిమీదనే ఒంటరిగా ఉంటున్నాను.

నేను ఈ దీవికి వచ్చినప్పటినుంచి అసలు మనుష్యులు తినే ఆహారం తిని ఎరుగను. అక్కడక్కడ దొరికిన నత్తలు, రొయ్యలు, చేపలు, పిట్టలను తింటు బ్రతుకుతున్నాను.

"నాకో తల్లికూడ ఉంది. ఆమె ఈపాటికి చనిపోయే ఉంటుంది" అన్నాడు కళ్ళనీళ్ళు పెట్టుకుంటూ.

అతనికి దూరంగా ఉన్న మా షిప్ కనిపించింది.

"ఆ షిప్ ఎవరిదండి. మీదేనా?"

"అవును."

"అయితే నాకు కాస్త భోజనం పెట్టండి. నా దగ్గర చాలా డబ్బు ఉంది. అదంతా మీకే ఇచ్చేస్తాను."

"నేను షిప్ మీదకు వెళ్ళగానే నీకు తప్పకుండా భోజనం పెడతాను."

"ఏమండి. ఇప్పుడు మీరు షిప్ మీదకు వెళ్ళరా?"

"ఊహు! ఇప్పుడు షిప్ మీదకు వెళ్ళాలంటే కుదరదు. మా బోట్లు సిల్వర్ అధీనంలో ఉన్నాయి," అంటూ అతనుకూడ ఫ్లింట్ ముఠాలోవాడే కనుక జరిగినదంతా చెప్పాను.

"మీరు చెప్పిన సిల్వర్ కు ఒక కాలు లేదుకదండి?"

"అవును. వాడే."

"మీరు నామాట నమ్మండి. నేను మీకు ఏ సహాయం కావాలన్నా చేస్తాను. ఈ దీవిలో నాకు తెలియనిది లేదు. అయితే మీరు నన్ను మీ వాళ్ళందరూ నమ్మితే, ఆ ఫ్లింట్ ఎక్కడ ఆ ధనాన్ని దాచింది అంతా వివరంగా చెబుతాను. మీరు నన్ను మీకూడ తీసుకుపోవాలి."

"మావాళ్ళు చాలా మంచివాళ్ళు. నిన్ను తప్పకుండా మాతోబాటు తీసుకువెడతాం."

"సిల్వర్ ముఠావాళ్ళు ఇప్పుడెక్కడ ఉన్నారు?" అడిగాడు అతను ఆతృతగా.

"ఆ చెట్లుచాటున" అంటూ అటువైపు చూపించాను.

"అయితే రండి. మనం ఈ చెట్లచాటునుంచి వెళ్ళి, ఒక బోట్ లో కూర్చొని షిప్ దగ్గరకు చేరుకోవచ్చు."

నేను, బెన్ గన్ చెట్లచాటునుంచి తీరంవైపు బయలుదేరాం.

నేను బెన్ గన్ తోపాటు పరుగుపెట్టలేక వెనుక, ముందు చూచుకోకుండా పరుగుపెడుతూ ఒక్కసారిగా "అబ్బా" అంటూ కాలుపట్టుకు కూర్చుండిపోయాను.

నా కేక విని బెన్‌గన్ ఆగిపోయి నా దగ్గరకు వచ్చాడు. నా కాలు దగ్గరనుంచి చరచరా ఏదో ప్రాకిపోతూంది.

బెన్‌గన్ నా కాలుపట్టుకు చూచి "ఇప్పుడే వస్తా నుండండి," అంటూ చెట్లలోకి పరుగు పెట్టాడు.

నా శరీరంలోకి విషం ఎక్కుతుంటే నెమ్మదిగా స్పృహ తప్పి పడిపోయాను.

## 7

నాకు స్పృహ వచ్చేటప్పటికి బెన్‌గన్ ఆతృతగా నా ముఖంలోకి చూస్తున్నాడు.

నేను లేచి కూర్చొని నన్ను పాము కరచిన చోట చూచుకున్నాను. అక్కడ ఏవో ఆకు పసరులు పిండి నట్లుంది.

"నీవు నా ప్రాణాలు కాపాడావు. నీ మేలు ఎప్పటికి మరచిపోలేను" అన్నాను బెన్‌గన్ వైపు చూస్తూ.

"అంత మాటనకండి. మనమిప్పుడు మిత్రులం, అంతే!" అన్నాడు.

మేము తిరిగి చెట్లు చాటుచేసుకొని నడుస్తున్నాం. మాకు కొంచెం దూరంలో షిప్ కనిపిస్తుంది. సముద్ర తీరం నుంచి ఎవరో పరుగెడుతున్నారు. వారిలో చివరి వాడు కుంటుతున్నాడు. అతను సిల్వరని గ్రహించాను. షిప్‌లోనుండి కాల్పులు వినిపిస్తున్నాయి.

"అదిగో మావాళ్ళు ఆ షిప్‌లో ఉన్నారు. వారికి నిన్ను పరిచయం చేస్తానురా," అన్నాను బెన్‌గన్‌తో.

అతను కొద్దిసేపు ఎందుకో మౌనంగా ఉండిపోయాడు. ఆ తర్వాత—

"వద్దండి. నాకేదో భయంగా ఉంది. మీరు నాగురించి మీ వాళ్ళతో చెప్పండి. వాళ్ళు నన్ను కలుసుకోవాలను

కుంటే మీరు నన్ను ఎక్కడ చూచారో అక్కడికే రండి. మీరు తప్పించి ఇంకెవరయినా వస్తే చేతిలో తెల్ల గుడ్డ పట్టుకు రమ్మనండి.''

''అయితే ఇప్పుడు నీవు నాతో రావా?''

''రాలేను. క్షమించండి,'' అంటూ అతను వెనుదిరిగి వడివడిగా అడవిలోకి వెళ్ళిపోయాడు.

నేను అయిదునిముషాల తర్వాత చెట్ల చాటునుండి బయటకు వచ్చి అక్కడే పొంచివున్న సిల్వర్ ముఠాకు దొరికిపోయాను. నాకు దుఃఖం ముంచుకువచ్చింది.

సిల్వర్ ముఠాలో వాళ్ళందరూ నన్ను అక్కడికక్కడే చంపాలన్నారు గాని, సిల్వర్ అందుకు ఒప్పుకోలేదు.

ఆ రాత్రి హఠాత్తుగా సిల్వర్ ముఠా షిప్ మీదకు దండెత్తింది.

వారు డాక్టర్‌ను, కెప్టెన్‌ను, భూపతిని బంధించారు.

సిల్వర్ ముఠా అంతా వారిని చూచి పరిహసించింది. షిప్ క్షణాలలో వాళ్ళకు వశమైపోయింది.

''మీరు మీ ప్రాణాలు రక్షించుకోవాలనుకుంటే, మీరు మీ దగ్గరవున్న మ్యాప్ మాకు ఇచ్చేయండి,'' అన్నాడు సిల్వర్.

''మమ్మల్ని ప్రాణాలతో వదులుతావని నమ్మకం ఏమిటి?'' అన్నాడు కెప్టెన్.

''మీరు నా మాట నమ్మాలి. ఈ సిల్వర్ ఇంతవరకు అన్నమాట తప్పి ఎరగడు,'' అన్నాడు మీసం మెలివేస్తూ.

నలుగురూ కొంచెంసేపు ఆలోచించుకొని ఆ షరతుకు ఒప్పుకొని మ్యాప్ ఇచ్చేసారు.

తరువాత సిల్వర్ ఇంకొక కండిషన్ పెట్టాడు.

డాక్టర్ మూర్తి తమ అనుచరులలో గాయాలు తగిలిన వారికి కట్లుగట్టి, తగిన వైద్యం చేయాలి, అన్నాడు.

ఆ షరతుకు డాక్టర్ మూర్తి ఒప్పుకోలేదు.

అంతవరకు నన్ను వారి కంట పడనివ్వలేదు. అప్పుడు నన్ను వారికి చూపించి, "మీ అనంత్ బ్రతికి వుండా లంటే నేను చెప్పినట్లు చేయండి," అన్నాడు.

వారందరూ నన్ను చూడగానే ఆశ్చర్యపోయారు.

డాక్టర్ మూర్తి చివరకు వాళ్ళ షరతుకు ఒప్పు కున్నాడు. అప్పటికప్పుడే అందరి గాయాలకు కట్లు కట్టాడు.

సిల్వర్ అందరి కట్లు విప్పి, ఆ ముగ్గురిని దీవిలోకి నిరా యుధులుగా పంపించివేసాడు.ఏవో కొన్ని ఫుడ్ పాకెట్స్ మాత్రం వారికిచ్చాడు.

వాళ్ళు వెళ్ళిపోయిన వెంటనే సిల్వర్ ముఠాలో వాళ్ళందరూ సిల్వర్ మీదకు తిరగబడ్డారు.

అప్పటివరకు వారి నాయకుడు సిల్వర్. ఇక సిల్వర్‌ను తమ నాయకుడిగా అంగీకరించమన్నారు.

"కారణం?" అన్నాడు సిల్వర్ ధీమాగా.

"నీవు చేసే పనులు మాకు నచ్చటంలేదు."

"ఎందుచేత?"

"మన సిబ్బందిలో కొంతమంది చావడానికి, మన కుట్ర అంతా నాశనమవడానికి కారణం నీవే!" అన్నా డొకతను.

"ఓహో! అలాగా."

"అవును. అదీగాక శత్రువులు మనచేతికి దొరికితే వాళ్ళను చంపనివ్వలేదు. తిరిగి వాళ్ళను వెళ్ళిపోనిచ్చావు.

ఈ అనంత్ నుకూడ చంపుదాం అంటే ఒద్దు అంటున్నావు. ఎందుకలా చేసావు,'' అన్నాడు కోపంగా మరొకతను.

''అంతేనా! ఇంకేమయినా వున్నాయా?''

''అంతే.''

''అయితే వినండి చెబుతాను. మీరు నా మాటను వ్యతిరేకించి, నా మీదకు తిరగబడుతున్నారు. మనలో మనకే ఐక్యత లేనప్పుడు, ఇక మనం ఏ పనిని చేయలేం. మనం వేసుకున్న ప్లాన్ ముందుగానే వాళ్ళకు తెలిసి పోయింది. అందుకే షిప్ మీద వున్న మనవాళ్ళను బంధించి, మనమీదకు కాల్పులు సాగించారు.

ఇక వాళ్ళను ప్రాణాలతో ఎందుకు వెళ్ళనిచ్చామంటున్నారు. వాళ్ళను చంపటంవలన మనకు ప్రయోజనం లేదు. అలాగే ఇతనిని చంపడంవలన కూడ మనకు ప్రయోజనం లేదు. ఇతను బ్రతికి వుండటంవలన వారిని మన యిష్టమొచ్చినట్లు ఆడించవచ్చు. మ్యాప్ మనచేతికి వచ్చిన తరువాత ఇంక వాళ్ళను చంపడం అనవసరం. ఇప్పుడు వాళ్ళు కోరలు తీసిన పాములు. కోరలు తీసిన పాములు ఏమీ చేయలేవు'' అన్నాడు సిల్వర్.

అందరూ మౌనంగా వుండిపోయారు. కొందరు పైకి ఏదో చెప్పాలని వున్నా నోరు మూసుకొని వున్నారు.

''మీరు నా నాయకత్వంలో వుంటారా? ఉండరా?'' అన్నాడు సిల్వర్ కఠినంగా వారందరివైపు చూస్తూ.

''ఉంటాం!'' అన్నారందరూ ఏకంగా.

ఆ రాత్రికి ఆ వ్యవహారం అయిపోయింది. తరువాత అందరూ త్రాగుతూ కూర్చున్నారు.

సిల్వర్ నలుగురిని కాపలాకు నియమించాడు.

నాకు సిల్వర్ ను చూస్తుంటే ఆశ్చర్యమేసింది. తన

మీదకు తిరుగుబాటు చేసినవారందరిని క్షణంలో అణిచి వేసాడు.

అలా ఆలోచనలతో నిద్రపోయాను.

# 8

తెల్లవారగానే డాక్టర్ మూర్తి అన్న మాటప్రకారం షిప్ మీదకు వచ్చి గాయాలు తగిలినవారికి కట్లు తనిఖీ చేసి, తనదగ్గర వున్న మందులలోవి ఏవో కొన్ని ఇచ్చాడు.

నన్ను చూచి చిరునవ్వు నవ్వి, "సిల్వర్! నేను అనంత్‌తో మాట్లాడాలి," అన్నాడు.

సిల్వర్ నావైపు చూచి ఏమనుకున్నాడో ఏమో, దూరంగా వెళ్ళి నిలుచున్నాడు.

"అనంత్! నీవు వీళ్ళకు చిక్కావనుకున్నాం గాని, నిన్నింకా వీళ్ళు ప్రాణాలతో వుంచుతారనుకోలేదు."

"నన్ను వాళ్ళందరూ చంపేయటానికి తహతహ లాడుతున్నారు గాని, సిల్వర్ వారిని వారిస్తున్నాడు సార్!" అని అంతకుముందు జరిగినదంతా వివరించాను.

"సరే! ఇక నే వెడతాను. అనంత్! నీవు జాగ్రత్తగా వుండు," అంటూ డాక్టర్ మూర్తి అక్కడినుంచి వెళ్ళి పోయాడు.

డాక్టర్ మూర్తి వెళ్ళిపోగానే కళాసీలు మాకు భోజన పదార్థాలు వడ్డించారు. నాకు ఉదయాన్నే భోజనం ఏమిటో అర్థంకాలేదు గాని, తరువాత తెలిసింది. భోజనాలు అయిపోయిన తరువాత అందరూ గుప్తధనాన్ని వెదక టానికి బయలుదేరాలని, అందుచేత ఇప్పుడే భోజనాలు పూర్తి చేసారు.

సిల్వర్ పెంపుడు చిలక అటు ఇటు ఎగురుతూ హడా విడి చేయసాగింది.

ఎవడో ఒక కళాసీ దానికి ఎందు(దాక్ష పెట్టాడు తిన డానికి. అది దాని నొకసారి కొరికి, "ఛీ! ఇవేమి కాయలు. చేదుగా వున్నాయి" అందా చిలుక.

"ఏం బాగో లేవా."

"నీ ముఖం బావున్నాయి."

ఇక ఆ కళాసీ దానిని తిట్టుకుంటూనే వెళ్ళిపోయాడు.

సిల్వర్ ఎంతో ఉత్సాహంగా తన అనుచరులను ఛలోక్తులతో నవ్విస్తున్నాడు. మనుష్యులను మాటలతో బుట్టలో వేసుకోవటం సిల్వర్‌కు ఉగ్గులో నేర్పిన విద్యనుకుంటాను.

భోజనాలు పూర్తి చేసిన తరువాత అందరూ గుప్తధనం కోసం బయలుదేరారు. నా దగ్గర తప్పించి మిగిలినవారందరిదగ్గర ఆయుధాలు వున్నాయి. కొందరు ఏవో పరికరాలుకూడా మోసుకువస్తున్నారు.

మే మందరము బోట్స్ ఎక్కి దక్షిణంగా వున్న చిన్న నదివైపు బయలుదేరాం. అక్కడ ఒక నది వచ్చి సముద్రంలో కలుస్తుంది.

ఆ నదీముఖద్వారం దగ్గరకు వెళ్ళి అక్కడ ఆగాము. అక్కడినుంచి తూర్పుదిక్కున వున్న ఎత్తయిన పర్వతం వైపుకు నడవసాగాం. వారిలో ఒకరి తరువాత ఒకరు ఆ ద్వీప పటాన్ని పరిశీలిస్తున్నారు.

మాకు ఎదురుగా రెండు, మూడు వందలడుగుల ఎత్తు పీఠభూమి వుంది. దానికి రెండువైపులా రెండు పర్వతాలు వున్నాయి. వాటిలో కుడివైపున వున్నది టెలిస్కోప్ పర్వతం. పీఠభూమిమీద ఎత్తయిన దేవదారు వృక్షాలు పెరిగి వున్నాయి. వాటిమధ్య అల్లిబిల్లిగా పెరిగిన అడవి లతలు, అడవి పొదులు, అడవి మొక్కలు వున్నాయి.

వాళ్ళందరూ అడవి తీగలను, మొక్కలను నరుక్కుంటూ ముందుకు నడవసాగారు. వారి మధ్య నేను నడుస్తున్నాను.

ఆ ద్వీపంలో ఇంతవరకు చూచిన ప్రదేశంకంటే ఇది ఎంతో మనోహరంగా వుంది. అడవి పూలనుంచి వచ్చే సువాసనలు మనస్సును ఆహ్లాదపరుస్తున్నాయి.

ఆ విధంగా రెండు మైళ్ళు నడిచాం.

ముందు వెళ్తున్న వారు హఠాత్తుగా ఆగిపోయారు.

అక్కడొక చెట్టుక్రింద ఒక అస్థిపంజరం వుంది. దానికి చీకిపోయిన గుడ్డపేలికలు వ్రేలాడుతున్నాయి.

ఒకడు ముందుకువెళ్ళి ఆ అస్థిపంజరాన్ని సమీపించి దానికి వున్న గుడ్డపేలికలను పరీక్షించాడు.

"పాపం! ఎవడో కళాసీయే" అన్నాడు.

"కళాసీ కాకపోతే మహారాజు వస్తాడనుకున్నావా ఇక్కడకు. ఎవడో దీనిని ఇక్కడ పెట్టినట్లు తోస్తుంది. దానంతట అదే ఇక్కడ వుంటే ఇలా వుండదు" అన్నాడు సిల్వర్.

నాకు సిల్వర్ చెప్పింది నిజమనిపించింది. ఎందుకంటే ఆ అస్థిపంజరం ఎక్కడ వంకర లేకుండా నిదానంగా కూర్చోబెట్టినట్లుంది. దాని కాళ్ళు ఒక దిక్కును, చేతులు ఇంకొక దిక్కును సూచిస్తున్నట్లుగా వుంది.

"నాకే మనిపిస్తుందంటే ఈ అస్థిపంజరం దిక్కులేవో చూపించడానికి ప్రయత్నిస్తుంది. అక్కడ గుప్తధనం వుండవచ్చు. ఫ్లింట్ తెలివయినవాడు," అన్నాడు వారిలో ఒకడు.

"నాకు భయమేస్తుంది ఈ అస్థిపంజరాన్ని చూస్తుంటే

ఫ్లింట్‌కు డబ్బు అంటే ఆశ. వాడు చావటం కూడ పోలీసు కాల్పులలో దారుణంగా చచ్చాడు. వాడిప్పుడు దయ్యమై ఇక్కడ కాపలా ఉండవచ్చు," అన్నాడింకొక కళాసీ.

"ఏమయినా చచ్చినవాడు చచ్చినవాళ్ళ క్రిందనే లెక్క. మళ్ళీ మనల్ని పీకు తినడానికి వస్తాడంటే నమ్మను. అందులోను పగలు, ఇంత వెలుతురు ఉన్నప్పుడు అసలు రాడు. పదండి," అంటూ సిల్వర్ ముందుకు కదిలాడు.

ఇప్పుడు వాళ్ళందరూ సిల్వర్‌ను విడిచి దూరంగా వెళ్ళడానికి భయపడుతున్నారు. వారందరికి ఊపిరి గట్టిగా వదలాలంటే భయంగా ఉంది.

మేమిలా కొంతదూరం ప్రయాణించి ఆయాసం తీర్చుకోవడానికి ఒక చెట్టుక్రింద కూర్చున్నాం.

దూరంనుంచి సముద్రపు హోరు వినిపిస్తుంది.

సిల్వర్ దిక్సూచితీసి దిక్కులను చూస్తున్నాడు.

"నాకేమిటో భయంగా ఉంది. ఫ్లింట్‌ను తలచుకుంటుంటే కాళ్ళు గడగడలాడుతున్నాయి," అన్నాడొక కళాసీ.

"బ్రతికున్నప్పుడు పిశాచంలా ఉండేవాడు" అన్నాడింకొక కళాసీ.

వాళ్ళందరూ అస్థిపంజరాన్ని చూచినప్పటినుంచి బెదిరిపోయారు. ఫ్లింట్ గురించి మాట్లాడేటప్పుడు ఫ్లింట్ దయ్యం వింటుందేమోనన్నట్లు గుసగుసలాడుకొంటున్నారు.

మాకు అకస్మాత్తుగా దూరంగా ఉన్న చెట్లమీద నుంచి కీచుగొంతుకతో పాడుతున్న పాట ఒకటి వినిపించింది.

ఆ పాటను వినగానే కళాసీ లందరూ బెదిరిపోయారు.

పాట ఎంత హాఠాత్తుగా ప్రారంభమయిందో అంత హాఠాత్తుగానే ఆగిపోయింది.

అందరూ ఒకరి నొకరు కౌగలించుకు కూర్చునట్లు కూర్చున్నారు. ఇప్పుడు వారిని చూస్తుంటే ఎన్నో భయంకర హాత్యలు, దొంగతనాలు చేసిన హంతకులేనా అనిపిస్తుంది.

"బాబోయ్! అది ఫ్లింట్ పాడిన పాటే. ఫ్లింట్ అదే పాటను పాడేవాడు. ఇప్పుడు దయ్యమై వచ్చాడు," అన్నాడొక కళాసీ వణికిపోతూ.

సిల్వర్ ముందు భయపడినా తరువాత ధైర్యం తెచ్చుకొని "పిరికి సన్యాసుల్లారా! వూరికే భయపడతారెందుకు. దెయ్యమయితేనేం మీదపడి పీక్కుతింటుందా ఏం? అది దెయ్యం అయివుండదు. ఎవడో మనిషే మనల్ని భయపెట్టడానికి చూస్తున్నాడు," అన్నాడు ఏదో ఆలోచిస్తూ.

సిల్వర్ మాటలతో కళాసీ లందరికి కొంచెం ధైర్యం వచ్చింది.

మళ్ళీ హాఠాత్తుగా ఆ కీచు కంఠం వినిపించింది.

"డార్బీ! రమ్ తీసుకురారా. ఒరే డార్బీ రమ్ తీసుకురా."

"అదే... అదే. ఫ్లింట్ దయ్యమే. ఫ్లింట్ అలాగే అనేవాడు బ్రతికి ఉన్నప్పుడు. సందేహం లేదు. అది ఫ్లింట్ కంఠమే!" అన్నాడు వారిలో ఒకడు.

వారిలో ఇంకొకడు బైబిల్ లోని ప్రార్థనలు చదువసాగాడు.

"తమాషాగా ఉంది. డార్బీ పేరు తెలుసున్నవాళ్ళు

ఎవరున్నా రిక్కడ. సరే. ఏమయితే అయింది. అది ఫ్లింట్ దయ్యమైనా, భూతమయినా ఫ్లింట్ బ్రతికుండగా జడవనిది, ఫ్లింట్ చచ్చిన తరువాత జడుస్తానా'' అన్నాడు సిల్వర్.

కళాసీ లందరూ వణికిపోతున్నారు. సిల్వర్ దయ్యాన్ని అవమానిస్తున్నందుకు వారికి సిల్వర్ మీద ఎక్కడలేని కోపంగా ఉంది.

వారిలో ఒకడు తెగించి ''సిల్వర్! ఫ్లింట్ గారికి అసలే కోపం ఎక్కువ. ఇప్పుడు వారు దెయ్యమై వచ్చారు. వారినేమీ అనకు. మనకు ఫ్లింట్ గారితో గొడవెందుకు'' అన్నాడు ఫ్లింట్ మీద భయభక్తులు ప్రదర్శిస్తూ.

''ఫ్లింట్ దెయ్యమా? ఆ కంఠం దెయ్యాని దనుకోను. జాగ్రత్తగా ఆలకించు. ప్రతిధ్వని వినిపిస్తుంది. అసలు దెయ్యాలకు నీడపడదు. అవి మాట్లాడితే ప్రతిధ్వని వినిపించదు'' అన్నాడు సిల్వర్.

''అయితే మరెవరు?''

''ఎవరో మనిషే'' అంటూ సిల్వర్ ఆ మాటలను జాగ్రత్తగా ఆలకిస్తూ ''అది బెన్‌గన్ కంఠంలాగుంది'' అన్నాడు.

''ఏమిటి? బెన్‌గన్ కంఠమా?''

''అవును. జాగ్రత్తగా ఆలకించండి.''

వాళ్ళు కొంతసేపు నిశ్శబ్దంగా ఉండి ''నిజమే! అది బెన్‌గన్ కంఠంలాగుంది'' అన్నారు.

''మరి బెన్‌గన్ చచ్చినట్లున్నాడు.''

''వెధవ ప్రశ్నలు వేయక పదండి'' అన్నాడు సిల్వర్ కోపంగా. సిల్వర్ ఎన్ని చెప్పినా వారికి అది దెయ్యమనే

నమ్మకం పోలేదు.

సిల్వర్ తిట్టగానే అందరూ ముఖాలు మాడ్చుకున్నారు.

"అలా ముఖాలు మాడ్చుకోకండి! వెధవ అంటే వెయ్యి సంవత్సరాలు ధనంతో వర్ధిల్లమని" అంది అప్పటి వరకు అటు ఇటు ఎగురుతున్న సిల్వర్ ముద్దుల చిలక.

తిరిగి అందరూ లేచి ముందుకు బయలుదేరారు.

కొంచెం దూరంలో మూడు దేవదారు చెట్లున్నాయి. అవి అక్కడ ఉన్న అన్ని చెట్లకంటే ఎంతో ఎత్తుగా లావుగా వున్నాయి.

ఆ చెట్లను చూడగానే అందరూ ఉత్సాహంతో గెంతులు వేస్తు అక్కడకు పరుగుపెట్టారు. సిల్వర్, నేను వెనుకబడిపోయాం. సిల్వర్ కుంటుకుంటూ నడుస్తున్నాడు. అతని ముందు నేను నడుస్తున్నాను.

ముందుకు పరుగుపెట్టిన కళాసీలు మధ్య చెట్టుదగ్గర ఆగి అందరూ ఒక్కసారిగా వెర్రికేక వేసారు.

మేము ఇద్దరము ఆ చెట్టును సమీపించి చూచాం.

ఆ చెట్టుదగ్గర పెద్ద గొయ్యి త్రవ్వి ఉంది. ఆ గోతిలో అడ్డదిడ్డంగా పెరిగిన గడ్డి ఉంది.

"ఎవరో త్రవ్వేసారు" అన్నా రంతా.

వారిలో ఒకడు ఆ గోతిలోకి దిగి చేతులలో మట్టిని పెళ్ళగించి చూస్తుంటే, ఇంకొకడు తాము వచ్చిన దారి తప్పు ఏమోనని మ్యాప్ చూడసాగారు.

"ఇన్ని వందల మైళ్ళు వచ్చినందుకు ఏం మిగిలింది మనకు" అన్నాడు ఒక కళాసీ ఉద్రేకంగా.

"పచ్చగడ్డి" అని టక్కున సమాధాన మిచ్చింది సిల్వర్ భుజంమీద ఉన్న చిలక.

ఆ కళాసీ దానిని నమిలి మ్రింగేసేటట్లు చూశాడు.

వారిలో ఒకడు ఉన్నట్లుండి "ఇది అంతా ఈ ఇద్దరే చేసారు. ముందు వీళ్ళను చంపితే అది ఎక్కడ ఉందో తెలుస్తుంది," అన్నాడు.

అంతే. అందరి చూపులు మా వైపుకు తిరిగాయి. అప్పుడు వారి కళ్ళల్లో ఏదో రాక్షసిశక్తి ఉన్నట్లుగా వారి కళ్ళు ఎర్రగా అగ్నిగోళాలవలె మెరుస్తున్నాయి.

అందరూ ఒక్కసారిగా ముందుకు రాబోయారు.

అంతే!...

"ధన్... ధన్" మంటూ గన్స్ గర్జించాయి చెట్ల చాటునుంచి.

నలుగురు కళాసీలు నేలకూలారు.

మిగిలినవాళ్ళు గన్స్ తీయబోయారు.

మరల చెట్లచాటునుంచి గన్స్ గర్జించాయి.

చెట్టున వున్న పండుటాకు రాలినట్లుగా వరుసగా నేల కూలారు, మిగిలినవాళ్ళు.

నేను, సిల్వర్ ఆశ్చర్యపోయాం, ఆ సమయంలో మాకు సహాయం చేసినవాళ్ళు ఎవరో తెలియక.

చెట్లచాటునుంచి డాక్టర్ మూర్తి, బెన్‌గన్, భూపతి గారు బయటకు వచ్చారు. వారి చేతులలో ఉన్న గన్స్ నుంచి ఇంకా పొగ వస్తూంది.

# 9

"నమస్కారం భూపతిగారు. సమయానికి వచ్చి రక్షించారు" అన్నాడు సిల్వర్, భూపతిగారికి వినయంగా నమస్కరిస్తూ.

"తప్పు తప్పు. నమస్కారం కాదు. తిరస్కారం అనాలి," అన్నది సిల్వర్ భుజంమీద వున్న చిలక.

సిల్వర్ దానివైపు కోపంగా చూశాడు. అది ముఖం తిప్పుకొని ఎటో చూడసాగింది.

సిల్వర్, బెన్‌గన్ వైపు తిరిగి "కులాసాగా ఉన్నావా బెన్‌గన్" అన్నాడు.

"కులాసాయే. నీవు కులాసాగా ఉన్నావా?"

"ఆఁ!" అన్నాడు సిల్వర్.

సిల్వర్‌ను పూర్తిగా మన్నించి మాలో కలుపుకోవడానికి అంగీకరించారు భూపతిగారు.

మేము అయిదుగురము బోట్స్ దగ్గరకు చేరుకున్నాం. బెన్‌గన్ దారిచెబుతుంటే బోట్స్ ప్రయాణించసాగాయి.

దారిలో డాక్టర్ మూర్తి నాకు చెప్పాడు.

"బెన్‌గన్ తనతోటి అనుచరుడి శవాన్ని ఒకటి అక్కడ ఉంచి గుప్తధనాన్ని చేజిక్కించుకున్నాడు. అంతకుముందునుంచే బెన్‌గన్ ఒక గుహలో ఉంటున్నాడు. ఈ గుప్తధనాన్నంతా ఆ గుహకు తరలించాడు. నీతో మాట్లాడిన తర్వాత నేను బెన్‌గన్‌ను కలుసుకుని అన్నీ మాట్లాడాను.

"తర్వాత సిల్వర్ అనుచరులు నిధికోసం బయలుదేరటం చూశాము. ఇక్కడ వారికి ఆ ధనం కనిపించకపోతే నిన్ను ఏం చేస్తారోనన్న భయంతో షిప్‌లో ఆయుధాలు తీసుకొని ఇక్కడకు వచ్చాం. బెన్‌గన్ పరుగు పెట్టడంలో మంచి నేర్పరి. అందుచేత మాకంటె ముందుగా ఇక్కడకు వచ్చి సిల్వర్ అనుచరులను భయపెట్టాడు. ఈ లోపున మేముకూడ ఇక్కడకు చేరుకున్నాం. అదృష్టవశాత్తు షిప్‌కు కాపలా వుంచినవాడు మనవాడయ్యాడు" అన్నాడు డాక్టర్ మూర్తి.

అదంతా విని, "నేను అనంత్‌తో వున్నాను గనుక సరిపోయింది. లేకపోతే నేను కూడ స్వర్గాన్ని వుండే వాడిని" అన్నాడు సిల్వర్ నవ్వుతూ.

"స్వర్గం కాదు_నరకం అనాలి" అంది సిల్వర్ చిలుక.

బోట్లు బెన్ గన్ వుండే గుహ సమీపానికి రాగానే బోట్లను ఆపి అందరము గుహదగ్గరకు చేరుకున్నాం.

అక్కడ కెప్టెన్ జగదీశ్‌ను చూచి సిల్వర్ సెల్యూట్ చేశాడు.

అందరము గుహ లోపలకు ప్రవేశించాం.

అది విశాలంగా, ఎంతో పొడవుగా వుంది. దానిలోకి గాలి, వెలుతురు బాగా వస్తున్నాయి.

అక్కడే చిన్న నీటిబుగ్గకూడ వుంది.

అక్కడ బంగారు నాణాలు, రకరకాల నగలు మొదలైనవి కుప్పలుగా పోసివున్నాయి. వాటి నక్కడ చూస్తుంటే అవి నకిలీ బంగారమేమోనన్న అనుమానంతో బాటు వాటిమీద ఒకవిధమయిన నిర్లక్ష్యభావంకూడ పుడుతుంది.

ఆ రాత్రి అంతా ఎంతో కులాసాగా కబుర్లతో కాలం గడిపివేశాం.

తెల్లవారగానే ఆ బంగారాన్నంతా బోట్స్‌లోకి చేర్చి, వాటిని తిరిగి షిప్‌లోకి చేర్చాం.

ఆ నాణాలు రకరకాలుగా వున్నాయి. కొన్ని గుండ్రంగా, కొన్ని చదరంగా, ఇంకొన్ని త్రిభుజాలు, షడ్భుజాలు; చిన్నవి, పెద్దవి ఎన్నో రకాలు. అవి అన్నీ ఒక దేశానివి కాదు. ఎన్నో దేశాలవి. ఎన్నో షిప్‌లను దోచినవి. ఎన్నో ప్రాణాలను బలిపెడితే గాని, అవి అంత కుప్పగా అక్కడ తయారవలేదు.

కాస్త ప్రొద్దు ఎక్కగానే షిప్ బయలుదేరింది.

షిప్ క్రమంగా ఆ దీవికి దూరమవసాగింది.

షిప్ నీటిని చీల్చుకొని ముందుకు పోతుంటే నీరు తిరిగి ముందుకు వచ్చి నిలుస్తుందా అనిపిస్తుంది ఆ తరగని నీటిని చూస్తుంటే.

ఎటు చూచినా సముద్రపు నీరే. సముద్రంమీద రక రకాల సముద్రపు పక్షులు ఎగురుతున్నాయి. కొన్ని పక్షులు నీటిమీద తమాషాగా నడుస్తూ నీటిమీదకు వచ్చే చేపలను వేటాడుతుంటే, ఇంకొన్ని పక్షులు కూలిపోయిన విమానంలా రివ్వున సముద్రగర్భంలోకి పోయి కొంత సేపటికి ముక్కుతో చేపలను పట్టుకొని పైకి వస్తున్నాయి.

## 10

చీకటి... కటిక చీకటి.

ఆ చీకటిని చీల్చుకొని దిక్కులేని పక్షిలా, ఏకాకిగా ముందుకు సాగుతుంది షిప్. డెక్ మీద లైట్లు ఆ చీకటిని పారద్రోలడానికి ప్రయత్నిస్తున్నాయి.

సన్నగా వర్షం మొదలై, అది వెంటనే బ్రహ్మాండ మయిన వర్షంలా తయారయింది. ఆ వర్షానికి తోడు వాడి తమ్ముడు గాలికూడ తోడయినాడు. అన్నదమ్ములిద్దరూ కలిసి తమతమ బలాలను ప్రదర్శించుకుంటున్నారు.

షిప్‌మీద కోలాహలం ప్రారంభమయింది. అసలే షిప్‌ను నడిపే సిబ్బంది తక్కువ. దానికితోడు తుఫాన్.

మాకు ముందు ఏముందో కనిపించటంలేదు.

షిప్ అలల తాకిడికి ఊయలలా ఊగుతుంది. ఈదురు గాలి రివ్వున వీస్తుంది.

సిల్వర్ తప్పించి అందరము భయపడి పోతున్నాము

సిల్వర్ మాత్రం కాబిన్‌లో కూర్చుని ఏదో తీవ్రంగా ఆలోచిస్తున్నాడు.

ఆకాశం భయంకరంగా గర్జిస్తూ, అప్పుడప్పుడు తన తళుకులను చూపిస్తుంది. ఆ మెరుపుల వెలుగులో దూరంగా ఒక దీవి ఉన్నట్లుగా కనిపించింది.

మా అందరికి పోయిన ప్రాణాలు లేచివచ్చినట్లయింది. షిప్‌ను అటువైపు మళ్ళించి తీరానికి సమీపంలో ఆపు జేశాం.

ఇప్పుడు మాకు తుఫానువల్ల ప్రమాదంలేదు గాని, షిప్ వదిలి బయటికి వచ్చే పరిస్థితి లేదు. ఆ రాత్రి షిప్‌లోనే విశ్రాంతి తీసుకొని, వీలైతే ఉదయం ఆ దీవిలో తిరిగి చూడాలనుకొన్నాము. అందరము అలసిపోయి వుండటం వల్ల నిద్ర కుపక్రమించాము.

# 11

అర్ధరాత్రి హఠాత్తుగా మెలకువ వచ్చింది.

నేను లేచి చుట్టూ చూచాను. అంత నిద్రలో నాకు మెలకువ రావటానికి కారణం అన్వేషిస్తూ.

మా చుట్టూ సుమారు ఇరవైమంది ఆటవికులు నిలబడి వున్నారు. వారి చేతులలోని ఈటెల మొనలు వెన్నెల కాంతిలో మెరుస్తున్నాయి. వాళ్ళు మా షిప్‌లోకి ఎలా రాగలిగారో నాకు అంతుబట్టలేదు.

వారు మమ్మల్ని లేవమని సంజ్ఞ చేసారు.

మేము పైకి లేస్తుండగానే సిల్వర్ రివాల్వర్ తీసి వారిని టపటపమని కన్నుమూసి తెరిసేలోగా ఆరుగురిని కాల్చేసి, ఖాళీ రివాల్వర్‌తో వారిని బెదిరించబోయాడు.

ఈ లోపున ఒక ఆటవికుడు విసిరిన ఈటె సిల్వర్ గుండెల్లో దిగబడింది. సిల్వర్ భయంకరంగా అరుస్తూ

నేల గూలాడు. క్షణాలలో అతని శరీరం నల్లగా మారి పోయింది.

అది చూచిన మా అందరికీ పై ప్రాణాలు పైనే పోయాయి. మరెవ్వరూ యెదురుతిరిగే ప్రయత్నం చేయ లేదు.

వాళ్ళు మా అందరినీ షిప్‌లోంచి దింపి, వాళ్ళు వచ్చిన నాటుపడవలమీద దీవిలోకి తీసుకెళ్ళారు.

మా అందరిని తీసుకువెళ్ళి రాతితో కట్టిన ఓ గుహలో బంధించారు. అది కట్టినది అనడంకంటె సహజంగా ఏర్పడిన దనుకోవచ్చు.

"ఇప్పుడు వారు మనల్ని ఏం చేస్తారంటావ్?" అన్నాడు డాక్టర్ మూర్తి.

"చంపుకు తింటారు" అన్నాడు భూపతి కోపంగా. అతని మనస్సంతా తీరాన వదలిన షిప్‌మీద నే వుంది.

"చంపుకు తినేవారయితే ఎప్పుడో చంపేవారు కాని, వారు మనల్ని ప్రాణాలతో వుంచారంటే ఏదో కారణం వుంటుంది" అన్నాడు కెప్టెన్.

తెల్లవారింది. కాని, ఆ గుహలో చీకటి యింకా పోలేదు.

సిల్వర్ పెంపుడు చిలుక వచ్చి, నా భుజంమీద వాలింది.

నాకు దాన్ని చూస్తున్నా, దాని మాటలు వింటున్నా ఎందుకో చాలా ఆనందంగా వుంటుంది. పాపం, దాని యజమాని ఇక లేదు. దానిని నాతోటే వుంచుకోవా లనిపించింది. కాని, యీ ఆటవికులు తమను వదులుతారో, లేదో?

"మనం ఈ పాడు చీకటి గుహలో ఎందుకు. నాకు చీకటంటే చాలా భయం. బయటకు పోదాం రండి," అంది చిలుక.

"మనం బయటకు వెళ్ళటానికి కుదరదు. మనల్ని వారు బంధించారు," అన్నాను నేను దాని తల దువ్వుతూ.

"బంధించి ఏంచేస్తారు?"

"మనల్ని చంపేస్తారు."

"నన్ను కూడ."

"అవును."

"అబద్ధం! నేను నీ మాటలు నమ్మను. నేను చావను తెలుసా? నేను అమృతం త్రాగా నొకసారి. అమృతం త్రాగిన వాళ్ళకు చావు లేదటగా."

"ఎవరు చెప్పారు నీకు?"

"ఫ్లింట్. ఒకసారి తన గ్లాసులో వున్న అమృతాన్ని నాకు పట్టించి, ఇక ఆ అమృతం త్రాగినవాళ్ళకు చావు లేదన్నాడు. అది భలేగా ఉందిలే."

మా సంభాషణ అంతా మిగిలినవాళ్ళు వింటున్నారు.

"ఆ తరువాత ఏంజరిగిందో తెలుసా?" అంది చిలుక.

"ఏం జరిగిందేమిటి?"

"అలా... అలా ఎగురుతూపోయి ఒక చిలకమ్మాయి చెట్టుమీద ఉంటే రేప్ చేసి వచ్చేసాను."

"ఆ..." అన్నాను ఒక్కసారిగా. అదికూడ మనిషి లాగే ప్రవర్తించిందంటే ఆశ్చర్యమేసింది.

"ఆ తరువాత ఏం జరిగింది."

"రేపు చెబుతానులే" అంటూ బయటికి ఎగిరిపోయింది చిలుక.

మళ్ళీ ఎవరి ఆలోచనలలో వారు మునిగిపోయాం.

# 12

ఆ ఇంటికి వున్న రాయి అడ్డు తొలగి నలుగురు ఆటవికులు లోపలకు ప్రవేశించి మా అందరినీ బయటకు తీసుకు వెళ్ళారు.

తమ నాయకుడికి ఎదురుగా వున్న చెట్లకు మమ్మల్ని కట్టివేశారు.

మా అందరి చుట్టూ ఆ గూడెపు వాసులు నిలబడి వున్నారు. మాకు కొంచెం దూరంలో మట్టితో తయారు చేసిన ఎత్తయిన విగ్రహం ఒకటి వుంది. దానికి ఆకు పసరులు మొదలయినవి పూసి ఆ విగ్రహానికి అందాన్ని తెచ్చారు గాని, ఆ విగ్రహం చూడటానికి భయంకరంగా వుంది.

ఆ విగ్రహం ఎదురుగా పెద్ద గోతిలో గంధపుచెక్కలు మొదలయినవి వేసిన పెద్ద మంట వుంది. ఆ మంటల కాంతి విగ్రహం కళ్ళలో పడి ఆ ఎర్రని కళ్ళకు మరింత ఎర్రదనాన్ని చేకూరుస్తూ భయంకరంగా కనిపిస్తుంది.

వారి నాయకుడు వారి భాషలో మా చుట్టూ వున్న వాళ్ళకు ఏవేవో చెప్పి, మా వైపు తీక్షణంగా చూస్తూ తిరిగి వాళ్ళకు ఏదో చెప్పాడు.

వారందరూ మా ఒంటిమీద నున్న దుస్తులను తీసేసారు. మేమందరము నగ్నంగా నిలబడ్డాం.

వారందరూ కలిసి పసుపు పచ్చని ద్రవాన్నేదో మా శరీరానికి రాసి దూరంగా వెళ్ళిపోయారు.

కొందరు ఆటవికులు లేడి చర్మాలతో తయారుచేసిన డప్పులను పట్టుకొని ధమధమ లాడిస్తున్నారు.

వారు చేసే తంతు చూస్తుంటే మాకు ఏమీ అర్థం కాలేదు కాని, మా ప్రాణాలు మావి కావని మాత్రం గ్రహించాం.

వారు మా కట్లును విప్పి విగ్రహం యెదురుగావున్న గుండం దగ్గరకు తీసుకువెళ్ళారు. వారిలో ఒకడు ముందుకు వచ్చి ఏవో పిచ్చిపిచ్చి అరుపులు అరవసాగాడు.

మేము పారిపోవటానికికూడ వీలులేకుండా వారు మా చుట్టూ వున్నారు. వారి చేతులలోని పదునైన ఈటెలు మావైపు గుర్రుగా చూస్తున్నాయి.

వారి నాయకుడు ఉన్నట్లుండి గట్టిగా అరిచాడు.

మమ్మల్ని ఆ మంటలలో వేసి సజీవదహనం చేయాలనుకొంటున్నారని, వారు ఆ విధంగా దేవికి బలి ఇస్తారని గ్రహించాం.

మేమందరము కడసారిగా ఒకరినొకరము చూచుకున్నాం. డాక్టర్ మూర్తి నన్ను చూచి కన్నీరు విడిచాడు.

బెన్‌గన్ నిర్లిప్తంగా ఉండిపోయాడు.

మిగిలినవారు జరుగబోయేదానిని ఊహించుకోబోయేంతలోనే వారు మమ్మల్ని ఎత్తి మంటలలోకి విసరబోయారు.

అంతే!

"ఆగండి" అని విగ్రహం అరిచినట్లు వినిపించింది, వారి భాషలో. అందరూ అదిరిపడి అటువైపు చూశారు.

"వారినందరిని విడిచిపెట్టండి. వారందరూ నా భక్తులు. వారికేదయినా ఆపద జరిగితే మీ అందరినీ బూడిద చేసేస్తాను," అంటూ వినిపించింది.

అందరమూ ఆశ్చర్యపోయాం. అలా పలికింది విగ్రహం కాదు. సిల్వర్ పెంపుడు చిలుక. అది విగ్రహం వెనుక వుందని గ్రహించాం.

ఆటవికులందరూ భక్తిగా ఆ విగ్రహానికి నమస్కా

రించారు.

ఆ తరువాత భక్తిగా మావైపు తిరిగి మాకు నమస్కరించారు.

వారి నాయకుడు ముందుకువచ్చి, "తల్లీ, మన్నించు" అంటూ ప్రార్థించాడు.

"వెంటనే వారిని వదలిపెట్టండి" అని పలికింది చిలుక, విగ్రహం వెనుకనుండి.

వారి నాయకుడు వెంటనే ఆజ్ఞలు జారీచేసాడు.

వారు మా దుస్తులను మాకిచ్చి, క్షమాపణలు కోరుకుని వెళ్ళిపోమని వదిలివేసారు.

అప్పుడే చిలుక విగ్రహం వెనుకనుంచి పైకి ఎగిరింది. ఆ దృశ్యాన్ని ఆటవికులెవరూ చూడలేదు. అందరి దృష్టి మా మీదనే వుంది.

అది విగ్రహం తలమీదుగా ఎగురుతూ ముందుకు రాబోయి ఆ విగ్రహం ఎదురుగావున్న అగ్నిజ్వాలల వేడికి ఎగురలేక చటుక్కున క్రింద మండుతున్న ఆ గంధపు చెక్కలమీద పడి సజీవదహనం అయింది.

నేను ఏదో అనబోయి ఊరుకున్నాను. మౌనంగా నాలో నేనే దుఃఖించాను. ఇక అక్కడవుండటం మంచిదికాదనుకొని, అందరము షిప్ దగ్గరకు చేరుకున్నాం వేగంగా.

నా గుండెలు బరువెక్కాయి. మా ప్రాణాలు రక్షించబోయి తన ప్రాణాలనే బలిచేసింది. తనకు చావులేదని చెప్పిన ఆ చిలుక ఇప్పుడు చూడటానికికూడ వీలులేకుండా సమాధి అయింది.

అందరము అయిదు నిముషాలు మౌనం వహించి, షిప్ ఎక్కి గమ్యస్థానానికి బయలుదేరాము.

—: ఐపోయింది :—

# చెక్క బొమ్మ!

## కంచర్ల రమణ

నాకు సాధూలన్నా, బాబాలన్నా, దేవుడి భక్తులన్నా నమ్మకంలేదు. వీళ్లు దేవుడిపేరు చెప్పి, తమ పబ్బం గడుపుకొంటున్న పెద్ద మనుషులని నా అభిప్రాయం.

మనిషి యే మూలనో ముక్కుమూసుకుని, మనస్సు ద్వారా సర్వం చెయ్యగలిగితే, ఉద్యోగులు ఆఫీసుల కెందు కెళ్ళడం? రైతులు పొలాల్నెందుకు దున్నడం? వ్యాపారస్తులు దుకాణాలు తెరిచి, ఉదయంనించి రాత్రి వరకూ బేరాలకోసం కాచుకూర్చోవడం దేనికి?

పరీక్ష పాసు కాదలచినవాడు, పుస్తకాలు పట్టుకుని చదివితే, పరీక్ష పాసవుతాడుగాని, పూజలుచేస్తూ, గుళ్ళ చుట్టూ తిరిగితే, పరీక్ష పాసవుతాడా?

అలాగే నాకు దేవుడన్నా, మానవాతీత శక్తులన్నా నమ్మకంలేదు. ఏనాడో మానవుడు తన చుట్టూవున్న ప్రకృతిని శాస్త్రీయ దృష్టిలో అర్థం చేసుకోలేక, తన కన్నా బలీయమైన శక్తేదో ఉందని ఊహించి, దానికి దేవుడని ఓ పేరుపెట్టి, అతడికి అవతారాలు వగైరా అంటగట్టారని నా అభిప్రాయం.

నా యీ భావాల గురించి నా స్నేహితులకు బాగా తెలుసు. ఎన్నోసార్లు, వాళ్ళ నమ్మకాల్ని, వాళ్ళ ప్రవర్తనల్ని ఖండించాను నిర్మొహమాటంగా.

నాకున్న చాలామంది స్నేహితుల్లో శేఖరం ఒకడు. వారంరోజుల క్రితం, వాడో రోజున "మన వూళ్ళోకి అవధాని అని ఒకాయన వచ్చాడు తెలుసా?" అన్నాడు.

"ఈ టౌనుకి సవాలక్ష శాల్తీలు వచ్చి వెళ్తుంటాయి. వాళ్ళగురించి తెలుసుకోవల్సిన అవసరంగాని, అగత్యం గాని నాకలేదు" అన్నాను దురుసుగా.

"మరీ అంత తీసేసినట్టుగా మాట్లాడకు. ఆయన చాలా గొప్ప మనిషి... ఆయనతో నాకు కాస్త పరిచయముంది. తీసుకెళ్తాను. వస్తావా? మాట్లాడుదువుగాని" అన్నాడు శేఖరం.

"ఆయన తూర్పు. నేను పడమర. ఆయనతో నాకు మాటలేమిటి? ఇంతకూ, పరిచయమంటున్నావు. ఎలాగయిందిరోయ్, ఆ వింత జీవితో పరిచయం?" అన్నాను నవ్వుతూ.

"మా బంధువుల్లో ఒకామెకు ఫిట్స్ వస్తుండేవి. ఎందరో డాక్టర్లకు చూపించారు. నయం గాలేదు. చివరి కీయని చేతిలో పూర్తిగా బాగయింది" చెప్పాడు శేఖరం.

"ఆ విషయం నాకు ఎప్పుడూ చెప్పలేదేం?" అన్నాను ఆశ్చర్యంగా.

"నీ కలాంటివంటే కిట్టవని నాకు తెలుసు. పైగా వేళాకోళమాడతావు. అందుకే చెప్పలేదు," చెప్పాడు వాడు.

ఏ మూడ్ లో ఉన్నానో "సరే! ఆయనతో మాట్లాడితే, ఏం పోయింది? మాట్లాడినందుకు ఫీజు వసూలు చెయ్యడు గదా?" అన్నాను నవ్వుతూనే.

"ఛ! ఛ! యీనాటి డాక్టర్లవంటివాడు కాడు, రోగం నయమైనా, కాకపోయినా, ఫీజు వసూలు చేయడానికి. ఓ విధంగా చెప్పాలంటే, ఆధ్యాత్మిక తత్వంవైపు మనుషుల్ని మళ్ళించాలనే ఆయన తాపత్రయమంతా... మొండిరకం నాస్తికుల్ని తనవద్దకు తీసుకురమ్మని అడుగుతుంటాడు, తనదగ్గరకు వచ్చినవాళ్ళని."

మరునాడు అవధానితోటి ఇంటర్వ్యూ. శేఖరం నన్ను తీసుకెళ్ళాడు.

సాదరంగా ఇద్దర్నీ లోనికి ఆహ్వానించి కుషన్డ్ ఛెయిర్స్‌లో కూచోబెట్టాడు అవధాని. తనువచ్చి, మా కెదురుగా సోఫాలో కూచున్నాడు.

అవధానిని చూడగానే, అతనో విచిత్ర వ్యక్తని అనిపించింది నాకు.

అతడ్ని చూడక పూర్వం 'స్పిరిట్యువలిస్ట్ అవధాని' అని నేను విన్నమాటలు నా మనసులో ఓ ఆకారాన్ని సృష్టించాయి. దానిప్రకారం, అవధాని తెల్లని పంచె కట్టుకుని, తెల్లని జుబ్బా వేసుకుని, ఓ పిలకతో, నుదుటి మీద పిండి కట్లతో ఉండాలి.

అంతేకాదు. మేం వెళ్ళేసరికి, ఓ తుంగచాపో, జంబుఖానో యిచ్చి, కూర్చోమనాలి. తనున్న గదినిండా, లోకంలో ఉన్న దేవుళ్ళందరి ఫోటోలు వేలాడుతూ, వాటిమీద ఒత్తుగా గంధం, కుంకుమ, పసుపు, అక్షింతలు చల్లబడి, గదిలో అగరొత్తుల వాసన అలుముకొని ఉండాలి.

కాని, నేను చూసిన అవధాని నా మనసులో ఏర్పడ్డ రూపానికి పూర్తిగా వ్యతిరేకం. చూడగానే, విస్తుపోయాను. కాదు, షాక్ తిన్నాను.

ఇతడు ఫుల్ సూట్‌లో ఉన్నాడు. ఒత్తుగా జులపాలు, పొడవుగా మీసాలు పెంచాడు. తనున్న ఆ గదిలో ఒకటి రెండుచోట్ల మాత్రం దేవుడి ఫోటోలు ఉన్నాయి. మనిషి సాధారణమైన ఎత్తుగా, తెల్లగా, హుషారుగా వున్నాడు. వయస్సు నలభై లోపు ఉండవచ్చు.

అతడ్ని చూసీ చూడగానే, ఆకర్షించుకున్నవి, దీపాల్లాండి అతని కళ్ళయితే, నవ్వు తెప్పించింది, మోస్ట్ మోడర్న్‌గా అవుపిస్తున్న అతడి నుదుటిమీది యెర్రని కుంకుమ బొట్టు.

వెళ్ళీ వెళ్ళగానే, కాసేపు అతనితో ఏం మాట్లాడాలో తెలీక, నేనూ శేఖరం తికమకపడ్డా, మా ఇబ్బంది తెలుసుకుని ఆయనే సంభాషణ మొదలుపెట్టాడు.

"సృష్టి మొత్తంలో మానవుడి మనసు అతి శక్తివంతమైనది" అన్నాడు.

"అదెలా?" అన్నాను ఆశ్చర్యంగా నేను.

శేఖరం నా ప్రక్కనే కూచున్నాడు. ఎవరి పక్షమూ వహించక, మా వాగ్యుద్ధాన్ని కుతూహలంగా ఆలకించసాగాడు.

ఒక్క క్షణం అవధాని కళ్ళు అర్ధనిమీలితాలై, ఆ తరువాత మళ్ళీ నావైపు తీక్ష్ణంగా చూడసాగాయి.

"ఉదాహరణకు ఇప్పుడు మనం కూర్చున్న యీ హోటలునే తీసుకుందాం. ఈ హోటలు కట్టటం వెనకాల ఓ ప్లాను ఉందా?" అడిగాడు అవధాని.

"ఉంది" అన్నాను నేను.

"అయితే, అదెక్కణ్ణించి వచ్చింది?"

అవధాని ప్రశ్నకు నేనేం జవాబివ్వలేదు. అతనే మాట్లాడేడు మళ్ళీ.

"ఓ మనిషి ఆలోచనలోంచే కదా! ఆలోచనలకి కేంద్రం మెదడని నేను వేరేగా చెప్పక్కర్లేదు. అదే విధంగా ఏ వస్తువుని తీసుకుని, దాని పుట్టుకను వెతుక్కుంటూ పోయినా దానికి కూడా మనిషి మెదడే అని తేలుతుంది. కావలిస్తే, మీకు తోచిన వస్తువుని తీసుకుని, దాని ఆరిజన్ వెతకండి," అంటూ మవునం వహించాడు.

నేను ఆలోచించడం మొదలుపెట్టాను. సృష్టిలో సహజసిద్ధంగా లభ్యమయ్యేవి తప్ప, మిగతావాటి పుట్టుకకు, ఆధారం మెదడే అని అతడు చెప్పింది నిజమే ననిపించింది.

"మీరు చెప్పింది ఒప్పుకోక తప్పదు. మానవుడు సృష్టించే ప్రతి వస్తువు వెనకాల, అతడి ఆలోచన వుంది. ఆ ఆలోచనలకు కేంద్రం మెదడు. సత్యాన్ని ఒప్పుకోవడానికి నేనెన్నడూ వెనుకాడను" అన్నాను.

"వెరీ గుడ్" అంటూ మళ్ళీ మొదలెట్టాడు అవధాని. "మనిషి మెదడు మాగ్నెట్ లాంటిది" అని ఒక క్షణం దీర్ఘంగా ఆలోచించి, "మాగ్నెట్ 'లాంటిది' అని ఎందు

కనాల్సి వస్తోందంటే, మాగ్నెట్‌లా అది భౌతికమైన వాటిని ఆకర్షించుకోదు. కాని, నిజానికి దాని ఆకర్షించే శక్తి మాగ్నెట్‌కన్నా ఎంతో ఎక్కువ. మనస్సు కేంద్రీకరించి, హోల్ హార్టెడ్‌గా దేన్నైనా కోరుకుంటే, అది లభ్యం కాలేదన్న సంగతి ఇంతవరకూ దాఖలాలో లేదు. కావలిస్తే చూసుకోండి,'' అని అనేసి అవధాని మళ్ళా మౌనం వహించబోయాడు. కాని, నేను అందుకొన్నాను.

"వాట్ నాన్సెన్స్! నేను యిప్పుడు సినిమాస్టారునయిపోవా లనుకుంటే అయిపోతానా? ఇంగ్లీషులో ఓ సామెత వుంది లెండి. కోరికలు గుర్రాలైతే, బిచ్చగాళ్ళు వాటిని స్వారీ చెయ్యకపోయేరా అని, కోరుకున్నంత మాత్రాన అన్నీ జరిగిపోతే, ఇంకేముంది, ఈ లోకంలో? వాలుకుర్చీలో కూచుని, ఎడారిలో పంటలు పండించవచ్చు,'' అన్నాను నవ్వి.

అవధాని నవ్వలేదు. నావైపు తీక్షణంగా చూసాడు. నిజానికి అవి చూపుల్లా లేవు. ఎక్స్‌రేస్‌లా, నా అంతరాంతరాల్లోకి చూస్తున్నట్టుగా వున్నాయి.

"మీ రెప్పుడయినా మీ జీవితంలో సీరియస్‌గా దేన్నైనా కోరుకున్నారా?'' అడిగాడు అవధాని.

"ఓ యస్!...ఒకటి కాదు. చాలా.''

"అందులో ఒకటి చెప్పండి.''

"నేనో మంచి నటుడ్ని కావాలనుకొన్నాను.''

"మరి, ఆ కోరిక, ఏ దశవరకూ వచ్చి ఆగిపోయింది?''

"దానికో దశ లేదు. అది కోరికగానే మిగిలిపోయింది.''

"ఏం అలాగ? ఏ నాటక సమాజంలో చేరడానికో, లేదా మీరే, ఓ సమాజం స్థాపించడానికో ప్రయత్నించలేదా?''

"అదిగో! ప్రయత్నం సంగతి యిక్కడ తీసుకు రాకండి. నేను నటుడ్ని కావాలనుకున్నాను... కాలేక పోయాను. అయినా, ఓ సమాజంలో చేరాలనుకున్నా, ఓ సమాజాన్ని మనంతట మనం ఆరంభించినా, చేతి చమురు చాలా వదుల్తుంది. నా దగ్గర అంత డబ్బెక్కడుంది?"

మొట్టమొదటిసారిగా నవ్వాడు అవధాని. ఆ నవ్వులో ఓ ప్రత్యేకత వుంది. అదేమిటో నా కర్థంకాలేదు గాని, నా గుండెల్లో దీపాలు వెలిగినట్టయింది. ఒంట్లో యేదో ఉత్తేజం!

"అంటే, మీదో ఐడిల్ విష్ అన్నమాట! నటుడు కావాలన్న కోరిక మీలో నిజంగానే బలంగా వుంటే, ఓ నాటక సమాజంలో చేరడానికో, లేదా మీరంతట మీరే, ఓ సమాజం స్థాపించడానికో పూనుకునేవారు. మనిషిలో కోరిక బలంగా వుంటే, రెండు కాళ్ళూ లేని అవిటివాడు కూడా తప్పక నడవగలడు."

అవధాని వాదన నాకు వితండంగా అనిపించింది. మొహంలో ఆశ్చర్యముద్రతో, అతనివైపు క్షణం చూసి, ఏదో మాట్లాడుదామని నేను ఉపక్రమించేసరికి, మళ్ళా ఆయనే, ఆరంభించాడు.

"నేను చెప్తున్నది శాస్త్రం. అవాకులూ, చవాకులూ కాదు. మీకు యీ క్షణంలో దాహం వేస్తోందనుకోండి. నీళ్ళు తాగాలన్న మీలో కలిగిన కోరిక తీవ్రమై అంతటితో ఆగిపోదు. అది ప్రయత్నంగా రూపొందుతుంది. మీరు నీళ్ళకుండ దగ్గరకో, పైపు దగ్గరకో వెళ్ళి నీళ్ళు తాగేంతవరకూ విశ్రమించరు.

అంచేత మీలో నటుడు కావాలన్న కోరిక బలంగా

లేకపోబట్టే, అన్‌కాన్షియస్‌గా మీ మనస్సు డబ్బులేదు, తీరుబడి లేదు. ఫలానా నటుడు ఫైల్‌లో వుండగా నేను గొప్ప నటుడ్ని కాగలనా వగైరా సాకుల్ని సృష్టించు కుంది. అందుకే మీరు నటులు కాలేకపోయారు.

"ఇజ్రాయిలీ పారాట్రూపర్ యూరీ గెల్లర్ గురించి మీరు వినేవుంటారు. చెంచాల్ని, ఫోర్కుల్ని తన తీవ్ర మైన చూపుల్తో వంచేస్తాడు. ఆగిపోయిన వాచీలని తన మనోశక్తిద్వారా పని చేయించడమూ, పనిచేస్తున్న వాటిని ఆపేయడమూ, అవలీలగా చేయగలడు.

అలాగే ఓ చైనా డాక్టరు గురించికూడా వినేవుంటారు. దూరంగా ఎక్కడోవున్న రోగుల రోగాల్ని, ప్రసిద్ధ వైద్యులు మందులద్వారా నయం చెయ్యలేమని వదిలేసిన మొండిరోగాల్నికూడా, తన మనోశక్తిద్వారా నయం చేస్తున్నాడట.

పేరా సైకాలజీ అని ఓ సైన్సు వుంది. అది యిప్పు డిప్పుడే గుర్తింపబడుతోంది. థాట్, ట్రాన్స్‌ఫరెన్స్, టెలీపతీ, ఓ అపరిచిత వ్యక్తి గురించి, అతనికి సంబంధించిన వస్తువుని మాత్రం ముట్టుకుని చెప్పడం, ఘన వస్తువుల వెనకాల వున్నవాటి గురించి చూడకుండా చెప్పడం వగైరా శక్తులు అసత్యాలు కావు నిజమే, అవి మేధస్సు కున్న అపూర్వశక్తియొక్క కొన్ని రూపాలు అంటూ చాటి చెపుతోంది ఆ శాస్త్రం. ఈ శాస్త్రంమీద పశ్చిమ దేశాల్లో ఎంత నమ్మకం యేర్పడిందంటే, ఏజ్ ఆఫ్ ఇర్రే షనలిజమ్ మొదలయిం దంటున్నారు, సాంఘిక శాస్త్ర వేత్తలు కొందరు" అంటూ అవధాని ఒక్కక్షణం ఆగాడు ఊపిరి పీల్చుకోవడానికి.

"సార్! వాదనలతో లాభంలేదు. మానవుడి మెదడు అపూర్వ శక్తివంత మంటున్నారు. అందుకు నిరూపణ కావాలి. అంచేత మీ మనస్సుద్వారా ఓ పని చేసి చూపండి" అన్నాను సవాలు చేస్తున్నట్టుగా.

ఆయన భుజాలెగరేసి, "ఏం చెయ్యమంటారో మీరే చెప్పండి" అన్నాడు.

తలెత్తి గోడల పైభాగంవైపు చూడసాగాను. అక్కడ అందంగా నగిషీల డోమ్స్‌లో వున్న బల్బ్స్ అవుపించాయి.

వాటిని చూడగానే నా మెదడులో మెరుపు మెరిసినట్టయింది.

"నా కెదురుగావున్న డోమ్‌లో బల్బ్ వున్నట్టే, మీ కెదురుగా ద్వారానికి పైన, డోమ్‌లో బల్బ్ వుంది. మీరు దాన్ని ముట్టుకోకుండా, పగలగొట్టేయాలి, మీ మనోశక్తి ద్వారా" అన్నాను.

"ఓస్! ఇంతేనా!" అన్నట్టుగా నవ్వాడు అవధాని.

"ఓకే! అలాగే!...అయితే, ఆ బల్బ్ ఖరీదు మీరు హోటలువాడికి చెల్లించుకోవాల్సి వుంటుంది. ఏమంటారు?" అన్నాడు మళ్ళీ అవధాని నవ్వుతూ.

"ఓకే! నేనూ సిద్ధమే!" అన్నాను పౌరుషంగా.

అవధాని వెంటనే కళ్ళు మూసుకున్నాడు. కొద్దిగా బిగుసుకున్నట్టు అయిన అతని మొహంవైపు చూస్తూ కూచున్నాను, కుతూహలంగా.

నా ప్రక్కన కూచున్న శేఖరం మొహంలోకూడా అదే కుతూహలం కదలాడుతోంది.

అయిదు నిముషాలు గడిచాయి బరువుగా.

అవధాని టక్కున కళ్ళు తెరిచాడు. ఆ కళ్ళు దీపాల్లా మహా తేజోవంతంగా వున్నాయి. బల్బువైపు చూసి, "హఁ!" అన్నాడు కుడిచెయ్యి యెత్తి గసిరినట్టుగా.

అంతే!...ఎవరో ఓ, రాయితోనో, కర్రతోనో బల్బును పగలగొట్టినట్టుగా, బల్బు పగిలి, నేలమీద పడి గల్లుమని శబ్దం చేసింది.

నేను అవాక్కయిపోయాను. అదే పరిస్థితిలో వున్నాడు శేఖరంకూడా.

కనికట్టు కాదు గదా?...అనుమాన మొచ్చింది.

కళ్ళు నులుముకొని లేచి, గోడదగ్గర పడిన గాజు ముక్కల్ని చేత్తో తీసి చూసాను.

అవి గాజు ముక్కలే! సందేహం లేదు.

కాని, కనికట్టు చాలా సేపు వుంటుందంటారు. కనికట్టు వున్నంత సేపు, భ్రాంతి నిజంలాగానే అనిపిస్తుందంటారు. నిజానికి బల్బు పగలలేదేమో?

అదే సమయంలో నా సందేహం నివృత్తిచేసే ఓ అయిడియా వచ్చింది.

అవధాని గమనించకుండా, జేబులోంచి రుమాలు తీసి, రెండు గాజుముక్కల్ని అందులో చుట్టేసి, దాన్ని చల్లగా జేబులో కుక్కుకున్నాను.

"వెల్! ఏమంటారు యిప్పుడు?" అన్నాడు అవధాని, గర్వంతో మెరిసిపోతున్న మొహంతో.

"ఏమనాలో నాకు బోధపడ్డం లేదు. ఇది అసంభవం. ఇది సంభవమైతే, ఫిజికల్ అండ్ నేచురల్ లాస్ మాటేమిటి? నాకు అంతా అయోమయంగా వుంది. ఆలోచించుకోవడానికి టైము కావాలి. ప్రస్తుతానికి మాకు శెలవు యిప్పించండి," అన్నాను చేతులు జోడించి నమస్కరించి.

శేఖరంకూడా లేచాడు. వాడూ అవధానికి నమస్కరించాడు.

మేం బయటికి బయలుదేరబోతుంటే, "దిగువన మర్చిపోకుండా బల్బు ఖరీదు యిచ్చి మరీ వెళ్ళండి," అన్నాడు అవధాని.

## 2

ఒకరోజు కాదు, వారం రోజులున్నాయి బల్బు ముక్కలు నా వద్ద.

అవధాని చేసింది యెంతమాత్రం కనికట్టు కాదు. తన మనోశక్తి ద్వారానే, బల్బును పగలగొట్టాడని, నిర్ణయానికి రాక తప్పలేదు.

ఐతే, 'అదెలా సాధ్యమయింది?' అన్నది శేషప్రశ్న అయి కూచుంది నాకు.

శేఖరంగాడి దగ్గరకు పరుగెత్తి వెళ్ళి అడిగాను.

"ఒరేయ్! అర్థంలేని అనుమానాలతో చావకు. పై వాళ్ళను చంపకు. అవధాని నిజంగా శక్తిమంతుడు అవునా, కాదా అని యింకా తెలుసుకోవాలంటే, అతని దగ్గరే వుండి స్టడీ చేస్తే పోలా? నీ సందేహాలు అవధానిగాని, అవధానిలాంటి మంత్రవాదులు తీర్చాలిగాని నా వంటివాళ్ళు కారు," అంటూ చిన్నసైజు లెక్చరు దంచేసాడు శేఖరం.

వాడలా లెక్చరివ్వడం కాదుగాని, నా అనుమానాలు తీరడానికి ఓ మార్గం అగపడినట్టయింది.

వెంటనే అవధానివద్దకు పరుగెత్తాను.

"నమస్కారం గురువుగారూ! నేనే ఓడిపోయాను. మీరే గెలిచారు," అన్నాను హాయిగా నవ్వి.

నమస్కారం అందుకుని, తల పంకించి "నాకు తెలుసు మీరు నావద్ద కిలా వస్తారని. అయితే, మీరు తెలుసుకోవడమే గాదు, మీ అనుభవాల్ని అందరికీ చెప్పాలి... ఈ యావత్తు ప్రపంచం ఒక పెద్ద సీ ఆఫ్ యూనివర్సల్ మైండ్ అనీ, తనకు కావాల్సినవన్నీ మానవుడు అందులోంచే యేరుకుని తెచ్చుకుంటాడనీ, మీరు నమ్మడమే గాదు, యితరులచేత నమ్మించాలి" అన్నాడు అవధాని.

"ఆ పని నేను చెయ్యాలంటే ముందు నన్ను మీ శిష్యుడిగా చేర్చుకోండి: ఆధ్యాత్మిక ప్రపంచంతో పరిచయం చెయ్యండి. లేదా, కనీసం ఆ ప్రపంచంలోని వింతలు చూసేలా చెయ్యండి," అన్నాను భక్తిపూర్వకంగా.

"నీకు తట్టుకునే శక్తి వుందా?" అన్నాడు అవధాని సీరియస్‌గా చూస్తూ.

"మీరు నా ప్రక్కన వుంటే, దానికేం కొదవ?" అన్నాను తొణక్కుండా.

"శెభాష్! అలాగుండాలి," నా భుజంమీద అవధాని చెయ్యి వచ్చిపడింది, మృదువుగా.

క్షణంసేపు నాలో విద్యుత్తులాంటిది ప్రసరించినట్టయింది. ఆ అనుభూతి అపూర్వం, అనిర్వచనీయం.

అయిదు నిముషాలు ఏవేవో కబుర్లతో గడిచాక___

"ఎల్లుండి అమావాస్య కదూ! మనం ఓచోటికి కెళ్దాం. మాంచి తమాషా చూద్దువుగాని, ఎల్లుండి రాత్రి సరిగ్గా పదింటికి యిక్కడకు రా," అన్నాడు అవధాని.

"అలాగే సర్!" అని అనేసి, ఓ నమస్కారం చేసి, యింటికొచ్చిపడ్డాను, ఆనందంతో తేలిపోతూ.

ఒక వారంరోజుల్లో నాలో ఎంత మార్పు? అవధానిని

కలుసుకోక పూర్వం పచ్చి నాస్తికుడ్ని, భౌతికవాదిని. కాని, యిప్పుడు దేన్నైనా నమ్మే స్థితిలో వున్నాను. ఈ లోకంలో జరగకూడనిది, అసంభవం అంటూ ఏమీ లేదని పిస్తోంది. ఎడారిలో కమలాలు పండినా, కొండల్లో ఖర్జూరం చెట్లు పెరిగినా ఆశ్చర్యపోను.

రావాల్సిన అమావాస్య రోజు వచ్చింది.

అవధాని చెప్పిన లైముకు హోటల్‌కు వెళ్ళాను. నేను హోటలు చేరుకునేసరికి, అవధాని నా కోసమే యెదురు చూస్తున్నాడు, ఆవరణలో ఓ కార్లో కూచుని సిద్ధంగా.

"నీ కోసమే చూస్తున్నాను. రా! రా! కారెక్కు"

పిలిచాడు ఆయన కారు తలుపు తెరిచి.

నేను కార్లో కూచోగానే, కారు బయలుదేరింది.

"ఎక్కడికండీ ఇలాగ?" అన్నాను కాసేపయాక. అప్పటికి, కారు పట్నం పొలిమేరలు దాటిపోయి, మాంచి స్పీడులో పోతోంది.

"తినబోతూ రుచులడగడం దేనికి? నువ్వే చూస్తావుగా. మనం తిరిగే ప్రపంచమంత పెద్దదిగానే ఉంటుంది' ప్రేతాత్మల ప్రపంచం కూడా... ఆ ప్రపంచంతోనే మొదటిసారిగా నీకు పరిచయం కాబోతోంది ఇవాళ. ముందుగా ఒక్కమాట... మౌనంగా చూస్తూ కూచోవడమే గాని నీ అంతట నువ్వుగా యేమీ చెయ్యనని మాట ఇవ్వాలి."

"అలాగే సార్! ప్రామిస్ చేస్తున్నాను," అన్నాను.

అవధాని మౌనంలోకి జారుకున్నాడు నన్ను నా ఆలోచనలకు వదిలి.

అలా దాదాపు రెండు గంటలసేపు ప్రయాణంచేసి ఉంటాం.

"డ్రైవర్ ఇహ ఇక్కడాపు" అన్నాడు అవధాని కారు ఓ చోటకు చేరుకోగానే.

డ్రైవరు కారాపాడు టక్కున.

"దిగు ఇక్కడ" అన్నాడు అవధాని నన్నుద్దేశించి.

కారులోంచి దిగుతూ చూసాను, నేను దిగిన ప్రదేశాన్ని. రోడ్డుకు అటూ ఇటూగానీ, సమీపంలోగానీ, ఏ ఊరూ ఉన్నట్టులేదు. అంతటా చిక్కని చీకటి. కారు దీపాల కాంతిలో మాత్రం రోడ్డు కాస్త మేర అవుపిస్తోంది.

అవధాని కూడా దిగి "ఇహ నువ్వు వెనక్కు వెళ్ళు," అన్నాడు డ్రైవరుతో.

డ్రైవరు అవధానికో నమస్కారంచేసి, కారు వెనక్కు త్రిప్పి, పట్నంవైపు వెళ్ళిపోయాడు.

నేనూ, అవధాని చీకటిలో మిగిలిపోయాం.

రెండు నిముషాలు గడిచాక, నక్షత్రాల కాంతిలో, రోడ్డు కాస్త అవుపించడం మొదలుపెట్టింది. ఆకాశంలో మేఘాలు ఉండి ఉంటే, అదిగూడా వీలుకాక పోను.

"ఊరు నాడూ కాని చోట, చీకటిలో, అడవిలో దిగామేమిటి సార్? రేపు మళ్ళా ఊరికిపోవడం యెలాగో ఆలోచించారా?" అన్నాను.

నాకు అంతా అయోమయంగానూ, అగమ్య గోచరంగానూ ఉంది.

"నువ్వేం భయపడకు. చీకటిలో నేను బాగా చూడగలను. పురుగు పుట్రా భయంకూడా అక్కర్లేదు నీకు. మనకు పదడుగుల దూరంలో ఉన్న జంతుజాలం మన రాక గ్రహించి పారిపోతుంది. ఇహ, ఇంటికి తిరిగి వెళ్ళడం

అంటావా? ఇప్పుడెలా వచ్చామో, అలాగే వెళ్తాము" అన్నాడు అవధాని.

ఇప్పుడు మా ప్రయాణం రోడ్డుమీద కాక, ఓ అడవిలోని సన్నని చీలికలాంటి కాలి బాటమీద సాగుతోంది.

"చూడు ఉమాపతీ!" నా ప్రేరణ లేకుండానే అవధాని మాట్లాడ్డం ఆరంభించాడు.

"చెప్పండి సార్!" అన్నాను ఉత్సాహంగా.

"పిలును బట్టి, సదుపాయాన్ని బట్టి, మనుషులెలా పట్నాల్లో విస్తారంగా, పల్లెల్లో చాలా తక్కువగా, కుగ్రామాల్లో అయితే, మరీ పలుచగా ఉన్నట్లు, ప్రేతాత్మలు ముమ్మరంగా తిరుగాడే ఓ స్థలానికి నిన్నిప్పుడు తీసుకెళ్తున్నాను" చెప్పాడు అవధాని.

నేనేం వ్యాఖ్యానించలేదు. "అలాగే!" అంటూ మౌనం వహించాను.

ప్రేతాత్మలు అంటే దెయ్యాలు. అవి యెవరికయినా అగపడినట్లుగా వారు రూఢిగా చెప్పగా నేను వినలేదు. అవు, నేను వాటిని యెన్నడూ చూడలేదు. అలాంటిది, అవధాని, దెయ్యాలు విస్తారంగా ఉండే స్థలాన్ని చూపిస్తానంటున్నాడు.

దెయ్యాలెలా వుంటాయో చూడాలన్న కుతూహలం నాలో కలిగింది.

సుమారు ఓ గంట నడిచేసరికి, అడవి తరిగిపోయి, మైదానం ఒకటి వచ్చింది.

చుక్కలు ప్రసరిస్తున్న ఆకాస్త వెలుగులో అవుపించిన, ఒకటి రెండు తులసి కోటలూ, సమాధుల్ని బట్టి, అది శ్మశానం అని గ్రహించాను.

మరి కాస్త దూరం వెళ్ళాక, మా ముందునుంచి, రెండు నక్కలు జోరుగా, ఎవరో తరిమినట్టు, పరిగెత్తాయి.

అదే సమయంలో నా కాలికేదో తగిలింది. పడిపోబోయాను. కారణం యేమిటో పరిశీలించేసరికి, నా గుండె గుభేలుమన్నది,

కొంచెం కొంచెంగా కరిగిన మట్టిలోంచి పైకి వచ్చి కనిపిస్తోంది, అక్కడ కప్పబడిన శవం తాలూకు చెయ్యి కాబోలు.

ఇందాక మా ముందునించి పరుగెత్తిన నక్కల పనే ఇది అనుకున్నాను.

అలాంటి దృశ్యం అలాంటి వేళలో చూడ్డం నాకు అదే మొదటిసారేమో, నా గుండె ఒక్కక్షణం నిలిచిపోయి, తిరిగి రెట్టింపు వేగంతో కొట్టుకోసాగింది.

నా ఆలోచనలు చదివేసినట్టు "భయపడకు!" అంటూ నా చెయ్యి పట్టుకున్నాడు అవధాని. అదేమిటో మంత్రించినట్టుగా భయం మాయమై, దాని స్థానంలో మొండి ధైర్యం చోటు చేసుకుంది.

"పద, ఆ మామిడిచెట్టు గుబుర్లలో కూచుందాం," అంటూ నన్ను ఓ దిక్కుగా లాక్కెళ్ళాడు అవధాని.

యాంత్రికంగా అతడ్ని అనుసరించాను.

ఇద్దరం ఓ బరువైన కొమ్మమీదకు ఎక్కి కూచున్నాం. మాకు అభిముఖంగా శ్మశానం ఉంది. మా వెనుక దట్టమైన అడివి ఉంది.

రెండు క్షణాలక్రితం, మా సంభాషణవల్ల, చెదిరిన నిశ్శబ్దం మళ్ళా దట్టంగా పేరుకున్నట్టయింది.

నా రేడియం డయల్ రిస్ట్‌వాచీ చూసుకొన్నాను.

పన్నెండు గంటలు దాటి పదినిముషాలవుతోంది.

కీచురాళ్ళ శబ్దం ఏకబిగిన వినిపిస్తోంది ఇప్పుడు. మధ్య మధ్య గాలికి ఊగే చెట్లకొమ్మల గలగలలు ఉండుండి వికృతంగా అరిచే పిట్టల అరుపులు గుండె ఝల్లుమనిపిస్తున్నాయి.

"చూడటు" అన్నాడు అవధాని, నా తొడమీద చేత్తో పొడుస్తూ.

"ఎటు" అన్నాను, చీకటి తప్ప నాకేమీ అవుపించక పోయేసరికి.

"ఓ ఊరేగింపు అవుపించడం లేదూ?"

"లేదు."

"కాస్త మనస్సు కాన్‌సెంట్రేట్‌ చేసి చూడు."

అది మనస్సుని కేంద్రీకరించడం అవుతుందో కాదో నాకు తెలీదుగాని, నాకు తోచిన ప్రయత్నమేదో చేసాను. అయినా, నాకేమీ అగపడలేదు.

ఆ విషయం అవధానికి చెప్పాను.

"ఊహూ! ఇలాగయితే ఎలా నీతో" అంటూ తన రెండు చేతులూ నా తలమీద ఉంచాడు ఓ క్షణం. ఆ మీదట, మెల్లగా నా భుజాలమీద, మెడమీద కాసేపు కదిపి, తటాలున, నా భుజానికీ, మెడకీ మధ్యభాగంలో ఓ చోట ఓ నరం పట్టుకుని గట్టిగా నొక్కాడు.

నా కళ్ళముందు దీపాలు వెలిగినట్టయింది, మరు క్షణంలో.

నాకిప్పుడు మాకు ఎదురుగా ఉన్న మైదానం చివర్న వస్తున్న ఊరేగింపు స్పష్టంగా కనిపిస్తోంది.

"ఆ ఇప్పుడు అవుపిస్తోంది మీరు చెప్పిన ఊరేగింపు.

ఇంతకూ యేంచేసారు నన్ను?'' అన్నాను, నా మనో నేత్రమేదో తెరుచుకున్నట్టనిపించి.

''మనిషి శరీరంలో తొమ్మిది సైకిక్ సెంటర్స్ ఉంటాయి. ఆ తొమ్మిది కేంద్రాలూ తెరవబడుతుంటే, ఆ వ్యక్తికి ఒక్కో అమోఘశక్తి సిద్ధిస్తుంది. యోగవిద్య అంటే, యీ సైకిక్ సెంటర్స్ని తెరవడమే. ఇప్పుడు నీకు నేను చేసిందేమిటంటే, తాత్కాలికంగా, నిశిత, కేంద్రీకృత, మనోశక్తికి తప్ప అవుపించని ఆత్మలు కనిపించేలా, నీ ఒంట్లోని ఓ సైకిక్ సెంటర్ని కొంచెం తెరిచాను. చూసి ఆనందించు,'' చెప్పాడు అవధాని.

''సార్! నా కనుభవం అయిందికాబట్టి, మీరు చెప్తున్నది నిజమనిపిస్తోంది. ఈ విషయం ఇంకొకరికి చెబితే, డామ్ నాన్సెన్స్ అనరూ!'' అన్నాను, రేపు నేను యీ సంగతులన్నీ చెప్పినా, జనం సులువుగా నమ్మరుసుమండీ, అన్న ఉద్దేశం వ్యక్తపరుస్తూ.

''అక్యూ పంచర్ని నాన్సెన్స్ అని ఎందుకనవూ? చెవి తమ్మెలో సూది గుచ్చితే, గుండె జబ్బులు నయమవుతాయా? తొడ చేయి వగైరా కొన్ని భాగాల్లో సూదులు గుచ్చితే, పక్షవాతం కుదురుతుందా? మై డియర్ ఫ్రెండ్! మానవుడి శరీరంలో ఏముందో సమగ్రంగా తెలిసినవారుగాని, తెలుసుకొన్నవారుగాని ఇంకా ఎవరూ పుట్టలేదు. తెలుసుకోవాల్సింది, తెలుసుకొని లబ్ధి పొందాల్సింది ఎంతో ఉంది.''

దాంతో నా నోటికి తాళం పడిపోయింది.

అదే సమయంలో ఊరేగింపు కూడా బాగా దగ్గరయింది. ఆ దృశ్యం చూడ్డంలో మునిగిపోయాను.

ఊరేగింపులోని వాళ్ళు చూడ్డానికి మానవాకారాల తోనే ఉన్నారుగాని, అంత వికృతమైన ఆకారాల్ని, నా ఇరవై ఎనిమిదేళ్ళ జీవితంలో ఎన్నడూ చూళ్ళేదు.

గాల్లోకి లేచిపోతున్నట్టుగా జుత్తు, ఓ ప్రక్కకు కోసుకుపోతున్నట్టుగా ఎగుడుదిగుడుగా మొహాలు, పెదాల దగ్గర వంపులు తిరిగిన కోరలు, వెడల్పాటి నోళ్ళు, కళాయి పాడయిపోయిన అద్దంలో కదులాడే మనుషుల మూర్తుల్లా అవుపిస్తున్నారు వాళ్ళు.

కొన్ని వందల ప్రేతాత్మల మధ్యగా ఓ తెల్లని పల్లకీ. ఆ పల్లకీలో, తన రెండు బుగ్గల్లో రెండు లడ్లు దాచుకొన్నట్టుగా పెద్ద బుగ్గలు, వికృతంగా బానలా వేలాడే పెద్ద బొజ్జమీద, ఊరికినే కదులాడే రొమ్ముభాగం గల ఓ భారీ విగ్రహం ఉంది. తడవతడవకూ ఓ నలుగురు వ్యక్తులు ముందుకొచ్చి, ఆ పల్లకీని తమ భుజాలమీదకు మార్చుకుంటున్నారు. మరో నలుగురు కొత్తవాళ్ళు రాగానే, ఆ నలుగురు తప్పుకుంటున్నారు.

ఈలోపున ఊరేగింపు వైపుగా ఓ వ్యక్తి పరుగెత్తుతూ అవుపించాడు.

"వాడెవడో తెలుసా? వాడో ప్రేతాత్మ-బ్రతికుండగా అందమైన ఆడవాళ్ళ వెంటబడి అనుభవించాడు. చచ్చాక కూడా వాడి భ్రాంతి తీరలేదు. ఇక్కడకు పదిమైళ్ళ దూరంలో ఉన్న ఓ చిన్న ఊళ్ళో కామాక్షి అనే అందమైన స్త్రీ ఉంది. ఆమెనుపట్టి తన కామదాహం తీర్చుకుంటున్నాడు," చెప్పాడు అవధాని మెల్లగా.

"అది సరేగాని, ఇంతకూ ఆ పల్లకీలో ఊరేగుతున్న వ్యక్తి ఎవరో చెప్పండి. అప్పుడుగాని తతిమ్మా విషయాలు

అర్థంగావు నాకు,'' అన్నాను.

"ఆ పల్లకీలో వ్యక్తి కాలభైరవుడు. ప్రేతాత్మలకు నాయకుడు. ప్రతీ అమావాస్యకు బయలుదేరి, తన వాళ్ళను చూసిరావడం అతనికి అలవాటు. ఇందాక నేను చెప్పిన వ్యక్తి, అతని ముఖ్య వ్యక్తుల్లో ఒకడు. ఈ స్థావరానికి సంబంధించిన వాడు. ఊరేగింపునాడు తన మొహం చూపించకపోతే, తన నాయకుడికి ఆగ్రహం వస్తుందని అతని భయం. అందుకే అంత ఆత్రంగా పరుగెడుతున్నాడు,'' వివరించాడు అవధాని.

"ఈ సంగతి కాలభైరవుడికి తెలీదంటూరా? అయినా తెలుసుకుంటే ఏమవుతుంది?'' అన్నాను, అవధాని చెప్తున్నది ఓ కట్టు కథగా, నేను చూస్తున్నది ఓ కలగా అనుకుంటూ.

"ఓ మైగాడ్! తెలీడమే! వాడ్ని చిత్రహింసలు పెట్టందే వదలడు కాలభైరవుడు. ఇంకో విషయం. మనుషుల్లో జానిసత్వం పోయిందిగాని ఇంకా ప్రేతప్రపంచంలో మాత్రం ఉంది. ప్రేతాత్మలచేత ఊడిగాలన్నీ చేయించుకునే వాళ్ళున్నారు తెలుసునా?''

"అలాగా? మరి, మీ రెందుకు చేయించుకోరు?'' అన్నాను మామ్మూలుగా.

"ఇందాక మన కారు నడిపిన డ్రైవర్ని చూసావా?''

"లేదు,'' అన్నాను ఆశ్చర్యంగా.

"అదో ప్రేతం... అంతేగాదు! అవాళ డోమ్‌లోని బల్బ కూడా బద్దలుకొట్టింది ప్రేతమే!''

అవధాని నా ప్రక్కనే కూచుని మాట్లాడుతున్నాడు మామ్మూలుగాకానీ, ఎందుకో అతన్ని చూస్తుంటే, నా గుండెల్లో వణుకు పుడుతోంది.

అప్పటికి ఊరేగింపు కదిలి, దూరంగా వెళ్ళి కనుమరుగై పోయింది.

"ఇహ పద! వెళ్ళిపోదాం," అన్నాడు అవధాని, కొమ్మమీంచి కిందికి గెంతుతూ, నేను కొమ్మదిగి అతన్ని అనుసరించాను.

కాస్తదూరం వెళ్ళాక, "ఇలారా ఒకసారి నా దగ్గరికి" అని అవధాని అనగానే, అతనికి చేరువగా వెళ్ళాను.

ఇందాకటిలాగే నా మెడమీద చేతులుంచి, ఇందాక నొక్కినచోట నరంమీద నొక్కాడు. నేను మామూలుగా అయిపోయాను. మునపటి చీకటి తప్ప ఇంకేమీ అగపడడం లేదు నాకు.

# 3

ఈ భౌతిక ప్రపంచం గాక, వేరేగా ఆత్మ ప్రపంచం ఒకటుందని నా మనస్సులో బలంగా నాటింది.

ఇహ; దేవుడూ, పూజలూ, భక్తీ వగైరా ఆధ్యాత్మిక విషయాలు అవధాని ప్రమేయం లేకుండానే, నా మనస్సుని ఆక్రమించుకున్నాయి వాటంతటవే.

ఇప్పుడు నాకు అవధాని సర్వస్వం అయిపోయాడు.

ఓ రోజున సాయంత్రం అవధాని గదికి వెళ్ళేసరికి, అతని సోఫాలో గుడ్డలు చుట్టిన ఓ స్త్రీమూర్తి చెక్క బొమ్మ పడుకోబెట్టి వుంది. దాన్ని తదేకంగా చూస్తున్నాడు అవధాని, సోఫాకు యెదురుగా ఓ కుర్చీలో కూచుని.

రెండు క్షణాలు పోయాక నన్ను చూసి నవ్వాడు.

"నీకు శరీరస్పర్శ అంటే అనుభవం వుందా?" అన్నాడు నా కళ్ళల్లోకి చూసి.

'ఉందీ!' అని నేను చెప్పడానికి నాకు యింకా పెళ్ళి కాలేదు. లోకం దృష్టిలో నేను బ్రహ్మచారినే.

కాని, నాకు ఆడదాని శరీరస్పర్శ అంటే కొత్తేమీ కాదు. అమ్మాయిలంటే పడి చస్తాను. అమ్మాయిల పొందు కోసం ఎంత ఖర్చయినా పెడతాను. అది నా వీక్ నెస్!

తాజాగా యిప్పుడు రంజని అనే అమ్మాయికోసం ప్రయత్నం సాగిస్తున్నాను.

రంజనిని సినిమాహాల్లో చూసిన మొదటిరోజునే, ప్రయత్నించి ఆమెను ఎలాగయినా పొంది తీరాలని నిశ్చయించుకున్నాను.

అయితే; రంజని, శేఖరం చెల్లెలని తెలియవచ్చింది. స్నేహితుడు చెల్లెలు గదా తప్పు చేస్తున్నానేమో అని మొదట మథనపడ్డా, చివరకు ఆమె వాడికి స్వంత చెల్లెలు కాదుతే అని తృప్తిపడి, రంజని నా స్నేహితుడి చెల్లెలన్న విషయాన్ని మనసుమీంచి తుడిచేశాను శాశ్వతంగా.

రంజనిని లొంగదీసుకునే ప్రయత్నంచేస్తున్న సమయంలోనే, శేఖరం నన్ను తీసుకొచ్చి అవధాని ప్రభావంలో పడేశాడు.

"ఏం?...నీకు స్త్రీ శరీరస్పర్శ అంటే అనుభవం వుందా?" అవధాని రెట్టించగానే, నా ఆలోచనా ప్రపంచంలోంచి ఊడిపడి, ప్రస్తుతంలోకి వచ్చాను.

"ఉంది సార్!" అన్నాను తలవంచుకుని సిగ్గుపడుతూ.

"అయితే ఆ బొమ్మను ఓసారి ముద్దుపెట్టుకుని, ఎలాగుంటుందో చెప్పకూడదూ?" అన్నాడు అవధాని.

తుళ్ళిపడి "ఏమిటీ?...దాన్ని ముద్దు పెట్టుకోవడమా? అదేమిటి సార్ అలాగంటారు? అయినా యెందుకు సార్ బొమ్మను ముద్దు పెట్టుకోవడం?" అన్నాను నేను.

"ఎందుకా? నీకే తెలుస్తుంది? ఓసారి ముద్దుపెట్టుకుని చూస్తే, యేం పోయింది నీకు?" అన్నాడు అవధాని పంతంగా.

అవధాని అలా అనేసరికి, ఇహ కాదనలేకపోయాను. చెక్క బొమ్మ ఉన్న సోఫాకద్దకు వెళ్ళాను. మోకాళ్ళ మీదకు వంగి కూచుని దానివైపు చూసాను. నిర్మలంగా వుంది.

చట్టున వంగి ముద్దుపెట్టుకున్నాను, ఆ బొమ్మను.

కలిగిన ఫీలింగ్ చూసి దిగ్భ్రాంతి చెందాను. ఎంచేతంటే, ఆ ఫీలింగు యేమిటో అనుభవంవల్ల తెలుసు. అది నిండుగా, బలిష్ఠంగా గోపురంలా యెదిగిన ఓ యువ్వని స్తనం ముద్దుపెట్టుకొన్నప్పటి ఫీలింగ్.

కాని, అది గరుగ్గా, చెక్కలా తగలడానికి బదులు, యేమిటీ విచిత్రానుభూతి?

నా అనుమానం తీరక మెల్లగా వంగి, మళ్ళీ ముద్దు పెట్టాను.

మళ్ళా అదే వింత అనుభూతి?

నా మొహం, నిండుగా యెదిగిన ఓ స్త్రీ రొమ్ముల మధ్య లోయలో కూరుకుపోయినట్టయింది.

అలానే రెండు క్షణాలు ఉన్నాను. ఆ అనుభూతి మాయలేదు.

నా వెనుక గట్టిగా అవధాని నవ్వు వినబడింది. తుళ్ళి పడి చట్టున లేచి నిలబడ్డాను.

"మీరేదో మెస్మరిజం చేసారు సార్! ఏమిటీ తమాషా?" అన్నాను నవ్వి.

అవధాని నవ్వు ఆపుకుని, "ఈ బొమ్మను ఒక రోజుకు

నీకు కానుకగా ఇస్తాను. తీసుకెళ్ళి అది అందించే ఆనందం కూడా చవిచూడు" అన్నాడు.

నాకెంతో ఆశ్చర్యం వేసింది. ఆ బొమ్మ పురుషుడిని ఆనందపరచగలదా?

నేను మాట్లాడలేదు. అర్ధంతంగా అతని మొహంలోకి చూస్తూ ఉండిపోయాను.

"సిగ్గుపడకు. తీసుకో!" అంటూ తక్షణం ఆ చెక్క బొమ్మను ఓ అట్టపెట్టెలో పెట్టి నా చేతిలో ఉంచాడు అవధాని.

గప్‌చిప్‌గా పెట్టె పుచ్చుకుని, అతనికి థేంక్స్ పారేసి యింటికొచ్చి పడ్డాను.

"ఏమిట్రా ఆ పెట్టె?" నా చేతిలో ఉన్న పెట్టెచూసి అమ్మ కుతూహలంగా అడిగింది. అమ్మకేదో చెప్పి, భోజనం ముగించి, నా గదిలోకి పోయి తలుపులు మూసుకొన్నాను.

పెట్టెలోంచి చెక్కబొమ్మను వెలుపలికితీసి మంచం మీద ఉంచాను. ముద్దు రిపీట్ చేసాను. అదే అనుభూతి! అదే ఫీలింగ్! నా ఒంట్లో రక్తం కోరికతో ఉరకలు వేయసాగింది.

గదిలో దీపం పెద్దగా వెలుగుతోందన్న విషయం గుర్తుకొచ్చింది. కొన్ని పనులు చీకట్లో చేస్తేనే బావుంటాయి. లైటార్పేసాను. నా మంచాన్ని సమీపించాను.

నా గుండాగినట్టయింది.

మంచమీద చెక్కబొమ్మకు బదులు, నగ్నంగా ఓ స్త్రీ పడుకుని ఉంది.

"ఎవరది?" అన్నాను మెల్లగా. జవాబుగా గలగల నవ్వు మాత్రం వినిపించింది.

నేను సందేహిస్తూ నిలుచున్నాను, యింకేం మాట్లాడాలో తెలీక, చొరవ తీసుకునే ధైర్యంలేక.

మంచంమీది ఆకారం కదిలి నాకు చేరువగా వచ్చింది. తన రెండు చేతులతో నా శిరస్సుని అందుకుని, తన గుండెల కదుముకుంది బలంగా.

అదే ఫీలింగ్! చెక్కబొమ్మను ముద్దుపెట్టుకొన్నప్పటి అనుభూతి ఇదే! ఆ స్త్రీ యీమే!

అవధాని తన కోర్కెలు తీర్చుకోవడానికి అమ్మాయిలను యీ విధంగా రప్పించుకుంటాడేమోనని, ఊహించాను.

తన గుండ్రని అవయవాలకు ఆమె నన్ను గట్టిగా అదుముకుంటుంటే, ఇక ఆగలేకపోయాను.

రెచ్చిన తమకంతో, ఆమెను గాఢంగా కౌగిలించుకుని, మంచంమీదకు దొర్లాను.

# 4

రాత్రంతా కమ్మనికలగా కరిగిపోయింది—

తెల్లవారేక చూద్దునుగదా, నా ప్రక్కలో చెక్కబొమ్మ మాత్రమే మిగిలి ఉంది.

రాత్రి అపూర్వమైన అనుభూతుల్ని అందించిన ఆ బొమ్మను చూడగానే నవ్వొచ్చింది నాకు.

హుషారుగా మంచంమీంచి లేవబోయాను. కాని, నడుం పట్టినట్టయింది. ఒంట్లో నీరసంగా ఉన్నట్టు అనిపించింది.

ఎంతయినా అంత జోరు పనికిరాదు. విడవకుండా అన్నిసార్లు రతిలో పాల్గొంటే యేమవుతుంది? నవ్వుకున్నాను.

మంచం దిగి, గది బయటకు వచ్చాను కాలకృత్యాలు తీర్చుకోవడానికి.

కాఫీ గ్లాసు అందిస్తూ, "ఏమిట్రా అలాగున్నావు? మొహం అదీ పీక్కుపోయి... పది లంఖణాలు చేసినట్టున్నావు" అంది అమ్మ ఆశ్చర్య ముద్ర మొహంమీద కనబరచి.

"అలాగుటమ్మా!" అంటూ బయటకు మాట్లాడి, కాఫీ త్రాగి, వెళ్ళి అద్దంలో చూసుకొన్నాను నా మొహం.

మొహం కాస్త చిక్కినట్టుగా ఉన్నమాట నిజమే గాని, రాత్రంతా మెలకువగా ఉండి, నరాలకు విశ్రాంతి యివ్వకపోతే_ యేమవుతుంది మరి? అనుకున్నాను.

మళ్ళా నా మనస్సు చెక్కబొమ్మ వైపుకు లాగడం ఆరంభించింది.

తక్షణం నా గదిలోకి దూరి కోరిగ్గా చెక్కబొమ్మను ముద్దుపెట్టుకున్నాను.

కాని__ కాని... యేమిటిలాగుంది?

గతరాత్రి అనుభవంలేదు. కేవలం చెక్కబొమ్మను ముద్దుపెట్టుకొన్నట్లుగానే ఉంది.

క్షణం నిలవలేకపోయాను. చెక్కబొమ్మను పెట్టెలో పడేసి, అవధాని గదికి పరుగెత్తాను. జరిగింది అవధానికి చెప్పాను.

ఆయన నవ్వి, "ఆల్ రైట్! ఆ టేబిలు మీదుంచు ఆ పెట్టెని" అన్నాడు.

పెట్టెని టేబిలుమీద ఉంచుతూ, "ఆ అనుభవాన్ని శాశ్వతంగా నాది చెయ్యలేరా సార్?" అన్నాను.

"నో! నో! ఒక్కరోజు కోసమే తమాషాకు అలా

చేసాను. ప్రేతాత్మల్ని ఉంపుడుగత్తెలగా కూడా వాడుకో వచ్చని నీకు చూపించాలనుకున్నాను. చూపించాను. అయినా, ఆ అనుభూతిని పెర్మనెంట్ చెయ్యాలంటే చాలా తతంగమవుతుంది.''

''అయినాసరే, ఆ అనుభవం, ఆ అప్సరస శాశ్వతంగా కావాలి'' అన్నాను ప్రాధేయపూర్వకంగా.

''అలా చెయ్యాలంటే, ఆ ప్రేతాత్మతో నీవు కమ్యూనికేట్ చేసేలా చెయ్యాలి. చాలా కష్టమైన పని'' అన్నాడు అవధాని అయిష్టంగా.

''అలాగనకండి సార్! ఎలాగయినా సరే, ఆమె నాకు కావాలి. ఆ పొందు నాకు దక్కదనుకుంటే, నా గుండె పగిలిపోతుంది,'' అన్నాను ఆవేదనగా.

అవధాని ఓ క్షణం ఆలోచించి ''ఆల్ రైట్! ఇవాళ రాత్రి పన్నెండుగంటలకి యిక్కడకు నా గదికి రా. ఆ ప్రేతాత్మతో నువ్వు మాట్లాడి, నీతో సాహచర్యం చేసేలా చేస్తాను'' అన్నాడు.

అవధాని మాటలు నామీద అమృతవర్షం కురిపించాయి.

''థేంక్యూ సార్! థేంక్యూ వెరీమచ్!'' అవధాని చెయ్యి పుచ్చుకుని, చెయ్యి నొప్పిపుట్టి అరిచేంతవరకూ ఊపేసాను.

# 5

అవధాని చెప్పినట్టుగానే, రాత్రి పన్నెండుగంటలకు అతడి గదికి వెళ్ళాను.

నిత్యమూ సూటులో తప్ప అవుపించని అవధాని యిప్పుడు ఒక్క దోవతి మాత్రం కట్టుకుని ఉన్నాడు.

నుదుట ఎప్పటిలా ఎర్రని కుంకుమబొట్టు పెట్టుకున్నాడు. కాంతివంతంగా మెరిసే నుదుటిమీది ఆ ఎర్రబొట్టు, తూర్పున అప్పుడే ఉదయిస్తున్న సూర్యబింబంలా ఉంది.

గదిలో లైట్లు పూర్తిగా తీసివేయబడ్డాయి. అయితే, గది మధ్యలో వెలిగించిన మట్టి ప్రమిదల కాంతి మాత్రం తమాషాగా అలుముకుని, విచిత్రమైన వాతావరణాన్ని సృష్టిస్తోంది.

నేలమీద ఉండే తివాసీ చుట్టబడి, గదిలో ఓ మూలకు నెట్టబడింది.

గది మధ్యలో తమాషా అయిన ముగ్గులు, వాటిమధ్య నిన్నటి చెక్క బొమ్మ, వెలిగించిన మట్టి ప్రమిదలు, కుంకుమ, పసుపు, అక్షింతలు వగైరా పూజా ద్రవ్యాలున్నాయి.

"కరెంటు లేదా గురువుగారూ?" అన్నాను, పెద్ద దీపాలు లేకపోవడం నాకు నచ్చక.

"లేకేం. ఉంది. కాని, అది పనికిరాదు. అందుకే తీసేసాను. అలా బాత్ రూంకి పోయి చేతులూ, కాళ్ళూ కడుక్కొనిరా" అన్నాడు అవధాని.

తిన్నగా బాత్ రూంకి పోయి, అవధాని చెప్పినట్టుగా, కాళ్ళూ, చేతులూ కడుక్కొని వచ్చాను.

పొడి తువ్వాలుతో కాళ్ళూ, చేతులూ తుడుచుకుని సిద్ధంగా నిల్చోగానే, "అలా కూచో, యీ ముగ్గుకు ఎదురుగా" అన్నాడాయన.

ఆయన చెప్పినట్టుగానే పోయి కూచున్నాను. నాకు అటూ యిటూ ఊదొత్తులు వెలిగించి స్టాండుల్లో వుంచాడు. నా నుదుట కుంకుమ బొట్టు ఉంచి "కళ్ళు మూసుకుని నా మీద కేంద్రీకరించు నీ మనస్సుని... తెలిసిందా?... నేను

తెరిచి చూడమన్నప్పుడు, మాట్లాడినప్పుడు మాత్రం కళ్లు తెరిచి మాట్లాడు యేం?'' అన్నాడు.

నేను తలాడించి, అతడు చెప్పిన ప్రకారమే చేసాను.

మొదట నా కళ్ళ ముందు చీకటితెర దట్టంగా అవుపించింది. ఆ తరువాత మెల్ల మెల్లగా, ఆ తెర పల్చనై, చివరకు అదృశ్యమై, దాని స్థానంలో ఓ కాంతి పుంజం నిలిచింది.

అంతసేపూ అవధాని మొహం నా ఊహాలోకి తెచ్చుకోవాలని ప్రయత్నించాను గాని, సఫలుడ్ని గాలేక పోయాను.

అవధాని ఏవేవో మంత్రాలు చదువుతున్నాడు. మధ్య మధ్య హుంకరిస్తున్నాడు. అరుస్తున్నాడు.

క్రమంగా నా కళ్ళ ముందరి కాంతిపుంజంమీద నల్లని నీడలేవో కనబడసాగాయి.

ఏమిటా నీడలు? అవి స్పష్టంగా కనిపిస్తే బావుణ్ణనిపించింది.

చివరకు ఓ ఆకారం నా కళ్ళముందు నిలబడింది.

ఆ ఆకారం అంత వికృతమైందీ, భయంకరమైందీ, జుగుప్సాకరమైందీ నా జీవితంలో చూళ్ళేదు. ఎవరయినా నన్ను కనీసం ఊహించమన్నా, ఊహించలేను. ఆ ఆకారం మొహం అంతటా లెక్కలేనన్ని ముడుతలు. ముక్కు సన్నగా పొడుగ్గా వుండి, కొన నోటిమీదకు వంగింది. పెదాలు మొద్దుగా ఎర్రగా వున్నాయి. జుట్టంతా చింపిరి చింపిరిగా గాల్లోకి లేచివుంది. దళసరి, పొడుగాటి సంచుల్లా వున్నాయి ఆమె స్తనాలు.

కొద్ది క్షణాలుండి ఆ దృశ్యం మాయమైంది.

అదే క్షణంలో "ఇహ కళ్ళు తెరిచి చూడు" అన్న అవధాని మాటలుకూడా విన్పించాయి. కళ్ళు తెరిచాను.

గదిలో నేనూ, అవధానే గాకుండా, యింకో వ్యక్తి కూడా వున్నట్టు ఫీలయ్యాను.

ఎవరా వ్యక్తి?

నా కళ్ళు అప్రయత్నంగానే గదిని చుట్టివచ్చాయి.

"మరీ అంత సిగ్గెందుకు మాయా? ... ఇలారా ... కూచో" అన్నాడు అవధాని, తనకు దూరంగా నేలమీద తట్టుతూ.

మొదట కిలకిలమంటూ నవ్వు విన్పించింది. ఆ తర్వాత, నాకు ఎదురుగా, గోడవారగా ఉన్న సోఫా మసకగా అవుపించడం ఆరంభించింది.

ఆ నవ్వు నాకు బాగా గుర్తు. ముందర రాత్రి నన్ను స్వర్గసౌఖ్యాల్లో ముంచి తేల్చిన అప్సరసదే!

రెండు క్షణాలు గడిచేసరికి, చిత్రకారుడు ఓ చిత్రాన్ని రేఖలుమాత్రం గీసి వదిలేసినట్టుగా, ఓ స్కెచ్ అవుపించింది గాల్లో. ఆ స్కెచ్ మధ్యనుంచి, అవతలివైపున్న సోఫా, గోడ మొదలైన ఆ వైపు వస్తువులు మందంగా అవుపిస్తున్నాయి.

ఎవరీ గాజుబొమ్మ?

"మరీ అలా కనీ కన్పించనట్టుగా యేమిటి? పూర్తిగా కనిపించు," అన్నాడు అవధాని.

అప్పుడు పూర్తిగా అవుపించిందామె.

ఓ మైగాడ్! ఏమి అందం? పల్చని పొరలాంటి పాల తెలుపు చీరలోంచి, ఆమె సుంద్రని అవయవాలు, యౌవనం, అందం, రంగరించుకొన్నట్టుగా, మిసమిసలాడుతూ,

పిటపిటలాడుతూ అవుపిస్తున్నాయి. నిజంగా స్వర్గంనుండి దిగివచ్చిన దేవతలా వుంది.

నా నరాల్లో రక్తం నయాగరా దూకుడు ఆరంభించింది.

"నీకు వేరేగా పరిచయం చెయ్యక్కర్లేదనుకో. ఇతని పేరు ఉమాపతి. అందం అంటే పడి ఛస్తాడు. ఆనందం కోసం ఎంతటి సాహసాలు చెయ్యమన్నా, ఎన్ని కష్టాలు ఎదుర్కోమన్నా ఎదుర్కొంటాడు. ఇతనికి నీతో స్నేహం కావాలంట. ఉంటావా?" అడిగాడు అవధాని.

ఆమె యేం జవాబిస్తుందో అని నా గుండె గుబగుబలాడిపోయింది ఒక్క క్షణం. ఆత్రంగా ఆమె మొహం లోకి చూసాను. ఆమె తన పెద్ద కళ్లెత్తి, నా గుండెల్లోకి చూసి గలగల నవ్వింది.

ఆ నవ్వుకు అర్థం నాకు తెలుసు. ఆనందం పట్టలేక నా గుండె బద్దలవుతుందేమోనని భయపడ్డాను.

"సరే! ఇష్టమేనన్నమాట. అయితే, అతడు నిన్ను పిలవగానే కనపడాలి. రావాలి. అతడి సరదా తీర్చాలి. ఏమంటావ్?" అడిగాడు అవధాని.

ఆమె మళ్ళా అందంగా గలగలా నవ్వింది.

"వెల్! మిస్టర్ ఉమాపతీ! మాయ, ఇకముందు నీది... పిలిస్తే వస్తుంది...మాటాడుతుంది...నీ కోరిక తీరుస్తుంది. ఒక్కమాటలో చెప్పాలంటే, నిన్నొదిలి యిహముందు వుండదు" అని నాకు చెప్పాక, ఆమెవైపు తిరిగి, "ఇహ నువ్వెళ్ళొచ్చు. ఫో!" అంటూ గట్టిగా అరిచాడు అవధాని.

అంత అందమైన స్త్రీని అంత నిర్దాక్షిణ్యంగా అవధాని కసరడం చూసి నా మనస్సు చివుక్కుమన్నది.

అయితే, నాలో యే మూలో, ఓ అందమైన అమ్మా

యితో అవధాని పొందు కూర్చాడే అన్న కృతజ్ఞతా భావం దృఢంగా వుంది కాబట్టి, ఆ విషయం నేను పట్టించుకోలేదు.

ఆమె నేను చూస్తుండగానే, గాల్లో కరిగిపోయింది. ఆమె అదృశ్యమయ్యేసరికి నా మనస్సు బాధగా మూలిగింది.

నన్ను ముగ్గుల ముందరనించి లేవమని చెప్పి, తను లేచి, లైటు వేసాడు అవధాని.

ముగ్గుల మధ్యనుండి చెక్కబొమ్మను తీసి, పెట్టెలో పెట్టి నా చేతికిస్తూ, "ఈ బొమ్మ ఇక నీ దగ్గరున్నంతవరకు ఆ యువతి నీకు బానిస. నీవు పిలిచినప్పుడల్లా వస్తుంది. నీ కోర్కెలు తీరుస్తుంది," అంటూ నవ్వాడు అవధాని.

## 6

అవధానిదగ్గర సెలవు తీసుకొని, త్వరత్వరగా యింటికొచ్చాను.

వేళగాని వేళ యెక్కడికో వెళ్ళొచ్చి, తలుపు తట్టి, తన నిద్ర పాడు చేసినందుకు, అమ్మ నన్ను తిట్టింది. కాని, ఆమె తిట్లను పట్టించుకునే స్థితిలో లేను నేను.

తిన్నగా నా గదికి పోయి, లైటార్పి, మంచంమీదకు చేరుకొన్నాను. చెక్కబొమ్మను అట్టపెట్టెలోంచి తీసి దిండుక్రింద పెట్టాను.

"మాయా!...మాయా!" పిలిచాను మెల్లిగా మంచం మీంచి.

మరు క్షణంలో, ఆమె తన బరువైన వక్షాల్ని నా గుండెలకేసి అదుముతూ, నల్లని మబ్బులాంటి తన జుత్తుతో నా మొహాన్ని కప్పేసి, గాఢంగా ముద్దు పెట్టుకుంది.

నా చేతులకే కళ్ళున్నట్టుగా, ఆమె వంపులమీద కదులుతూ, యెత్తులమీద ఆడుతూ, ఆమె అందాన్ని ఆనందించసాగేయి నా చేతులు.

ఇట్టే తెల్లారిపోయింది.

మాయకు సమయాసమయాలు తెలిసినట్టుంది. మాయమైపోయింది, రాత్రి గడపిన మధురక్షణాలు జ్ఞాపకాలుగా మాత్రం మిగిల్చి.

హుషారుగా మంచం దిగబోయాను. కాని, నడుం పట్టేసింది. మోకాళ్ళు కొయ్యముక్క లయిపోయినట్టుగా అన్పించింది.

"ఛీ! ఛీ!...ఒక్క రాత్రికేనా యింత డీలా పడిపోవడం?" నాకు నేను జవాబు చెప్పుకుని, గది వెలుపలికి వచ్చాను, కాలకృత్యాలు తీర్చుకోవడానికి.

"ఏమైందిరా నీకు ... ఏమిటిలా వున్నావు?" అమ్మ గట్టిగా అరిచింది, స్నానాల గదికి పోతున్న నన్ను చూసి.

"ఏమీ లేదమ్మా! ఒంట్లో కాస్త నీరసంగా వుందంతే. ఎందుకలా అయిపోతావ్?" కసిరాను అమ్మను.

"అది కాదురా!" అంటూ యింకా అమ్మ యేదో అనబోయింది.

"ఏది కాదు...నా మానాన్న నన్ను వుండనీండి. నన్ను విసిగెత్తించకండి," యిల్లు లేచిపోయేలా పెద్ద కేకేసాను.

అమ్మ నోరు టక్కున మూత బడిపోయింది. నా వైపు వింతగా చూసి, కళ్ళల్లో నీళ్ళు తెచ్చుకుని వెళ్ళిపోయింది.

నా కోపంచూసి నాకే ఆశ్చర్యమేసింది. మరుక్షణంలో అమ్మను బాధపెట్టానన్న విషయం కత్తిలా కోసింది నా మనస్సును సన్నగా.

అయితే, ఆరోజు తర్వాత, ఆ బాధా కలగడం మానేసింది.

మాయతో కాపురంపెట్టిన నా ప్రత్యేక ప్రపంచంలో నాకేమీ తెలిసిరావడం లేదు.

అక్షరాలా అవధాని చెప్పినట్టుగా మాయ నన్నువిడిచి ఉండడంలేదు. నేనుకూడా ఆమె లేకుండా ఒక్క-క్షణం నిలవలేకపోతున్నాను.

అయితే నా ఒంట్లో శక్తి తరిగిపోతోంది. కాళ్ళు పీకుతున్నాయి. నడుం లాగుతోంది. ఒక్కో-సారి ఒళ్ళు తూలిపోతోంది కూడా.

కాని, మాయను అనుభవించాలన్న కోరికమాత్రం తరగడంలేదు. ఆమెతోటి కలయిక తీరని దాహం అయింది.

## 7

ఆరోజు నాకు చాలా నీరసంగా ఉంది ఒంట్లో. మంచంమీంచి తిరగ లేకపోయాను.

అదేమిటో, నేను యేం తింటున్నా, ఎంత తింటున్నా, ఒంటబట్టడం లేదో యేమో, రోజురోజుకీ నా బలం తగ్గిపోతున్నట్టనిపించింది.

ఉదయం పదిగంటలవుతోంది. కిటికీలోంచి యెండ గదిలోపడి తమాషాగా ఆడుకుంటోంది నేలమీద.

మాయ నాకు చేరువగా, తలదగ్గర కూచుంది. ఆమె వేళ్ళతో చిత్రంగా ఆడుకుంటున్నాను.

కాస్త తలవంచి చూస్తే, ఆమె పైటక్రింద దాగున్న పచ్చని పసిడి ముద్దల్లాంటి రొమ్ము లవుపిస్తున్నాయి. పైన, కన్పిస్తూ, ఊరిస్తూ, సవాలు చేస్తూ రమ్మంటున్నాయి మాయ మత్తుచూపులు.

"అలా చూస్తుండు. నాలుగు రోజులు భీముడి తిండి తినేసి నీ పని బట్టాను" అంటున్నాను నేను, నా నీర సానికి విచారిస్తూ.

"ఏం పనిబట్టారు? పదిరోజులకే యిలా అయిపోయారు. ఏం మగాళ్ళో మీరు?" అంటూ కైపుగా నవ్వుతోంది.

మాయను చూస్తుంటే పిచ్చెక్కిపోతోంది నాకు. అమాంతం మీదబడి, ఆ అందాన్ని నలిపేసి, చిత్తు చేయాలని వెర్రికోరిక.

"అదిగోనండీ ... అదీ వరుస... వాడిలోవాడు అలా మాట్లాడుకుంటాడు గదిలో కూచుని," అమ్మ మాటలు వినగానే తలత్రిప్పి చూసాను.

అమ్మతోపాటుగా డాక్టరు రామారావుగారు వున్నారు.

"నమస్కారం సార్!" అన్నాను నవ్వి.

"ఏమిటోయ్! ఉమాపతీ! గుండులాగుండేవాడివి... ఇలాగయిపోయావేమిటోయ్?" అన్నాడు డాక్టరు రామారావు ఆశ్చర్యం ఒలకబోస్తూ, నా మంచంమీద కూచుని.

నా ఒళ్ళు భగ్గున మండింది.

నాకేమయిందని, ప్రతీ వెధవా యీ ప్రశ్న వేయడం? ఏదో ఒంట్లో కాస్త నీర్సంగా వుంటే, ఎనీమియాతో చచ్చిపోతున్నట్టు ఎందుకీ జాలి అరుపులు?

డాక్టరు దగ్గరకు రమ్మంటే, నేను రానంటూ మొరాయించినందుకు, డాక్టర్నే యింటికి పిలిపించినందుకు అమ్మ మీద కూడా కోపం వచ్చింది నాకు.

అయినా, నా కోపాన్ని నిగ్రహించుకొన్నాను. ఆయన మా ఫామిలీ డాక్టరు. నేనంటే ప్రత్యేకాభిమానం.

"ఏమీలేదు సార్! ఏదో కాస్త నీర్సంగా ఉంది

ఒంట్లో. దానికే మావాళ్ళు ఈడ్చుకొచ్చారు ఇక్కడికి" అన్నాను మొహంమీదకు బలవంతాన తెచ్చిపెట్టుకున్న నవ్వుతో.

"'శాస్త్ర నీర్సం' అంటూ అంత మామ్మూలుగా అంటా వేమిటోయ్. నీ మొహం చూసుకొన్నావా అద్దంలో యెప్పుడయినా?" అన్నాడాయన ఎంతో సీరియస్‌గా, ఆందోళనతో.

"చూసుకున్నానండి... కొంచెం చిక్కినట్టుగా ఉన్నాను. అంతే!" అన్నాను, అప్పటికే నా నిగ్రహాన్ని దాటి వస్తూన్న కోపాన్ని పళ్ళమధ్య బిగబట్టి.

"కొంచెం అంటావేమిటోయ్... బాగా వుంటేను... అనగూడదుగాని, ఇంకో రెండు రోజుల్లో హరీమనేవాడిలా ఉన్నావు," అన్నాడాయన యింకా.

అప్పటికి నా సహనం హద్దులు దాటింది.

"డాక్టర్ మీ గుణం చూపించుకున్నారు మొత్తం మీద. పేషెంట్ ఎవడు దొరుకుతాడా, వాడికేదో భయంకరమైన రోగముందని హడలగొట్టి, నాలుగు డబ్బులు చేసుకుందామా అని చూస్తున్నారు," అన్నాను కోపంగా, పళ్ళు కొరికి, పిడికిళ్లు బిగించి.

"డాక్టర్ గారూ! మీరు యింకేమీ మాట్లాడవద్దు. ఆ విషయం మీకు ముందే చెప్పాను. ఏ క్షణంలో ఏ అఘాయిత్యం చేస్తాడో అని హడిలి ఛస్తున్నాం. దయచేసి ఊరుకోండి" అంటూ డాక్టరుని బ్రతిమాలుకుంటున్నది అమ్మ.

డాక్టరుగారినోరు మూతబడింది దాంతో.

కాసేపు నా నోరు తెరిపించి, కళ్ళు సాగదీసి, స్టెత స్కోపుతో గుండెమీద ఎక్కడెక్కడో వుంచి చూసి "సివియర్ ఎనీమియా. రక్తం ఏమీ లేదు ఒంట్లో. బలవర్ధక ఆహారాలు, రక్తపుష్టినిచ్చే మందులు వాడాలి" అంటూ ఓ ప్రిస్క్రిప్షన్ రాసేసి అమ్మ చేతిలో పెట్టి, మందులు వాడే విధానం గడగడా చెప్పేసి, వెళ్ళిపోయాడు డాక్టరు యింకో మాట మాటాడకుండా.

డాక్టరు రామారావు వెళ్ళిపోయాక, ఓ పెద్ద నిట్టూర్పు విడిచాను, న్యూసెన్స్ వదిలినందుకు.

అయితే, అంతటితో న్యూసెన్స్ వదలలేదు. ఎక్కువ కాసాగింది. బంధువులొచ్చి పలకరించసాగారు.

అందరికన్నా పెద్ద న్యూసెన్స్, మా వీధివాళ్ళు, యిరుగు పొరుగులవాళ్ళు అయిపోయారు.

ఏదో పనిమీద మా యింటికి రావడం, వచ్చినవాళ్లు ఊరుకోక పనిగట్టుకుని నన్ను చూసి "దీపంలా ఉన్న కుర్రాడు ఆరిపోయిన దివిటీలా ఎలా అయిపోయాడో", అంటూ సానుభూతి కబుర్లు చెప్పి వెళ్ళిపోవడం ఓ తంతుగా తయారయింది.

ఇహ, మా వీధి కుర్రకారు సంగతి సరేసరి. నా గది కిటికీ వద్దో, వీధి ద్వారం వద్దో మూగి నన్నో ఓ వింత జంతువులా చూస్తూ నిలబడ్డం ఏవేవో వ్యాఖ్యానాలు చెయ్యడం.

వాళ్ళందరూ మాట్లాడుకునే దొక్కటే: నాకు మద పిచ్చి యెత్తింది. ఎవరో అమ్మాయి నా ప్రక్కన ఉన్నట్టుగా దానితో నేను మాట్లాడుకుంటాను. నవ్వుతాను. ప్రవర్తిస్తాను, అని.

లోకమంతా ఏకమై నా గురించి ఏం కూసినా, ఏమీ అనుకోకపోదునుగాని, నాకు పిచ్చి పట్టిందనీ, అది క్షణ క్షణానికీ ముదిరిపోతోందనీ, మా అమ్మనే నా గురించి అనడం మొదలుపెట్టేసరికి, నా రక్తం మరిగిపోయింది.

# 8

అగ్గిలో ఆజ్యం పోసినట్టు, పుండుమీద కారం చల్లి నట్టు, ఓ రోజున యిద్దరు వ్యక్తులు వచ్చారు నా గదికి. వాళ్ళిద్దరూ, పొడవుగా, బలిష్ఠంగా, ముష్కరుల్లా ఉన్నారు.

ఆ ముష్కరులతో నేను యేదో మాట్లాడేలోపల, వాళ్ళిద్దరూ నన్ను గట్టిగా పట్టుకుని బంధించారు. ఓ రిక్షాలో పడేసి, సైకియాట్రిస్ట్ సుందర్రావు దగ్గరకు తీసుకు వెళ్ళారు. నిజం చెప్పొద్దూ, సుందర్రావు నాకో సైకిక్ కేసులా అవుపించాడు.

"నాకేం పిచ్చిలేదు. నావల్ల ఎవరికీ యే ప్రమాదమూ లేదు. నన్ను బంధించి తీసుకురావాల్సిన అవసరమే మొచ్చింది. అయ్ డిమాండ్ యువర్ ఎక్స్‌ప్లనేషన్" అని నేను సీరియస్‌గా, ఆవేశంగా అంటే పగలబడి నవ్వాడు సుందర్రావు అయిదునిముషాల సేపు.

ఆ తరువాత టక్కున సీరియస్ అయిపోయి "నువ్వంత డేంజరస్ కాపోతే, నీకే పిచ్చంటూ లేకపోతే,నిన్ను పట్టి తెమ్మని, నే నెందు కడిగానంటావ్? మీ పేరెంట్స్ అందుకు ఎందు కంగీకరించా రంటావ్? అయ్ వాంట్ యువర్ పాజిటివ్ రిప్లై" అన్నాడు కళ్ళు పెద్దవిచేసి, పళ్ళు బయటకుపెట్టి, కాట్లాటకు దిగిన పిల్లిలా.

అలా మాట్లాడేవాడితో నేనేం వాదించను? అప్పటికే

బాగా అలసిపోయానేమో, శరీరం విశ్రాంతికోసం తపించి పోతోంది. మౌనం వహించాను.

నన్ను ఓ గదికి తీసుకెళ్ళి, అక్కడున్న ఒకేఒక మంచంమీద పడుకోమన్నాడు.

నా మొహానికి పైన ఒకేఒక బల్బు వెలుగుతోంది. నాలాగే అది ఒంటరిగా, నిస్సహాయంగా వున్నట్టు అనిపించింది, దానివైపు చూస్తుంటే.

దానివైపే చూసి, అంకెలు ఒప్పజెప్పమన్నాడు సుందరావు.

అతడు చెప్పినట్టుగానే చేసాను విధిలేక; తొందరగా అతడి న్యూసెన్స్ తప్పుతుందన్న ఆశతో.

అంకె యిరవై రెండువరకూ చెప్పినట్టు గుర్తు.

ఆ తరువాత స్పృహ లేదు నాకు.

ఎంతసేపు ఆ స్థితిలో వున్నానో నాకు తెలీదు. కాని, సుమారు రెండు మూడు గంట లుండవచ్చునని నా అంచనా.

సుందరావే ఏవేవో ప్రశ్నలు వేసినట్టు, వాటికి ఏదో జవాబు చెప్పినట్టుకూడా గుర్తు.

ఆ తరువాత నన్ను యింటికి తీసుకెళ్ళిపోయారు. ఐతే, యీసారి, నన్ను బంధించి తీసుకెళ్ళలేదు. నేనుకూడా బుద్ధిగానే కూచున్నాను అల్లరి చెయ్యకుండా.

సైకియాట్రిస్ట్ వల్ల ఏం జరగలేదని తెలుస్తూనే వుంది. ఎందుకంటే, నేను సుందరావుగారిని గాని, ఆయన నన్ను గాని చూడ్డం ఆ తరువాత జరగలేదు.

మాయతో నా సంసారం సవ్యంగానే సాగిపోతోంది. కాని నా ఒంట్లో నీరసం పెరుగుతోంది గాని, తరగడం లేదు.

ఇలా వుండగా మాయ రెండు రోజుల్నించీ నాకు దూరంగా వుంటోంది. ఎంత బ్రతిమాలుకున్నా, నాకు చేరువకుకూడా రావడంలేదు.

పైగా అవాళ ఉదయంనించీ ఏకధారగా యేడుస్తూనే వుంది. ఊరుకోమంటూ ఎంత బతిమిలాడినా ఊరుకోలేదు. కారణం అడిగినా చెప్పలేదు. "మీరు అరుస్తారా? తీరుస్తారా?...అడిగి ప్రయోజనం యేమిటి?" అంటూ దెప్పిపోటుమాటలు అంటుందిగాని, ఎంతకీ కారణం చెప్పడంలేదు.

చివరికి నేనేదో వాగ్దానం చేస్తేగాని, తన యేడుపుకు కారణం చెప్పేటట్టులేదని గ్రహించాను.

"దేవుడిమీద ఒట్టు. నువ్వేం అడిగినా, నువ్వేం కావాలన్నా చెల్లిస్తాను. నువ్వెందు కేడుస్తున్నావో కారణం చెప్పు" అన్నాను.

అప్పుడు మెత్తపడింది మాయ.

"ఇవాళ సాయంకాలం మీ అమ్మా, వాళ్ళూ మీ యింటికో మనిషిని తీసుకొస్తున్నారు. వాడు పరమ దుర్మార్గుడు. ప్రేమికుల్ని విడదీసే కిరాతకుడు. వాడ్ని చంపాలి" అంది చల్లగా.

నా గుండె నిలిచిపోయింది.

"చంపడమా?...ఎందుకూ?" అన్నాను.

"కారణాలవీ యిప్పుడు అడక్కు. తర్వాత తీరిగ్గా చెప్తాను. నేను కోరింది చేస్తావా చెయ్యవా?" నిలదీసి అడిగింది మాయ.

ఏమని చెప్పను?...జవాబు యివ్వడానికి తటపటాయించాను.

"సరే! ఇవాళనుంచి మన ప్రేమకు స్వస్తి...వస్తాను" అంటూ లేచింది మాయ. ఆమె లేస్తున్నప్పుడు, ఆమె పైట జారి, గుండ్రని గోపురాల్లాంటి వక్షాలు నన్ను ఊరించాయి.

"మాయా!... వెళ్ళకు..." ఆరాటంతో అరిచాను.

"ఎందుకు యింతా యిక్కడ? ఇన్నాళ్ళబట్టీ నీకు తేరగా సుఖాన్ని యిచ్చానేగాని, ఫలానాది కావాలని ఏదైనా కోరానా? అవసరమొచ్చి అడిగేసరికి, కారణాలు అడుగుతున్నావు" అంది మూతి బిగించుకుని.

నాకు మాయ పొందు కావాలి. అందుకు సందేహం లేదు. ఇహ, హత్య సంగతా? నేనేదో పిచ్చిలో చేసా నను కుంటారు. ఒహవేళ నన్ను జైలులో పెట్టినా, నే నెక్కడి కెళితే, అక్కడకు మాయ రాగా నాకేం లోటు?

"సరే! చేస్తాను" అన్నాను.

"ఒట్టూ!" చెయ్యి చాచి అంది.

"దేవుడి తోడుగా." ఆమె చేతిలో చెయ్యివేసి అన్నాను.

"అదీ అలాగుండాలి...ప్రేమంటే" అంటూ నా కిష్ట మైన పద్ధతిలో నన్ను గాఢంగా చుట్టేసి, గట్టిగా ముద్దు పెట్టుకుంది.

అంతేకాదు! మూడు రోజుల్నించి నన్ను యెడంగా వుంచిన ఆమె, తన అవయవాలతో నన్ను తృప్తిగా ఆడుకోనిచ్చింది.

# 9

మాయ చెప్పినట్టుగానే అవాళ సాయంకాలం ఐదు న్నర గంటలకు సన్నగా, పీలగా, నల్లగా అయిదడుగుల

రెండంగుళాల యెత్తుతో, ఎర్రటి అంగరఖా, తెల్ల లుంగీ, భుజాలవరకూ పెంచిన జుత్తు నూనె రాసి నున్నగా దువ్వుకోబడి, నుదుట ఎర్రటి కుంకుమతో, చెవులకు కుండలాలు వున్న వ్యక్తి వచ్చాడు.

అతడి వయస్సు ఎంత వుంటుందో అంచనా వెయ్యడం కష్టం. ముప్పైనుంచి, నలభైఅయిదువరకు, అతని వయస్సు ఏదైనా కావచ్చు.

తెల్లగా తళతళ మెరుస్తున్న తన పళ్ళని బయట పడేలా నవ్వుతూ, "ఆఁ ఏం బాబూ?...బావున్నావా?" అన్నాడు నా కెదురుగా ఓ కుర్చీ లాక్కుని కూచుని.

క్షణం రెప్ప వాల్చక అతనివైపు చూచి సీరియస్ గా "మీకేం పని లేదా? ఊళ్ళో ఉన్నవాళ్ళ నందర్నీ 'బావున్నారా?' అంటూ పలకరించి రావడమేనా పని?" అన్నాను.

అతడు కించపడలేదు. ఇంకా మొహంమీద మాయని నవ్వుతోనే, "ఆఁ అదే బాబూ!...నా వృత్తి, బ్రతుకు, ధ్యేయం, ఆశయం సమస్తమూను" అన్నాడు.

"ఏడ్వలేకపోయారు. ఆ పని యింకో యింటిలో చెయ్యండి. ఇక్కడ మాత్రంకాదు. అర్జంటుగా వెళ్ళిపొండి యిక్కడ్నించి" అన్నాను మొహం మాడ్చుకుని, యింకో వైపుకు త్రిప్పి.

క్షణంసేపు అతనిలో కలవరం కలిగించాననే చెప్పగలను, ఎందుకంటే, వెంటనే అతడు ఏ మాటా చెప్పలేక పోయాడు.

"ఏం బాబూ! నీకు నూరేళ్ళు హాయిగా, ఆరోగ్యంగా బ్రతకాలని లేదా?" అన్నాడు మెల్లగా, రెండు క్షణాలు పోయాక.

"నేను నూరేళ్ళు బ్రతకాలా, రెండు రోజులే బ్రతకాలా అన్న సంగతి నీకెందుకు? ముందిక్కడ్నించీ పోతావా లేదా?" మంచంమీంచి చివాలున దూకి, అతడి మొహంలో మొహంపెట్టి గట్టిగా అరిచాను.

అతడు చలించలేదు.

"నేనిక్కడ్నించి పోవడానికి రాలేదు. నీ అంతు చూద్దామని వచ్చాను" అన్నాడు తాపీగా.

నే నీ క్షణం కోసమే ఆగాను, అతడిమీదకు దుముకకుండా.

"నా అంతు చూస్తావుట్రా బక్కనాకొడకా?" అంటూ పళ్లు బిగించి, చేతులు బిగబట్టి, బోనులో బంధింపబడిన భల్లూకంలా అటు యిటూ తిరిగి, చివరకు నేను ఓ మూల ముందే దాచుకొన్న కుర్చీ కర్ర అందుకొన్నాను. ఆవేశంగా అతడివైపు కదిలాను, అతడి తలమీద ఆ కర్రతో బాది చంపడానికి.

"ఆగక్కడ," సింహనాదంలా వినిపించింది అతడి గొంతు.

సడెన్ బ్రేకు వేసిన బండిలా ఆగిపోయాను, అప్రయత్నంగానే.

అతడు చప్పున లేచి, కుర్చీ కర్రను పట్టుకొన్న నా చేతిని మెలిపెట్టి, కుర్చీ కర్రను లాగేసుకుని నాకు అందని దూరానికి విసిరేసాడు.

అతడు చూడ్డానికి పిట్టమనిషిలా ఉన్నా, అతడిలో ఏనుగు బలం ఉందని అప్పుడు గ్రహించాను.

నా ప్రయత్నం విఫలమైంది! మాయ నన్ను క్షమించదు! నిరాశ నిండిన హృదయంతో, మంచంమీద వాలిపోయాను నిస్సహాయంగా.

"చూడు బాబూ! ఈ పైడితల్లి భూత, ప్రేత, పిశాచాలకే భయపడడు. ఇహ మనుషులకు భయపడతాడా? నేను రెండు రోజులు పోయాక వస్తాను. నువ్వెం ప్రమాదంలో ఉన్నావో నీకు తెలీడంలేదు. అవాళ తెలుస్తుంది. వస్తాను" అంటూ వెళ్ళిపోయాడు పైడి తల్లి.

పైడి తల్లి యిలా వెళ్ళిపోయాడో లేదో, మాయ వచ్చి, కూచుంది నా కాళ్ళదగ్గర.

"నేను చెప్పిందేమిటి? నువ్వు చేసిందేమిటి? వాడిలా గదిలో అడుగుపెట్టగానే ఆ కర్రతో ఒక్కటేసివుంటే, యీ పాటికి వాడు చచ్చి వుండేవాడు. అంతా పాడు చేసావు," రోషంగా అంది మాయ.

మాయ మొహంలోకి చూడలేకపోతున్నాను. అయినా, ఏదో నచ్చచెప్పకపోతే యెలా?

"నువ్వే చూసావుగా...ఎంతటి బలవంతుడో...మనిషి చూడానికి పిట్టలాగున్నాడు కాని, నిజంగా పులి" అన్నాను మెల్లగా.

"ఒక్క కేక వేసేసరికి, ఆగిపోయావు చంటిపిల్లాడి లాగ" అంది ఈసడింపుగా.

నిజమే! ఆగిపోయాను. ఆ క్షణంలో ఏమైందో నాకు తెలీదు. పైడితల్లి మెస్మరైజ్ చేసుండాలి. అయితే, అదంతా చెబితే, మాయ యింకేమంటుందో?

మౌనం వహించడమే ఉత్తమోత్తమం అనుకుని ఊరుకొన్నాను.

"మనం దూరమయ్యే రోజులొచ్చాయి. వాడు మనల్ని విడదీసేంతవరకూ వదలడు. రా! ఈ రెండు రోజులయినా హాయిగా వుందాం" అంది మాయ.

నేను శరీరం కదిల్చే స్థితిలో లేను. అయినా, మాయే చొరవ తీసుకుంది. నన్ను తన బలిష్ఠమయిన వక్షొలకు అదుముకుంటూ నన్ను రెచ్చగొట్టి ఉద్రిక్తుడ్ని చేసి, ఓ ప్రక్క బాధగా ఉన్నా, సుఖాన్ని అందించడం మొదలు పెట్టింది.

ఆ రెండు రోజులూ మాయ నన్ను వదిలిపెట్టలేదు. నన్ను ఆమె రెచ్చగొడుతూనే ఉంది. నేను ఆమెను కలుస్తూనే ఉన్నాను.

# 10

ఆ రోజు శుక్రవారం.

ఉదయం మొహం కడుక్కోవడానికి మంచంమీంచి లేచి రెండడుగులువేసి మొహం తిరిగి పడిపోయాను.

నాకు తెలివి వచ్చేసరికి, అమ్మ ఒడిలో తలపెట్టుకుని ఉన్నాను. అమ్మ ఒకటే ఏడుస్తోంది.

అమ్మను ఆసరాగా చేసుకుని నా కాలకృత్యాలు తీర్చు కొన్నాను.

ఆ తరువాత నా గదిలో కాకుండా, వీధిలో వాలుకుర్చీ వేసి నన్ను కూచోబెట్టింది అమ్మ.

చల్లని ఉదయపు గాలి మొహాన్ని కొడుతుంటే, అలాగే వాలుకుర్చీలో నిద్రపోయాను.

సుమారు పదిగంటలవుతుందేమో, అమ్మ నన్ను లేపి, లోపలి గదిలోకి తీసుకెళ్ళింది.

గది మధ్యగా వేసిన ముగ్గులు, ముగ్గులమధ్య విస్తరాకులో ఉంచిన ఎర్రని మాంసం పోగు, దానికి ఎదురుగా చెక్కబొమ్మ, దానికి అటూ యిటూ మట్టి ప్రమిదల్లో దీపాలు, ఓ మూలగా పరిమళం వెదజల్లుతున్న అగరొత్తులు,

వాటికి యెదురుగా కాస్త దూరంగా మటం వేసు కూర్చున్న పైడితల్లినీ చూడగానే, ఆ రోజున జరగ బోయే తంతుగురించి గుర్తొచ్చింది.

"రా బాబూ! ఆలా కూచో" అన్నాడు పైడితల్లి చెక్క బొమ్మను, మాంసంపోగుకు ఎదురుగా ఉన్న జాగా చూపి.

అతడు చెప్పినట్టుగా చేస్తే, మాయ నాకు దూరమై తీరుతుందని మనస్సు నాకు వార్నింగు యిస్తోంది. అయినా, అతడ్ని ప్రతిఘటించే శరీర బలంగాని, మనోబలంగాని నాకు లేవు.

యాంత్రికంగా అతడు చెప్పిన చోటులో పోయి కూచున్నాను.

ముందే పైడితల్లి చెప్పినట్టున్నాడు. అమ్మ బయటికి వెళ్ళిపోయి, తలుపులు వేసింది దగ్గరగా.

గదిలో నేనూ, పైడితల్లీ యిద్దరమే మిగిలాం.

పైడితల్లి కళ్ళు మూసుకుని ఏవో మంత్రాలు పఠించ సాగాడు. ముడిపడ్డ అతడి భృకుటివైపు, నిశ్శబ్దంగా గబగబా కదులుతున్న అతని పెదాలవైపు చూడసాగాను ఆసక్తిగా, చేసేదేమీ లేక.

అరగంట గడిచింది. కళ్ళు తెరిచాడు పైడితల్లి.

"బాబూ! మాయ ఎంత అందంగా వుంటుందో చూస్తావా?" అన్నాడు మెల్లిగా.

నాకు నవ్వొచ్చింది. చూడ్డమేమిటి, చిత్తమొచ్చి నట్టుగా చిత్తుగా అనుభవించాను.

అయినా, పైటికి మాత్రం "చూస్తాను. చూపండి" అన్నాను.

"మాయా! ఇలారా కూచో" అన్నాడు తన చేత్తో ఓ జాగా చూపి.

రెండు క్షణాల్లో మాయ అక్కడ దర్శన మిచ్చింది. పిటపిటలాడుతున్న అవయవాలు, ఎత్తైన బరువైన పెద్ద వక్షాలు, గుండ్రని మొహం, పెద్ద కళ్ళు, క్షణాల్లో పెదాలమీద ప్రత్యక్షమయ్యే నవ్వు.

ఆ అందం నా సొంతమనీ, దాన్ని తనివిదీరా అనుభ వించేననీ అనుకునేసరికి నా గుండె గర్వంతో పొంగింది.

రెండు క్షణాలు భావగర్భితంగా మౌనం వహించాక అన్నాడు పైడితల్లి మెల్లగా.

"నువ్విప్పుడు చూస్తున్న అందం నిజంకాదు. దాని అసలు రూపం వేరే ఉంది," అని మాయవైపు తిరిగి "ఊఁ. నీ అసలురూపు చూపెట్టు," అంటూ గర్జించాడు పైడితల్లి.

మాయ కదల్లేదు.

"నీకు... మంచి మాటలతో లాభంలేదు," అంటూ పళ్ళు కొరికి, వేపమండలు చేతిలోకి దీసుకుని, రెండుసార్లు గట్టిగా నేలమీద బాదాడు.

"బాబోయ్! ఆపు! నువ్వు చెప్పినట్టే చేస్తాను" అంటూ కంగారుగా లేచి నిలబడింది మాయ.

ఒళ్ళు విరుచుకుంటున్నట్టుగా చేతులు పైకి చాపి, గాల్లోకి లేచి గుండ్రంగా తిరిగింది ఓసారి.

రెండోసారి, మాయ నావైపు తిరగ్గానే, ఆమె పూర్తిగా మారిపోయింది.

పీచులాంటి జుత్తు, పుసులు కట్టి, కారుతున్న కళ్ళు, వదులుగా వేలాడి చొంగలు కారుతున్న పెదాలు, నల్లని

పొడుగాటి సంచుల్లాంటి స్తనాలు—అసహ్యంగా జుగుప్సా కరంగా, భీకరంగా వుంది ఆ రూపం.

ఆ రూపాన్ని ఇంతకు ముందోసారి చూసాను. అవధాని గదిలో, మాయతో శాశ్వత సంపర్కంకోసం, ముగ్గుల మధ్య కూచున్నప్పుడు. నా మనోఫలకంమీద ఆఖర్న నిలిచింది యీ రూపే!

"అబ్బ!... చూడలేను" కళ్లు మూసుకొన్నాను వీహ్యాతతో ఒళ్ళు కంపించగా.

"కళ్ళు మూసుకుంటావేం బాబూ!... దానితోనేగా యిన్నాళ్ళూ కాపురం చేసావు" అన్నాడు పైడితల్లి నవ్వి, దెప్పిపొడుస్తున్నట్టుగా.

అప్పటికి మాయమీది నా వ్యామోహం పూర్తిగా చచ్చిపోయింది. ఇహ, ఆమె మునుపటి రూపంలో మళ్ళా వచ్చినా, తాకే స్థితిలో లేను.

"బాబూ! ఈ సమయంలో నీకో విషయం చెప్పాలి." అన్నాడు తాపీగా పైడితల్లి.

"ఏమిటది?" అన్నాను, గాలిలో నిలుచున్న మాయ వికృతరూపంవైపు క్షణం చూసి, యిహ చూడకూడదనుకుని నిశ్చయించుకుని.

"ఈమె ఓ కామినీ పిశాచి. దీన్ని నీమీద ప్రయోగించాడు అవధాని."

"అవధానా?... నా మీదా?... ఎందుకూ?" అన్నాను ఆశ్చర్యంగా.

"కామినీపిశాచాలు మనుషుల్ని పట్టి వాళ్ళ రక్తవీర్యాలు పీల్చి చంపుతాయి. ఈ విషయం నీకు తెలిసే వుంటుంది. నీ విషయంలో అవధాని కామినీపిశాచిని నీకు అంటగట్టాడు, నిన్ను హతమార్చే ఉద్దేశంతో."

"నాకు నమ్మ శక్యంగాకుండా వుంది. అవధానికి నన్ను చంపాల్సిన అవసర మేమొచ్చింది?" అన్నాను అనుమానంగా.

"ఈ రెండు రోజుల్లో నీ గురించి కొంచెం ఆరాలు తీసాను. నీకు అందమైన అమ్మాయిలంటే విపరీతమైన పిచ్చనీ, యీ ప్రయోగం జరగక ముందు నువ్వు రంజని అనే అమ్మాయిని ప్రేమించేవాడివనీ తెలియవచ్చింది.

అంతేకాదు. ఇంకొంచెం ముందుకుపోయి విచారణ సాగించాను. మావాడ్నొకడ్ని అవధాని దగ్గరకు పంపాను. మా యెరికలో వున్న కుర్రాడొకడికి మనసు విరిచెయ్యాలనీ, వాడ్ని ఏదో ప్రయోగంద్వారా చంపెయ్యాలనీ, అందుకు అవధాని ఏమాత్రం తీసుకుంటాడో కనుక్కోరమ్మని మా వాడ్ని అడగమన్నాను.

అవధానికి తెలివితేటలు అపారంగా వున్నాయి. కాని, నా విషయంలో పని చెయ్యలేదు. చేస్తాను, ఓ అయిదువేలు యిటు పారేయ్! అన్నాడు అవధాని.

"ఇస్తాను. గేరంటీ యేమిటి?" అన్నాడు మావాడు. ఫలానా వీధిలో ఫలానా కుర్రాడికి ప్రయోగం చేసాను. అంటూ అవధాని నీ పేరు చెప్పాడు. 'ఎల్లుండికి టపా కట్టేస్తాడు. కావలిస్తే అది జరిగాకే డబ్బియ్యి" అంటూ భరోసాకూడా చెప్పాడు.

మావాడు అమాయకత్వం నటిస్తూ, మరికొన్ని ప్రశ్నలు వేసేసరికి, నీ స్నేహితుడు శేఖరమే, యీ ప్రయోగం చెయ్యమన్నట్టుగా కూడా చెప్పాడు అవధాని" అంటూ వివరించాడు పైడితల్లి.

నేను అవాక్కయిపోయాను.

అప్పటివరకూ జరిగిన సంఘటనలన్నీ నా కళ్ళముందు కదులాడాయి వరుసగా.

నామీద కామినీప్రయోగం జరిగిందనే భావన నాలో యెప్పటికీ కలగకుండా, నా అంతట నేనే, దాన్ని కోరి ఆహ్వానించినట్టుగా, పటిష్టంగా అవధాని వేసిన పథకంలో నే నెలా యిరుక్కుపోయానో, అప్పటికి అర్థమయింది.

"మరి నా సంగతి మీ కెలా తెల్సింది?" అన్నాను ఆలోచనల్లోంచి తేరుకుని.

"అదేమిటి బాబూ! అలాగంటావ్? రోజురోజుకీ నువ్వు చిక్కిపోతుంటే, జీవకళ తొణికిసలాడాల్సిన నీ కళ్ళల్లో ప్రేత కళ కనబడుతుంటే, మీ తల్లి కెలా వుంటుంది చెప్పు? నిన్ను బాగుచెయ్యాలనే ఆమె చేసిన ప్రయత్నంలోనే నన్ను కలుసుకోవడం జరిగింది. తన బాధంతా చెప్పుకుని యేడ్చారు. ఇంతకూ, యీ కామ పిశాచిని యేం చేద్దామంటావ్?" అన్నాడు పైడితల్లి, యింకా గాల్లో వేళ్ళాడుతున్న మాయను చూపి.

"నువ్వేం చెయ్యదల్చుకొన్నావో...అదే చెయ్యి. నాకు యిలాంటి విషయాలు అంతగా తెలీవు. కాని, ఒక్క మాట. మళ్ళా నాకు యిరుపంచల రాకుండా చూడు. అది చాలు" అన్నాను; పైడితల్లి మీద పెరుగుతున్న కృతజ్ఞతాభావంతో.

"సరే!" అంటూ పిశాచివైపు తిరిగి, "యీ మాంసాన్ని భోంచేసి మరి అవుపించకుండా వెళ్ళిపో. మళ్ళా యిటు వచ్చావా. ఈసారి నిన్ను నాలుగు నిలువుల గోతిలో నెత్తి మీద మేకు దిగ్గొట్టి పాతాల్సి వస్తుంది," అన్నాడు పైడితల్లి.

తనని అంతటితో వదిలివేస్తున్నందుకు, పిశాచి కృతజ్ఞతాపూర్వకంగా వంగి నమస్కారం చేసింది. ఆ తరువాత, విస్తరాకులోని మాంసం పోగుని క్షణంలో తినేసి అదృశ్యమైంది.

పైడితల్లి ముగ్గుల మధ్యనున్న చెక్కబొమ్మను తీసుకెళ్ళి దొడ్లో పాతిపెట్టి వచ్చాడు.

"బాబూ! మీకు చెప్పాల్సినవాడ్ని కాను. పరుల స్త్రీలకు, పరుల డబ్బుకు ఆశపడ్డం, అంత మంచిదికాదు బాబూ! చూసారా ... ఇంకొక్క రోజు ఆలస్యమైతే, మీరు మాకు దక్కేవారు కారు" అన్నాడు పైడితల్లి బయలుదేరడానికి ఉపక్రమిస్తూ.

నేను అతడిని కృతజ్ఞతాపూర్వకంగా చూస్తూ ఉండిపోయాను.

—: ఐ పో యిం ది :—

# చావు జోస్యం

## వసుంధర

అప్పుడే ఆఫీసు వదిలారు. మురళికి చాలా నీరసంగా వుంది. అతను రోడ్డుమీద పడి దగ్గర్లోవున్న హోటల్ వైపు నడువసాగాడు.

ఆఫీసు వదలగానే హోటలుకు వెళ్ళడం మురళికి మామూలు కాదు. సాధారణంగా అతను బస్సు స్టాపుకే వెడతాడు.

కానీ ఈ రోజు అతనింటికి వెళ్ళే దాకా ఆగలేదు. ప్రొద్దుట్నుంచీ భోజనం చేయలేదు. చాలా ఆకలిగా ఉంది. ఉదయం అతని ఆఫీసు వేళకు ఇంట్లో భోజనం తయారు కాకపోలేదు. అయితే అతను తల్లితో ఘర్షణ పడ్డాడు. అతని పెళ్ళి గురించిన చర్చ వచ్చినప్పుడల్లా ఇంట్లో ఘర్షణ

జరగడం మామూలే!

చెల్లెలి పెళ్ళి అయ్యేవరకూ తన పెళ్ళి విషయం తల పెట్టవద్దంటాడు మురళి. కానీ చాలామంది అడ్వాన్సుగా కట్నాలివ్వడానికి సిద్ధంగా ఉన్నారు. ఏదో ఒకటి తేల్చేస్తే ఆ డబ్బు తీసుకుని_ కూతురి పెళ్ళి జరిపించేయ వచ్చుకదా అంటుంది మురళి తల్లి జానకమ్మ.

కానీ మురళి తన పెళ్ళిని వాయిదా వేయమనడానికి కారణం చెల్లెలి పెళ్ళి కాదన్న సంగతి మురళికీ తెలుసు, జానకమ్మకూ తెలుసు, మురళి చెల్లెలు అమ్మలుకీ తెలుసు.

మురళి ఒక అమ్మాయిని ప్రేమించాడు. ఆ అమ్మాయి పేరు లలిత. లలిత మురళికి స్వయానా మరదలు. వీళ్ళిద్దరూ ఒకరినొకరు ప్రేమించుకోవడానికీ బంధుత్వం దోహదం చేసింది.

మురళి లలితను ప్రేమిస్తున్నాడు. లలిత మురళిని గాఢంగా ప్రేమిస్తోంది. లలిత తల్లి రాజేశ్వరమ్మ ఈ పెళ్ళి జరగాలని కోరుకుంటోంది. లలిత కోడలు కావడం తన అదృష్టమని జానకమ్మ భావిస్తోంది. అమ్మలు, లలిత ప్రాణ మిత్రులు. ఇంతమంది ఇష్టాలని వ్యతిరేకిస్తున్న ఒకేఒక వ్యక్తి పట్టాభిరామయ్య. ఆయన లలిత తండ్రి, రాజేశ్వ రమ్మ భర్త. వీళ్ళిద్దరి ఇష్టాలనూ కాదనడానికి ఆయనకు వీటో పవరుంది. ఆ పవరు నాయన తరచుగా ఉపయో గించుకుంటూ వుంటాడుకూడా.

పట్టాభిరామయ్య మురళిని ద్వేషించడు. చుట్టపు చూపుగా ఆయన అప్పుడప్పు డతని ఇంటికికూడా వస్తూం టాడు. కానీ మురళి చుట్టూవున్న వాతావరణం తన కను కూలమైనది కాదని ఆయనకు తెలుసు. మురళి దరిద్రంలో

జీవిస్తున్నాడన్నది ఆయన నమ్మకం.

నిజానికి మురళి దరిద్రుడు కాదు. అతనికి మేడలేక పోయినా ఉంటున్న పెంకుటిల్లు స్వంతమే! నెలకు చేతికి ఆరొందల రూపాయలొచ్చే ఉద్యోగముంది. కొద్దిగా చిల్లర అప్పులు, అతని తండ్రి చేసినవి ఉన్నప్పటికీ, అవి తీర్చడం అతనికి కష్టమైన పనేమీకాదు. ఇప్పటికే సగానికి పైగా తీర్చేశాడు. చెల్లెలి పెళ్ళి ఒక్కటే అతని కున్న బాధ్యత! అదికూడా మరీ అంత కష్టతరమైనదేమీ కాదు. అమ్మాయి అందంగానే ఉంటుంది మరి! ఇవన్నీకాక మురళి ఇంట్లో స్వచ్ఛమైన ప్రేమ దొరుకుతుంది. అతనింట్లో అందరూ ప్రేమమూర్తులే!

మురళికొచ్చే ఇల్లాలు తప్పక సుఖపడుతుందని ఎందరో ఆడపిల్లల కన్న తండ్రులకు అచంచల విశ్వాస ముంది. ఆ కారణంగానే అతనికోసం ఎన్నో సంబంధాలు వెతుక్కుంటూ వస్తున్నాయి. మరి మురళి దరిద్రు డెలా గాతాడు?

ఇక్కడే సాపేక్ష సిద్ధాంతం వెలికివస్తుంది. సామా న్యులకు మురళి దరిద్రుడు కాకపోవచ్చు. కానీ, పట్టాభి రామయ్య దృష్టికతను దరిద్రుడే! ఎందుకంటే పట్టాభి రామయ్య ఆస్తి కనీసం పదిలక్షల విలువ చేస్తుంది.

పైగా ఆయనకు ఒక్కతే కూతురు. తన కూతురి కాయన తన స్థాయి అత్తవారిల్లుకోసం చూస్తున్నాడు. మురళిలాంటివాళ్ళ నాయన పూర్తిగా కొట్టేయలేదు. రెండుమూడేళ్ళ క్రితం ఒక పర్యాయం ఆయన జానకమ్మను కదిపి చూశాడు__మురళిని ఇల్లరికపుటల్లుడిగా చేసుకుందా మనుకుంటున్నానని.

ఇల్లరికానికి మురళి అంగీకరించలేదు. మురళి యింటికి లలితను పంపడం పట్టాభిరామయ్యకిష్టంలేదు. మురళి ఆత్మాభిమానం—అతనికి లలితమీద గల ప్రేమనుకూడా జయించింది. అదికూడా పట్టాభిరామయ్య దృష్టిలో మురళి దరిద్రుడు కావడానికి ఒక కారణం. ఆత్మాభిమానం దరిద్రులకే వుంటుందని ఆయన అభిప్రాయం.

మురళికి లలితమీదనే కానీ, ఆమె ఆస్తిమీద మోజు లేదు. లలిత మనసులో మురళి తప్పలేదు. ఇల్లరికాని కొప్పుకుంటే మురళి మంచి అల్లుడేనని పట్టాభిరామయ్య అభిప్రాయం. ఈ మూడింటి కారణంగా అటు లలిత పెళ్ళీ, ఇటు మురళి పెళ్ళీకూడా అలా వాయిదా పడుతూనే వస్తున్నాయి.

మురళి ఆలోచిస్తూ, దగ్గరలో వున్న హోటల్ వైపు నడుస్తున్నాడు. ఆ సమయంలో అతన్నెవరో "హలో" అని పిలిచారు.

మురళి తన్నుకాదేమో ననుకుంటూనే, పిలుపు వచ్చిన వైపు చూశాడు.

అతనికి పాతికేళ్ళు పైనే వుండవచ్చు. లాంగ్ హెయిర్. నల్లపాంటుమీద లేత నీలంచొక్కా ఇన్ షర్టు చేశాడు. కాళ్ళకి బూట్లున్నాయి. అతను లాంతరు స్థంభందగ్గర నిలబడి వున్నాడు. తననే పిలుస్తున్నాడు.

ఆ మనిషి వేషభాషల్ని బట్టి, అతని పిలుపును గౌరవించి, దగ్గరకు వెళ్ళాడు మురళి.

"నన్నేనా పిలిచింది?" అనడిగాడు మురళి.

"అవును. మిమ్మల్నే. మీ పేరు మురళి కదూ?" అడిగాడతను.

"మీ రెవరో నాకు తెలియదు. నా పేరు మీ కెలా తెలుసు?" అన్నాడు మురళి.

"నేనొక జ్యోతిష్కుణ్ణి" అన్నాడతను నవ్వుతూ "మనుషుల పేర్లే కాదు. జరగబోయేవి నాకు చాలా తెలుస్తాయి. ముఖ్యంగా ఎవరెప్పుడు చచ్చిపోయేదీ చాలా ఖచ్చితంగా చెప్పగలను."

"అంటే, నా కర్థం కాలేదు."

"అటు చూడండి" అన్నాడతను. చూశాను. ఏమీ కనిపించలేదు. అదే చెప్పాను.

"ఏమి లేకపోవడ మేమిటి? అది బట్టల దుకాణం కదూ" అన్నాడతను.

"అయితే?"

"ఆ దుకాణంలో కూర్చున్న ప్రొప్రయిటర్ కనపడుతున్నారా?"

"కనపడుతున్నారు. ఆయన మా పెదనాన్నగారు" అన్నాడు మురళి.

"అవునా? ఆయన ఎప్పుడు చనిపోతారో నాకు తెలుసు" అన్నాడతను.

మురళికి చిరాకు వేసింది. "తెలిస్తే తెలిసింది లెండి. కానీ, నాకు తెలుసుకోవాలని లేదు. మీ రెవరో నాకు తెలియదు. ఇవన్నీ ఎందుకు చెబుతున్నారో కూడా నాకు తెలియదు" అని అక్కణ్ణించి వెళ్ళబోయాడు.

"వెళ్ళిపోకండి మిస్టర్ మురళీ! ఈ సమాచారం మీకు చాలా అవసరం. ఆయన రేపు సాయంత్రం నాలుగున్నర ప్రాంతంలో మరణిస్తారు. నా జోస్యం తప్పదు. ఆయన చనిపోయేరని తెలిసేక, ఈ విషయం మీకొక జ్యోతి

ష్యుడు ముందుగానే చెప్పాడనిమాత్రం గుర్తుంచుకోవాలి''
అన్నాడతను.

''మీ పేరు?'' అన్నాడు మురళి.

''ప్రస్తుతానికి జ్యోతిష్కుడని గుర్తుంచుకోండి చాలు. మళ్ళీ నేనే మిమ్మల్ని కలుస్తాను'' అతను కదిలాడు.

ఆకలితో వున్న మురళి ఆ విషయాన్ని ప్రస్తుతానికి వదిలిపెట్టి, హోటల్ వైపుకి గబగబా అడుగులు వేశాడు.

రెండిడ్లీలు, ఒక దోశ, కప్పు కాఫీ తాగేక మురళి కాస్త మామూలు మనిషి కాగలిగాడు. అతనిలో మళ్ళీ ప్రశాంతంగా ఆలోచించగల ఓపిక వచ్చింది.

ఇప్పుడతని బుర్రలో ఇందాకటి విచిత్ర జ్యోతిష్కుడు మెదుల్తున్నాడు.

ఎవరతను? తను అతనికి ఏ విధంగా తెలుసును? అతను తనని పిలిచి పెదనాన్నగారి చావు గురించి చెప్పడంలో ఉద్దేశ్యమేమిటి?

పెదనాన్న సుదర్శనంగారంటే మురళికి చాలా గౌరవముంది. ఆయనకు అతనంటే ఎంతో అభిమానముంది.

ఆయన మురళి తండ్రికి స్వయానా అన్నగారు. పెళ్ళవగానే వ్యాపారంలోకి దిగేరు. అదృష్టవశాత్తూ అందులో బాగా కలిసొచ్చింది. ఊళ్ళోని ధనికులలో ఇప్పుడు ఆయనొకరు. ఎటొచ్చీ మురళి కుటుంబానికీ, వాళ్ళకీ రాకపోకలు తక్కువ.

మురళి దొడ్డమ్మ అనుమానపు మనిషి. భర్త మంచితనాన్నలుసుగా తీసుకుని బంధువు లాయన్నేదో చేస్తారని ఆవిడ భయం. అందువల్ల ఆవిడ ఆత్మాభిమానమున్నవాడెవడూ తమ గడప తొక్కలేని విధంగా మాట్లాడుతుంది. మురళికి ఆత్మాభిమానానికేం తక్కువలేదు!

అయినా అప్పుడప్పుడు మురళిని ఆయన కలుసుకుని క్షేమసమాచారాలు విచారిస్తూనే వుంటాడు. భార్యకు తెలియకుండా మురళికి ఆయన మూడువేలదాకా అప్పిచ్చాడు. మురళి దాన్ని అప్పుగానే తీసుకుని, ఇప్పటికి ఓ వెయ్యిరూపాయలు తీర్చేశాడుకూడా. అందు కాయన కాస్త బాధపడ్డా మురళి సంగతి తెలిసుండి ఊరుకున్నాడు.

ఆయన రేపు చనిపోతాడా? ఎందుకు? ఎలా?

అప్రయత్నంగా మురళి ఒక పర్యాయం బట్టలషాపుకు వెళ్ళి పెదనాన్నగారిని పలకరించాడు. ఆయన మనిషి పిడిరాయిలా గున్నాడు. కబుర్లుకూడా చలాకీగా చెబుతున్నాడు.

'ఈయన రేపు మరణించడమేమిటి? అర్థంలేని మాట!' అనుకున్నాడు మురళి.

## 2

సుదర్శనం నెమ్మదిగా నడుస్తున్నాడు. ఉండుండి అటూ ఇటూ చూస్తున్నాడు. అలా నెమ్మదిగా ఒక ఇరుకు సందులోకి దూరాడు. ఆ సందులో కొంతదూరం నడిచి ఒక పెంకుటింటిముందాగాడు. నెమ్మదిగా ముందుకువెళ్ళి తలుపు తట్టాడు.

తలుపులు తెరుచుకున్నాయి. సుమారు ఇరవయ్యేళ్ళ అమ్మాయి తలుపు తీసింది—"వచ్చేరా?" అందాయన్ను చూసి. ఆమె పేరు విమల—

సుదర్శనం నవ్వి, లోపలకు వెళ్ళి తలుపులు వేసేశాడు. ఒక గంట తర్వాత సుదర్శనం బయటకు వచ్చాడు.

విమల ఇంట్లోంచి రోడ్డుమీదకు వచ్చాక సుదర్శనం

అడుగుల వేగం హెచ్చించాడు.

ఒక పర్యాయం టైము చూచుకున్నాడు. టైము నాలుగుంపావయింది. ఆ సమయంలో రోడ్డు కవతల వైపున్న ఒకతను సుదర్శనాన్ని పిలిచాడు.

"ఎవరిని—నన్నా?" అన్నాడు సుదర్శనం ఆశ్చర్యాన్ని వ్యక్తపరుస్తూ. అవతలి వ్యక్తిని ఆయనెక్కడా చూసినట్లులేదు.

"మిమ్మల్నే—అర్జంటుగా ఒక మాట చెప్పాలి—" అన్నాడతను.

సుదర్శనం రోడ్డు దాటసాగాడు. స్పీడుగా వస్తున్న టాక్సీ హారన్ సుదర్శనం చెవిలో వినపడింది. ఆయన ఒకడుగు ముందుకూ—ఒకడుగు వెనక్కూ వేశాడు.

టాక్సీ సుదర్శనాన్ని గుద్దుకుని మీదనుంచి వెళ్ళిపోయింది. జరిగిన ప్రమాదాన్ని టాక్సీ డ్రైవర్ గుర్తించినట్లున్నాడు. ఆగకుండా టాక్సీని పోనిచ్చాడు. ఇంతలో ఎవరో చూశారు—"అయ్యో—యాక్సిడెంట్—" అని అరిచారు. జనం పోగయ్యారు.

# 3

జరిగినదంతా విని ఆశ్చర్యపోయాడు మురళీ. సరిగ్గా జ్యోతిష్కుడు చెప్పిన ప్రకారమే మర్నాడు పెదనాన్నగారు పోయారు. అయితే అది మామూలు మరణం కాదు. హత్య!

అంటే ఆ జ్యోతిష్కుడెవరు? అతనికీ హత్య జరుగుతుందని ఎలా తెలుసు?—హత్యకీ అతనికీ ఏమన్నా సంబంధముందా?—ఒక వేళ ఉందనుకుందామంటే అతనీ విషయం ఒకరోజు ముందుగా తనకెందుకు చెప్పాడు?

ఒక్క ప్రశ్నకు సరైన జవాబు అందడం లేదు.

మురళి కుటుంబం ప్రస్తుతం సుదర్శనం ఇంట్లోనే ఉంటున్నారు. హత్య జరిగిన కారణంగా పోస్టుమార్టం జరిగాక కానీ శవం బంధువుల చేతికందజేయబడలేదు. మనిషి పోయి అందరూ పుట్టెడు దుఃఖంలో ఉంటే పోలీసుల ప్రశ్నలొకటి!

పోలీసుల పరిశోధన కొన్ని కొత్త సమాచారాలనందించింది. సుదర్శనంగారికి విమల అనే ఇరవయ్యేళ్ళ అమ్మాయితో అక్రమ సంబంధం ఉంది. ఆయన తరచుగా వెళ్ళి ఆమెను కలుసుకుంటూంటాడు.

హత్య జరిగిననాడు ఆయన విమల ఇంటి దగ్గర్నుంచే వస్తున్నాడు. విమల చెప్పిన సమాధానాన్ని బట్టి తన మరణం గురించి సుదర్శనానికి చూచాయగా కూడా తెలియదు. ఆయన చాలా ఉల్లాసంగా ఉన్నట్లు, అది ఆయనకు మామూలేననీ ఆమె చెప్పింది.

ఇంక యాక్సిడెంటు గురించి పోలీసుల పరిశోధన ప్రకారం—అది ముందుగా ప్లాను వేసుకుని చేసిన పని కాదు. కేవలం సుదర్శనం దురదృష్టమూ, అవతలి టాక్సీ డ్రయివరు అజాగ్రత్తా కలసి—ఒక మనిషి ప్రాణాలు పోవడానికి దారితీశాయి.

సుదర్శనం మరణానికి కారణభూతమైన టాక్సీ దొరికింది. కానీ ఆ సమయానికి డ్రయివింగ్ సీటులో ఉన్న వ్యక్తి దొరకలేదు. నిజానికి ఆ టాక్సీకి డ్రైవరు వీర్రాజు. అతను ఒక్క క్షణం టాక్సీని ఆపి సోడా తాగాలనుకున్నాడు. అతను సోడా తాగుతూండగా టాక్సీ తుర్రుమంది.

వీర్రాజు టాక్సీని ఎవరు ఎందుకు దొంగిలించారన్నది పోలీసులకు అర్థంకాలేదు. కానీ ఒక మనిషిని హత్య చేయడంకోసం మాత్రం అయుండదని పోలీసులనుకుంటున్నారు. కారణం ఏమీ లేదు. హత్య చేయడానికి ఎవరూ అటువంటి పద్ధతి ఎన్నుకోరు. పదిమంది తిరిగే రోడ్డుమీద ఒక మనిషిని గుద్దేసి తప్పించుకోవడం చాలా కష్టం. అంత రిస్కు తీసుకోడానికి ఆ వ్యక్తి కాకలు తిరిగిన హంతకుడయుండాలి.

పోలీసుల అభిప్రాయంలో మరేదో కారణానికి వీర్రాజు టాక్సీని దొంగిలించాడు హంతకుడు. హడావుడిగా వెడుతూ యాక్సిడెంటు చేసి సుదర్శనం ప్రాణాలు తీశాడు. జరిగిన పొరపాటు గ్రహించి—టాక్సీని పక్కదారులు తొక్కించి తను మాయమయ్యాడు. అతనికి సంబంధించి మరే వివరాలూ దొరకలేదు వారికి.

ఈ వివరాలన్నీ తెలిసిన మీదట మురళికి—ఇది ముందుగా నిర్ణయించుకుని చేసిన హత్యయేనని రూఢి అయిపోయింది. హంతకుడు నిజంగానే చాలా తెలివైన వాడు. అపూర్వసాహసం కలవాడు. తాననుకున్నది అనుకున్న టైముకి ఖచ్చితంగా సాధించగలిగాడు. అదీ పదిమంది ఎదుట!

అయినా పట్టుబడలేదు. పైగా పోలీసుల ఆలోచనల్ని తప్పుదారి తొక్కించడంలో కూడా కృతకృత్యుడయ్యాడు. ఇది కేవలం యాక్సిడెంటని వారు నమ్ముతున్నారు.

అయితే తనకు తెలిసిన సమాచారం పోలీసులకు అందజేస్తే ఏమవుతుంది?

ఏదేమయినా పోయిన పెదనాయన బ్రతికిరాడు. కానీ తను పోలీసుల దృష్టిలో పడతాడు.

జరగవలసిన తంతులన్నీ జరిగేక మురళి కుటుంబం యధాస్థానానికి వెళ్ళిపోయేరు.

మురళిని అత్యంతాశ్చర్యంలో ముంచేసే సంఘటన మరొకటి జరిగింది. ఇన్సూరెన్సు ద్వారా మురళికి ఏభైవేల రూపాయలొచ్చాయి.

సుదర్శనం రెండు సంవత్సరాల క్రితం ఏభైవేలకు ఒక పోలసీ తీసుకుని దానికి నామినీగా మురళి పేరిచ్చాడు ఆయన అలా తన కుటుంబ సభ్యులందరికీ వచ్చేల చాలా ఇన్సూరెన్సులు చేశాడు కానీ మురళి పేరున చేయడం చాలా ఆశ్చర్యం.

పెదనాన్నకు తనమీద గల అభిమానానికి చాలా ఆశ్చర్యమూ, సంతోషమూ గలిగాయి మురళికి. అటువంటి పెద నాన్న దారుణంగా హత్యచేయబడినందుకు అతనికి చాలా బాధనిపించింది. అడపాతడపా అవసరంలో మురళికి ఆయన సహాయపడుతూండేవాడు. తను లేకపోతే మరె వ్వరూ అతనికి సహాయపడరనే ఉద్దేశ్యంలో ఆయన ఈ ఇన్సూరెన్సు తీసుకుని వుండాలి. ఈ విషయాన్నాయన చాలా గోప్యంగా ఉంచాడు.

ఇలా డబ్బు రావడం సుదర్శనం హత్యపట్ల మురళికి గల బాధ్యతను పెంచింది. అతను సుదర్శనం హత్య జరి గిన సమయంలో తనేం చేస్తున్నదీ మరీమరీ ఆలోచించి చూశాడు. ఆ సమయంలో అతను ఆఫీసులోనే ఉన్నాడు. అందుకు కొలీగ్సందరూ సాక్ష్యమున్నారు. అదీకాక తనకు డ్రయివింగు చేతకాదు.

యాభై వేలంటే మాటలుకాదు. అంత పెద్ద మొత్తం వస్తుందని తెలిసి హత్య చేశాడనుకోవడానికి చాలా అవకాశాలున్నాయి. పోలీసులదృష్టిలోని కెళ్ళిందో లేదో తెలియదు కానీ—మురళికి మాత్రం ఇప్పుడు పోలీసులంటే చచ్చేటంత భయంగా ఉంది.

# 4

మురళి బస్ స్టాపులో నిలబడి ఉన్నాడు.

"మిస్టర్ మురళీ!" రోడ్డు కవతలపక్క నుంచి ఎవరో చెయ్యూపుతూ పిలుస్తున్నారు.

మురళి రోడ్డు క్రాస్ చేసి అవతల వైపుకెళ్ళాడు.

"గుర్తున్నానా?" అన్నాడతను.

ఆశ్చర్యంగా చూశాడు మురళి. లాంగ్ హైర్. నీలం పాటుమీద పింక్ షర్టు వేసుకున్నాడు, కాళ్ళకు ఖరీదైన జోళ్ళున్నాయి. సుమారు పాతికేళ్ళుండవచ్చు. ముఖం తనకు పరిచయమైనదే.

అతను జ్యోతిష్కుడు. పెదనాన్న చనిపోతాడన్న విషయాన్ని కరక్టుగా చెప్పగలిగాడు. హఠాత్తుగా మురళి శరీరం జలదరించింది. అతను జ్యోతిష్కుడేం కర్మ—హంతకుడు!

"ఉన్నారు—" అన్నాడు మురళి.

"నేను నాలుగున్నర అన్నాను. అంతే, ఇంచు మించు నాలుగున్నరకి—" అన్నాడతను గర్వంగా.

"చాలా పకడ్బందీగా హత్య చేశారు. చాలా ధైర్యంగా తిరుగుతున్నారు—" అన్నాడు మురళి.

అతను నవ్వాడు—"నేను హత్యలు చేయడమా?" అన్నాడు—"నిజం చెప్పాలంటే సుదర్శనానికీ నాకూ

ఏ సంబంధమూ లేదు. ఆయన మరణం వలన నాకే ప్రయోజనమూ లేదు. ఆయన పోవడం వల్ల కొంత మందికి ఆకస్మిక ధనలాభం కలిగింది. అటువంటి వాళ్ళే ఎవరో ఆయన్ని చంపి ఉండాలి__" అన్నాడతను మురళి వంక అదోలా చూస్తూ.

మురళి కాళ్ళలో వణుకు పుట్టింది. అతను లేని ధైర్యం తెచ్చుకుని__"అదిసరే_మీరు గొప్ప జ్యోతిష్కుడిలా గున్నారు. హంతకు డెవరో చెప్పగలరా?" అనడిగాడు.

"చెప్పను. కానీ హత్య ఎలా జరిగిందో చెబుతాను" అన్నాడతడు తాపీగా.

మురళి ఒకసారి చుట్టూ చూశాడు. రోడ్డుమీద జనం మామూలుగా తిరుగుతున్నారు. ఎవ్వరూ తమని పట్టించుకోవడంలేదు. రోడ్డు కవతల వైపు తను ఎక్కవలసిన బస్సు వచ్చి కదుల్తోంది_"చెప్పండి" అన్నాడు మురళి.

"చాలా సింపుల్! ఒక టాక్సీ డ్రైవర్‌కి వంద రూపాయలిచ్చి అతని టాక్సీ తీసుకున్నాడనుకోండి. ఆ తర్వాత 'తను చంపదల్చుకున్న చోట ఒక మనిషిని కాపు పెట్టి రోడ్డుకిటుపోతున్న మనిషిని అటు పిలిపించాడనుకోండి. ఈలోగా టాక్సీ సుదర్శనం మీంచి వెళ్ళిపోయిందనుకోండి__దాన్ని హత్యగా నిరూపించడానికి బ్రహ్మదేవుడికి కూడా వీలుకాదు. హత్యగా నిరూపించలేనంత కాలం ఆ టాక్సీలో వెళ్ళిన హంతకుణ్ణి ఎవరూ పట్టుకోలేరు__" అన్నాడతను సింపుల్‌గా.

"ఈ క్షణాన మిమ్మల్ని నేను పట్టించగలను"__ అన్నాడు మురళి.

అతనికి నవ్వొచ్చింది__"సరే_నన్ను పట్టిస్తారు. ఏమని చెబుతారు?" అనడిగాడు.

మురళి ఆలోచిస్తున్నాడు. అవును—ఏమని చెబుతాడు? పెదనాన్న మరణాన్ని తనకు ముందుగా చెప్ప గలిగిన వ్యక్తి ఇతనే అంటే ఆ విషయం ముందే ఎందుకు చెప్ప లేదని అడుగుతారు.

"నాకూ సుదర్శనానికీ ఏవిధమైన సంబంధమూ లేదు. అతన్ని చంపడంవల్ల నాకేమీ లాభం లేదు. కానీ నన్ను పోలీసుస్టేషనుకి తీసుకెళ్ళడం ద్వారా మీరు చిక్కుల్లో పడతారు. యాక్సిడెంట్ గా భావిస్తున్నదాన్ని హత్యగా మార్చి—దానితో హంతకుణ్ణి వెతకాల్సిన అవసరం మీకే మొచ్చిందీ అనుకుంటారు పోలీసులు. దానికి తోడు మీకు పెదనాన్న చనిపోవడంవల్ల ప్రయోజనంకూడా కలిగింది. ఇక చూసుకోండి—" అన్నాడతను.

అతను తెలివైన వాడన్న విషయంలో సందేహమే లేదు. ఎదుటి మనిషి బలహీనతల నతను చక్కగా విని యోగించుకోగలడు. తనతన్ని ఏమీ చేయలేడనీ అలా చేయాలని ప్రయత్నించడంవల్ల తనే చిక్కుల్లోపడతాడనీ మురళి గ్రహించాడు.

"ఇంతకూ మీరిప్పుడు నన్నెందుకు పిలిచినట్లు?" అన్నాడు మురళి.

"అది చెబుదామనుకుంటూంటూనే మీరు సంభాషణను పెడదోవ పట్టించారు. మీకు సుధాకరరావు తెలుసా?" అన్నాడతను తాపీగా.

"ఏ సుధాకరరావు?" అనడిగాడు మురళిఆశ్చర్యంగా.

"మీకెంతమంది సుధాకరరావులు తెలుసు?" అతను ఎదురుప్రశ్న వేశాడు.

మురళి ఒక్క క్షణం ఆలోచించి—"అసలెవ్వరూ తెలియరు" అన్నాడు.

"బాగా గుర్తు చేసుకున్నారా?" అనడిగేడతను.

"ఆహాఁ—" అన్నాడు మురళి.

"అయితే ధవళేశ్వరంలోని సుధాకరరావు మీకు తెలియదంటారు?" అన్నాడతను.

మురళికి చటుక్కున గుర్తుకు రాగా—"అతను తెలియకపోవడమేమిటి అతను వరసకి నాకు అన్నయ్యవుతాడు ఇంచుమించు ఇద్దరమూ ఒకీడు వాళ్ళమే—" అన్నాడు.

"చూశారా మీకు చటుక్కున గుర్తురాని బంధువులు కూడా నాకు తెలుసు" అన్నాడతను నవ్వుతూ.

"అది సరే — అతనికిప్పుడేమయింది?" అన్నాడు మురళి.

"ఈ రోజునుంచీ లెక్కపెట్టుకుంటూ వెడితే సరిగ్గా మూడవరోజు రాత్రి ఏడు గంటల నలభై నిముషాలకు— సుధాకరరావు మరణిస్తాడు—" అన్నాడతను.

మురళి ఉలిక్కిపడి—"వాటీజ్ దిస్!" అన్నాడు.

అతను నవ్వి "ఇదే జోస్యం—చావు జోస్యం!" అన్నాడు.

"డిసీజ్ టూ మచ్" అన్నాడు మురళి.

"అవన్నీ నాకు తెలియదు. అతను పోయినట్లు మీకు తెలిశాక అతనలా పోతాడన్న విషయాన్ని ముందుగానే మీకు ఒక గొప్ప జ్యోతిష్కుడు చెప్పగలిగాడన్న సంగతి గుర్తుంచుకోండిచాలు—వస్తాను మరి! ఇప్పటికే మీకు రెండు బస్సులు మిస్ కొట్టినట్లున్నాయ్" — అన్నాడతను.

## 5

"హలో—ఎవరండీ మాట్లాడుతుంట—"

"నేను—సుధాకరాన్ని"

"అమ్మయ్య నువ్వేనా—నేను కుసుమని—"

సుధాకరరావు ముఖం వికసించింది—"ఎక్కణ్ణించి, ఆఫీసునించేనా?"

"అవును ఏమిటి విశేషాలు?"

"ఫోన్ చేసింది నువ్వు. నువ్వే చెప్పాలి విశేషాలు?"

"విశేషాలు చెప్పడానికి కాదు ఫోన్ చేసింది. విశేషా లెక్కడ చెబుతానో చెప్పడానికి—"

"ఎక్కడ?"

"ఆనకట్ట దగ్గర—మనం ఎప్పుడూ కలుసుకునే చోటనే అదే సైముకి—"

"ఓకే" అన్నాడు హుషారుగా సుధాకరరావు.

"ఓకే" అని ఫోన్ పెట్టేసింది కుసుమ.

సుధాకరరావు అప్రయత్నంగా ఈల వేశాడు. అతను చాలా హుషారుగా ఉన్నాడు.

సుధాకరరావు కుసుమను ప్రేమించాడు, ఇద్దరూ ఉద్యోగాలలో ఉన్నారు. ఒకే ఊళ్ళో ఉంటున్నారు. పెద్దవాళ్ళు కాదంటారన్న భయం ఇద్దరికీ లేదు. కుసుమ అక్కయ్యకు వివాహం కావడం కోసం ఇద్దరూ ఆగేరు. ఇటీవలే కుసుమ అక్కను చూచుకునేందుకు పెళ్ళివారొచ్చి వెళ్ళేరు. 'బహుశా దానికి సంబంధించిన విశేషాలే చెప్పాలనుకుంటూ ఉండి ఉండవచ్చు కుసుమ'—అనుకున్నాడు సుధాకరరావు.

సుధాకరరావు, కుసుమ కలుసుకునే చోటు ఒకటుంది. అదే ఆనకట్ట దగ్గర. అక్కడ ఒక చిన్న లంకవంటి ప్రదేశమూ, అందులో చక్కని పూదోటా వున్నాయి. ప్రేమికులు కలుసుకోవడానికి అద్భుతమైన స్థలమది. నిర్మా

సువ్యంగా వుండకపోయినా అవసరమైన ఏకాంతాన్ని ప్రసాదిస్తుందా ప్రదేశం.

వివాహమయ్యేవరకూ యువతీయువకులు ఏకాంతం గురించి తపిస్తూంటారు. మాట్లాడుకుందుకు వారిమధ్య గల విశేషాలకు లెక్క వుండదు. ఎంతసేపు కబుర్లు చెప్పు కున్నా తనివి తీరదు. విడిపోయేటప్పుడు బాధగా విడి పోతారు. వివాహ మొక్కటే వారి సంభాషణను నిలుపు చేయగలదు. అందుకు కారణం వేరే ఏమీ లేదు. వివాహ మయ్యాక వారు కలిసే జీవిస్తారు. ఒకరికొకరు అందరన్న భయముండదు.

ప్రస్తుతం సుధాకరరావు కలలు కంటున్నాడు. చాలా ముఖ్యమైన విశేషమేదో చెప్పబోతూ వుండాలి కుసుమ. అందుకే ప్రత్యేకంగా ఫోన్ చేసి చెప్పిందనుకుంటున్నాడు. కానీ, కుసుమ ఎప్పుడూ అతనికి ఫోన్‌లోనే మాట్లాడి చెబుతూంటుందని అతనికి తెలియకపోలేదు. కానీ, ప్రియు రాలి సమాగమ మనేసరికి ఏవో ఆశలు, ఎన్నో కలలు!

సాధారణంగా వాళ్ళు కలుసుకునే సమయం ఏడున్నర. కుసుమ ఇంటివద్ద అబద్ధం చెప్ప నవసరంలేదు. ఆమె ప్రాజ్ఞురాలయిందనీ తప్పటడుగులు వెయ్యదనీ ఇంట్లో అందరికీ నమ్మకముంది. పైగా సుధాకరరావు కప్పుడే ఆ ఇంట్లో ఇంటల్లుడిగా గుర్తింపు లభించేసింది. అయినా తొమ్మిది కాకుండా తిరిగి ఇల్లు చేరుకుంటుంది కుసుమ.

సాయంత్రం ఆఫీసు వదలగానే సుధాకరరావు తన రూమ్‌కెళ్ళి, అరగంటలో ట్రిమ్‌గా తయారై అనకట్ట దగ్గ రకు చేరుకున్నాడు.

సుధాకరరావు టైము చూసుకున్నాడు. చాలా నెమ్మ

దిగా నడుస్తోంది గడియారం. ఏడున్నర కావడాని కింకా అరనిముషముంది. కుసుమ జాడలేదు.

చిరాకు, విసుగు కలుగుతున్నా యతనికి. అసహనంగా ఫీలవుతున్నా డతను.

"హలో—మీరేనా మిస్టర్ సుధాకరరావు!"

సుధాకరరావు తలెత్తి చూశాడు. "అవును-మీరు?"

"నే నెవరినైతే ఏం లెండి? కుసుమ నన్ను పంపింది."

"కుసుమ మిమ్మల్ని పంపిందా? మిమ్మల్ని నే నెప్పుడూ చూడలేదే? ఆమెకు మీరేమవుతారు?"

"ఏదో దూరపుచుట్టాన్ని లెండి. నిన్న నే కుసుమ వాళ్ళింటికి వచ్చాను" అన్నా డతను.

"మీ పేరు?"

"తెలుసుకుని ప్రయోజనమేమిటి లెండి? చెప్పడానికి నాకూ బాధగానే వుంది. కారణమేమీ లేదు. నేను మీకు తీసుకువచ్చిన వార్త మంచిది కాదు."

సుధాకరరావు కంగారుపడ్డాడు. "మీరేం చెబుతున్నారో నా కర్థంకావడం లేదు."

"ఇందులో అర్థంకావడానికేముంది లెండి? ఉదయం మీకు కుసుమ ఫోన్ చేసి ఇక్కడకు రమ్మనమని చెప్పిందా? ఆమె ఏదో మీకు చెప్పాలనుకుంది. అయితే ఆ విషయం చెప్పడానికి స్వయంగా తను మీ దగ్గరకొచ్చే అవకాశం లేదు. అందుకే నన్ను పంపింది."

"ఏమిటి మీరనేది?"

"కుసుమ తనే స్వయంగా మీ దగ్గరకు వద్దామనుకుంది. కానీ ఇంట్లోవాళ్ళొప్పుకోలేదు."

"వ్హాట్—నా దగ్గరకు రావడానికి కుసుమకు అడ్డం

కులా? అలా ఆ ఇంట్లో ఎన్నడూ జరుగదు.''

''జరిగింది కాబట్టే నేను వచ్చాను'' అన్నాడతను బాధగా నవ్వి.

సుధాకరరావు అసహనంగా, ''కాస్త వివరంగా చెప్పండి'' అన్నాడు.

''ఏమీ లేదు, కుసుమ అక్క లక్ష్మికి సంబంధం కుదిరింది. వాళ్ళు చాలా ఆస్తిపరులు. లక్ష్మికి కాబోయే భర్తకు ఓ దూరపువరుస తమ్ముడున్నాడు. అతనికి కుసుమను చేసుకోవాలని వాళ్ళనుకుంటున్నారు. కుసుమ వాళ్ళకు బాగా నచ్చింది. రెండు సంబంధాలకూ ముడిపెట్టారు.''

''కుసుమ ఏమంది?''

''ఇందులో కుసుమ ప్రసక్తి ఏముంది? ఆమె తలిదండ్రులకు సంబంధం నచ్చింది. వాళ్ళు బాగా ఉన్నవాళ్ళు కారణంగా వీళ్ళ మోజు పెరిగింది. అదీకాక రెండు సంబంధాలకీ ముడిపెట్టారు వాళ్ళు.''

''ఇది అనుకోని దెబ్బ నాకు. మరిప్పుడు నేనేం చేయాలిట?''

''కుసుమ మిమ్మల్నే చేసుకోవాలనుకుంటోంది. అందు గురించి ఒక చిన్న ఉపాయం ఆలోచించింది. మీరొక చిన్న ఉత్తరం రాసివ్వండి. 'నేను ఈ రోజు రాత్రి ఆత్మహత్య చేసుకుంటున్నాను. నాకు జీవితంమీద విరక్తి కలిగింది. ఇందుకు ఎవరూ బాధ్యులు కారు' అని రాసి సంతకం పెట్టి తేదీ వేసి నాకివ్వండి. అది కుసుమకు నేనందజేస్తాను. అది తనకు ఏ కిటికీలోంచో మీరు విసిరి అందజేశారని కుసుమ చెబుతుంది.

''ఈ ఉత్తరం సహాయంతో ఆమె ఇంట్లో దెబ్బలాడ

తలచుకుంది. కుసుమ తలిదండ్రులు దురాశాపరులు కావచ్చు. కానీ, దుర్మార్గులుమాత్రం కారు. వెతుక్కుంటూ ఈ రాత్రికే మీ ఇంటికి వస్తారు.''

సుధాకరరావు ఆలోచిస్తున్నాడు. అతని బుర్ర సరిగా పనిచేయడంలేదు. కుసుమని తనది కాకుండా చేయడానికి ప్రయత్నాలు జరుగుతున్నాయన్న వార్త అతనిపట్ల అశని పాత మయింది. అతనొక పర్యాయం జేబులు తడుము కున్నాడు.

''కాగితం, కలం నా దగ్గరున్నాయి'' అన్నాడతను నవ్వుతూ. ''మీరు రాయబోయే ఉత్తరం మీ జీవిత సమస్యను తొలగించగలదని నమ్ముతున్నాను.''

''అనుకోని మలుపు తిరిగింది నా జీవితం. ఏమవుతుందో నేను నమ్మకంగా చెప్పలేను'' అన్నాడు సుధాకరరావు నిఃస్పృహాగా.

''అలాగనుకోవద్దు. నాకు జోస్యం తెలును. మీరు రాయబోయే ఉత్తరం, మీ సమస్య లన్నింటినీ తొలగించేస్తుంది'' అన్నాడతను.

''నాకన్నో సమస్యలు లేవు. ఉన్నదల్లా ఒక్కటే!''

''కానీ, ఆ సమస్యకీ, మీ జీవితానికీ ముడిపడి వుంది. ఆ సమస్య తొలగితే మిగతా జీవిత సమస్యలు ఆటోమేటిక్‌గా తొలగిపోతాయి.''

సుధాకరరావు కాగితం అందుకున్నాడు. పెన్ను అతని వద్దనే వుంది. ''ఏమి రాయాలో నాకు తోచడంలేదు. మీరు చెప్పండి. చెప్పినట్లు రాసేస్తాను'' అన్నాడు.

అతను చెప్పడం మొదలుపెట్టాడు. సుధాకరరావు రాస్తున్నాడు. అతను పూర్తి చేయగానే సుధాకరరావు

ఉత్తరం చివర సంతకం పెట్టేశాడు. అతను ఉత్తరాన్ని నాలుగు మడతలుగా చేసి జేబులో పెట్టుకున్నాడు. తన పాంటు జేబులోంచి రెండు చాక్‌లెట్సు తీశాడు. "విష్ యూ ఆల్ ది బెస్ట్. ఈ స్వీట్ తీసుకోండి" అన్నాడతను.

అతను రేపర్ విప్పి తన చాక్‌లెట్ నోట్లో వేసుకున్నాడు. ఇద్దరూ చాక్‌లెట్స్ చప్పరిస్తున్నారు. కొద్ది క్షణాల మౌనం అనంతరం సుధాకరరావు, "నా కళ్ళు తిరుగుతున్నాయి" అన్నాడు. అతను కంగారుగా, "అదేమిటి, ఇంతవరకూ బాగానే వున్నారు గదా" అన్నాడు.

"మై గాడ్, నాకేదో అనుమానంగా వుంది. మీరు... మీరు..." సుధాకరరావు మరి మాట్లాడలేదు. అతని చూపుల్లో ఎదుటివ్యక్తిపట్ల అనుమానం కనబడుతోంది. కానీ, అప్పటికే సమయం మించిపోయినట్లుంది. అతను వెనక్కు పడిపోయాడు.

అతను లేచి తన జేబులోని ఉత్తరాన్ని సుధాకరరావు జేబులోకి తోసేశాడు. సుధాకరరావు కళ్ళు మూతలు పడ్డాయి. మనిషి అచేతనంగా వున్నాడు.

అతను కదిలాడు. టైము చూసుకున్నాడు. టైము ఏడు గంటల నలభైఒక్క నిముషాలయింది. ఓసారి నవ్వుకుని ముందడుగువేశా డతను.

అతనింక వెనక్కు రాలేదు.
సుధాకరరావు మరి లేవలేదు.

## 6

"పాపం సుధాకరరావు పోయేడటరా" అంది జానకమ్మ.

ఉలిక్కిపడి, "ఎలా తెలిసింది?" అన్నాడు మురళి.

"ఉత్తరం వచ్చింది— ఆత్మహత్య చేసుకున్నాడుట" అంటూ ఉత్తరా న్నందించిందామె.

మురళి ఆత్రుతగా దాన్నందుకుని చదివాడు. ఎక్కువ విశేషాలేమీ లేవు. ఫలానా రోజు రాత్రి సుధాకరరావు ధవళేశ్వరంలో ఆత్మహత్య చేసుకున్నాడన్నది అందులోని సారాంశం.

హఠాత్తుగా మురళికి జ్యోతిష్కుడు గుర్తుకొచ్చాడు. సుధాకరరావు చనిపోతాడని అతను చెప్పాడు. సరిగ్గా అదే రోజు, అదే రాత్రి ఏడుగంటల నలభై నిముషాలకు చనిపోతాడన్నా డతను. ఈ ఉత్తరంలో టైము విషయం రాసి లేకపోయినా, మిగతా వివరాలు సరిపోయాయి.

ఎవరీ జ్యోతిష్కుడు? అతనికి వీళ్ళ చావుగురించి ఎలా తెలుస్తోంది? తెలిస్తే తెలిసింది. తనకెందుకు చెప్తున్నాడు?

మొట్టమొదట తన పెదనాన్నగారి చావుగురించి చెప్పాడు. చెప్పిన టైము ప్రకారం ఆయన పోయారు. అయితే ఆయన మరణంవల్ల తనకు యాభైవేలు కలిసొచ్చాయి. అలా కలిసొస్తాయని తనకు తెలియదు. కానీ, అతనికి తెలిసినట్లే కనబడుతోంది.

కానీ, తనకు యాభైవేలు వస్తే అతనికేం ప్రయోజనం? వాటా కావాలంటాడా? అడిగితే మాత్రం తను ఇస్తాడా? అయినా తనకు యాభైవేలు రావడంకోసం అతనొక హత్య చేసి తన ప్రాణాల నెందుకు రిస్కులో పెట్టుకుంటాడు?

ఆ విషయం అలాగుంచితే ఇప్పుడు సుధాకరరావు ఆత్మహత్య సంగతి ఏమిటి? సుధాకరరావు ఆత్మహత్య

రోజులూ, గంటలూ, నిమిషాలతో సహా అతనెలా చెప్ప గలిగాడు? ఎలాగో చెప్పగలిగా డనుకున్నా ఆ విషయం తనకెందుకు చెప్పాడు? సుధాకరరావు మరణానికీ, తన జీవితానికీ సంబంధ మేమిటి?

అంతా అయోమయంగా వుంది మురళికి.

బహుశా ఆ వ్యక్తి జ్యోతిషం నేర్చుకుంటున్నాడేమో? తను లెక్కలుకట్టి ఒక విషయాన్ని ఊహించి అది నా బోటివాడికి చెబుతున్నాడు. అది సరిగ్గా జరిగినప్పుడు అత నికి జ్యోతిషంలో గల ప్రతిభను గుర్తించగల వ్యక్తి కనీసం తను వుంటాడు.

ఇలా జరిగివుండడం అసంభవ మనిపించింది మురళికి. తన ఆలోచనల్లో ఎక్కడో లోపముంది? జ్యోతిషం సహాయంతో చావు పుట్టుకలు గంటలూ, నిమిషాలతో చెప్పగలగడం అంత సింపుల్ విషయం కాదు. ముఖ్యంగా చావుకు సంబంధించినంతవరకూ ఆ విషయాన్ని దేవు డొక్కడే నిర్ణయించ గలుగుతాడు?

ఒక మనిషిని ఒక సమయంలో ఒక ప్లాన్‌లో చంపా లనుకునేవాడికి, చావుగురించి కరెక్టుగా చెప్పగల శక్తి వస్తుంది. అటువంటివాడే హంతకుడు! ఒక పథకం వేసు కుని ఒక వ్యక్తిని చంపాలనుకునే హంతకుడికి హతుడి మరణసమయాన్ని ముందుగా చెప్పగల శక్తి వస్తుంది!

ఈ జ్యోతిష్కుడు తప్పనిసరిగా హంతకు డయుండాలి' అయితే సుధాకరరావు ఆత్మహత్య చేసుకోలేదా? హత్య కావించబడ్డాడా? ఈ విషయాన్ని మరింత క్షుణ్ణంగా పరిశీ లించి తెలుసుకోవాలనుకున్నాడు మురళి.

# 7

పుట్టెడు దుఃఖంలో వున్న వసుమను చూస్తే మురళికి చాలా జాలి కలిగింది. ఆమె కలలన్నీ కరిగిపోయాయి.

మురళి కొంత సమాచారం సేకరించాడు.

సుధాకరరావు ఆత్మహత్య చేసుకున్నాడనడంలో అను మానం లేదు. కానీ, ఎందుకు ఆత్మహత్య చేసుకున్నాడో మాత్రం అర్థం కావడంలేదు.

మురళి పనికట్టుకుని ధవళేశ్వరం రావడానికి మరో కారణముంది! జ్యోతిష్కుడు సుధాకరరావు మరణం గురించి తనకు ముందుగా చెప్పాడంటే, దానికీ తనకూ ఏదో సంబంధ ముండి వుండాలి. అదేమిటో తెలుస్తుందనే అతనిక్కడకు వచ్చాడు. కానీ సూచనప్రాయంగాకూడా ఆ విషయం తెలియలేదు.

ఏది ఏమైనా పెద్ద సమాచారమేమీ రాబట్టకుండానే తిరుగుప్రయాణమయ్యాడు మురళి.

అతను బస్సు దిగుతూండగా, "హలో మురళీ" అన్న పిలుపు వినిపించింది. మురళి బస్సు దిగి చుట్టూ చూశాడు. ఎరిగున్న ముఖం ఎక్కడా కనబడలేదు.

"హుష్-ఇక్కడ!" ఈసారి చప్పట్లుకూడా వినిపించాయి.

ఆ దిక్కుగా చూసి ఉలిక్కిపడ్డాడు మురళి.

బస్టాండులో, కాస్త షెడ్‌లో, గోడపక్కగా నిలబడి వున్నాడు జ్యోతిష్కుడు.

మురళి చురుగ్గా అటుకేసి నడిచాడు.

"అనుకోకుండా కనిపించారు, మీ గురించే చూస్తున్నాను. ఏదో ఆలోచిస్తున్నట్లున్నారు, ధవళేశ్వరం

నుంచా?" అన్నాడు జ్యోతిష్కుడు.

"అవును. మీ జోస్యం నిజమయింది" అన్నాడు మురళి.

అతను నవ్వి, "నేను నిజాన్నే జోస్యంగా చెబుతాను. నిజం కాకేమవుతుంది?" అన్నాడు.

"సుధాకరరావు చాలా మంచివాడు. ఎప్పుడూ, ఎవరికీ కీడు తలపెట్టనివాడు. చెప్పాకోదగ్గ ఆర్థికసమస్యలు లేవతనికి. ప్రేమించిన అమ్మాయి పెళ్ళికి అంగీకరించింది. అటువంటి అతను కేవలం మీ జోస్యాన్ని నిజం చేయడానికే అన్నట్లు ఆత్మహత్య చేసుకున్నాడు" అన్నాడు మురళి బాధగా.

అతను పెదవి విరిచాడు. ఓసారి తనూ బాధగా నిట్టూర్చి, "ఏం చేస్తాం చెప్పండి. విధిని యెదిరించి మనిషి బ్రతకలేడు. ఎలా జరగాలనుంటే అలా జరగాల్సిందే" అన్నాడు.

"కానీ, ఖచ్చితంగా యెలా చెప్పగలుగుతున్నారు మీరు, జరగబోయే చావుల గురించి."

"అది నేను చెప్పినా మీకు అర్థంకాదు. హిమాలయాల్లో వెయ్యేళ్ళు తపస్సుచేసిన ఒక మహర్షి దగ్గర ఈ ఉపదేశం పొందాననుకోండి. అదంతా యెందుకు లెండి కానీ, మీ కిప్పుడు మరో ముఖ్యమైన విశేషం చెప్పడానికి వచ్చాను."

ఉలిక్కిపడ్డాడు మురళి, "కొంపదీసి మళ్ళీ యెవరి చావుగురించో కాదు గదా."

"ఎగ్జాక్ట్లీ, నన్ను మీరు బాగా అర్థం చేసుకున్నారనుకుంటాను. రామాయమ్మగారు తెలుసా మీకు."

"ఏ రామాయమ్మగారు?" అన్నాడు మురళి ఆశ్చర్యంగా.

"ఏంటండీ మీరు మీ బంధువులగురించి తెలియకుండా వున్నారు" అంటూ అతను ఆవిడ ఊరుపేరు చెప్పాడు.

చటుక్కున గుర్తొచ్చింది మురళికి. అప్పుడప్పుడు అతనూ, తల్లీ, చెల్లెలూ వాళ్ళ ఊరెళ్ళి వస్తూండేవారు. ఆవిడది చిన్న పల్లెటూరు. పాపం, ఆవిడకి ఎవ్వరూ లేరు.

మురళి నాన్నగారంటే చాలా అభిమానంగా వుండేది. చాలా ముసలావిడ. తొంభై ఏళ్ళుండవచ్చునేమో.

"తెలుసు" అన్నాడు.

"ఆవిడ ఇంక సరిగ్గా, రెండే రెండురోజులు బ్రతుకుతుంది, ఈ వేళ కాక" అన్నాడతను.

తీవ్రంగా అతని కళ్ళలోకి చూసి, "హత్య చేస్తారా?" అనడిగాడు మురళి.

అతను నవ్వి—"మీరలా అడగడం శాస్త్రానికే అవమానం. జరకబోయేది చెప్పగలను నేను. జరగబోయేది తెలుసుకోగల అద్భుత జ్యోతిష్కుడుగా మీరు నన్ను గుర్తించుకుంటే చాలు—" అన్నాడు.

"అందువల్ల ఏమిటి మీకు ప్రయోజనం."

"మహాత్ములు ఏపనినీ ప్రయోజనానాన్నాశించి చేయరు. పరోపకారార్థమే వారు జీవిస్తారు."

"రామాయమ్మగారిని చావనివ్వను నేను, ఈ హత్యను ఆపుతాను నేను." అన్నాడు మురళి ఆవేశంగా.

"విధి నిర్ణయానికి కట్టుబడి ఉండడం మనిషి కర్తవ్యం ఎదిరించడానికి ప్రయత్నించిన వారందరూ నాశనమై పోతున్నారని చరిత్ర చెబుతోంది." అన్నాడతను. అతని చూపుల్లోని ఏదో శక్తి మురళిని భయం కలిగించింది.

"అంటే మీ ఉద్దేశ్యం?" అన్నాడు మురళి.

"కంగారు పడకండి ఓ వారం రోజుల్లో మీరు రామాయమ్మగారు పోయినట్లుత్తరం వస్తే—ఆ విషయం ఒక జ్యోతిష్కుడు మీకు ముందుగానే చెప్పేడని గుర్తుంచుకోండి—అంతే!"

# 8

హరికథ ఆ రోజుతో ఆఖరు. ఆ రోజున రావణవధ. దాసుగారు రమ్యంగా యుద్ధఘట్టాల్ని వర్ణించి చెబుతూంటే పరవశంగా వింటున్నారు రామాయమ్మగారు.

రామాయమ్మగారికి ఆ ఊళ్ళో మంచి పేరుంది. ఆవిడకు పదెకరాల మాగాణీ ఉంది. రెండు స్వంతిళ్ళున్నాయి, బ్యాంకులో కూడా డబ్బుంది. ఇంట్లో బంగారముంది. అన్నిటికీ మించి బుర్రలో తెలివుంది. పదిమందికి సహాయపడే మంచిమనసుంది. తొంభై ఏళ్ళుండినా చెడని శరీరారోగ్యముంది.

ఈ హరికథ ఆవిడ ఏర్పాటు చేసిందే. ఊరు ఊరంతా వచ్చి వింటున్నారు. దాసుగారు కూడా మంచి ప్రావీణ్యత కలవాడిలా ఉన్నాడు. శ్రావ్యంగా గానంచేస్తూ గత రెండు వారాలుగా ఊళ్ళోవారి నాయన అలరిస్తూనే ఉన్నాడు.

ఆరోజు హరికథ ముగిస్తుంది. రావణుడు మరణిస్తాడు. ఆ సందర్భంలో దాసుగారికి దండిగా కట్నాలుముడుతున్నాయి. ఒకొక్కరే అయిదులు, పదులు, పాతికలు, అర్ధనూట పదహార్లు చదివిస్తున్నారు. రామాయమ్మగారు నూటపదహార్లు చదివించింది.

చదివింపులయ్యేక శ్రీరాముడు రావణాసురుడి బొడ్లో బాణం కొట్టాడు. రావణాసురుడి కథ ముగిసింది.

హరిదాసుగారు తన మాటలు కొన్ని చెప్పాడు. "అయ్యా—అప్పటికీ ఇప్పటికీ ఎప్పటికీ రావణాసురులుంటూనే ఉంటారు. శ్రీరామచంద్రులూ ఉంటారు. వీరి మధ్య నిరంతర పోరాటం కొనసాగుతూనే వుంటుంది. కానీ అప్పుడప్పుడు రావణాసురుడికీ విజయం లభించవచ్చు. కానీ ఆవిజయం తాత్కాలికమే కావడానికి ప్రజలు సహకరించాలి. రావణాసురుడిది రాక్షసబలమయితే— రాముడిది ధర్మబలం, న్యాయబలం, ప్రజాబలం, అందువల్లనే చిట్టచివరకు ఆ బలం నెగ్గగలిగింది.

మీ గ్రామంలో ఉన్న రామాయమ్మగారి వంటి వ్యక్తి ఇంతవరకూ నాకెక్కడా తటస్థపడలేదు. జీవితమే ఒక సమరమనుకుంటే ఆ సమరంలో ఇంతవరకూ రామాయమ్మగారు సాధించిన విజయం వెనుక ఆవిడ నడుస్తున్న ధర్మన్యాయ మార్గాలున్నాయి. అందువల్లనే ఈ వయసులో కూడా ఆవిడ ఆరోగ్యంగా ఉండగలిగారు. పూర్వనీయులగు రామాయమ్మగారు తమ ధర్మన్యాయ మార్గాలద్వారా మరిన్ని వర్షాలు జీవించాలని కోరుకుంటున్నాను. శ్రీరామచంద్రుడి రాజ్యంలో ప్రజలకు ఏలోటూ లేదు. ఏ ఈతిబాధలూ లేవు. అందుకే శ్రీరామ రక్ష అన్నపదం వాడుకలోకి వచ్చింది. రామాయమ్మగారి ఉనికి ఈ గ్రామానికి శ్రీరామరక్ష అని నా అభిప్రాయం—" అన్నాడు.

అక్కడున్న అందరూ చప్పట్లు కొట్టారు. ఆ గ్రామంలో ఆవిడ కొక విశిష్టస్థానముంది. ఆవిడంటే అందరికీ అభిమానం.

జనంలోంచి ఒక వ్యక్తి తోసుకుంటూ ముందుకు

వచ్చాడు. అతనికి సుమారు పాతికేళ్ళు పైనే ఉండవచ్చు
ధోతీ, లాల్చీలలో నిండుగా కనిపిస్తున్నాడతను.

"కరణంగారబ్బాయి" అనుకున్నారు చాలామంది గుసగుసలుగా. పల్లెటూళ్ళలో కుర్రాళ్ళని పెద్దవాళ్ళతండ్రి పేరుతో గుర్తుంచుకోవడం కద్దు. కరణంగారబ్బాయి స్టేజి మీదకు వచ్చి హరిదాసుగారికి ప్రణామంచేసి తర్వాత ఊరందరికీ నమస్కారించాడు.

"శ్రీదాసుగారురామాయణాన్ని మహాద్భుతంగా గానం చేశారు. ఈ రోజుల్లో మావంటి కుర్రవాళ్ళకూడా అత్యంతాశక్తికరంగా ఉండే విధంగా ఆయన కథ చెప్పారు. కథ చెప్పిన ఆయనకూ, అది ఏర్పాటు చేసిన రామాయమ్మగారికీ ఊరి తరపున నా అభినందనలు. ఈ శుభసమయంలో నేను పంచిపెట్టే ఈ స్వీట్సు శ్రీరామ ప్రసాదం కావాలని కోరుకుంటున్నాను. ఒక పర్యాయం దాసుగారిని నావద్దనున్న ఈ స్వీట్లను తాకి పవిత్రత నాపాదించవలసిందిగా కోరుతున్నాను" అన్నాడతను.

అతని భుజానికి తగిలించి ఉన్న సంచీని ఒక పర్యాయం దాసుగారికి అందించాడు. ఆయన దాన్నందుకుని కొద్ది క్షణాలపాటు కళ్ళు మూసుకున్నాడు. కళ్ళు తెరిచి— "కానివ్వండిబాబు" అన్నాడు.

కరణంగారబ్బాయి ప్రసాదాలు పంచి పెట్టడం ప్రారంభించాడు. ముందుగా అతను హరిదాసుగారికి సంచీలోని స్వీట్సు ఇచ్చాడు. తరువాత అక్కడున్న ప్రతి ఒక్కరికీ ఇవ్వసాగాడు.

అతను రామాయమ్మగారి దగ్గరకు వెళ్ళి స్వీటు అందిస్తూ "మీవంటి పుణ్యాత్మురాలికి ఈ లోకంలోకంటె అ

లోకంలో లభించే సత్కారాలే ఎక్కువ" అంటూ పాదాభినందనం చేశాడు.

ఆవిడ ఆప్యాయంగా అతని తల నిమిరి ప్రసాదం నోట్లో వేసుకుంది.

*           *           *

"ఆచార్లుగారూ ఒక్కసారి మా ఇంటి కొస్తారా?" అన్నాడు రామం.

రామం వారాలమీద చదువుకుంటున్న పిల్లవాడు. అతని మకాం రామాయమ్మగారింట్లో. వారానికొకరి ఇంట్లో భోంచేస్తూంటాడు. ఎవరింట్లోనూ వారం దొరకనప్పుడు రామాయమ్మగారింట్లోనే భోంచేస్తూంటాడు.

"ఏమిటి కథ పొద్దునే ఇలా వచ్చావ్?" ఆచార్లుగారడిగేడు.

"అమ్మగారు రాత్రి పడుకున్నారా రోజూ పొద్దు పొడవకుండా లేచేవారింతవరకూ లేవలేదు. వెళ్ళి పలకరిస్తూంటే ఉలకరు, పలకరు. ముందు వంటావిడ చూసిందీ విషయం. ఒక్కసారి మీరు వచ్చి చూస్తే బాగుంటుంది. మాకేమిటో భయంగా ఉంది."

ఆచార్లుగారు వెంటనే చొక్కా వేసుకుని మందుల సంచీ తీసుకుని చెప్పులు తొడుక్కుని రామం వెంట బయలేరాడు. ఆయన రామాయమ్మగారిల్లు చేరుకునేసరికి అప్పుడే చుట్టుపక్కల జనం చాలా మంది పోగయ్యారు. అక్కడ చేరిన జనం కబుర్లను బట్టి ఆవిడ పోయుంటుందని అందరూ అనుకుంటున్నట్లు ఆచార్లుగారికి అర్థమయింది.

ఆయన రామాయమ్మగారిని చూస్తూనే ముఖంలో జీవకళ లేదనుకున్నాడు. తర్వాత చేయి పట్టుకుని నాడి పరీక్షించి చేయి క్రింద పెట్టేసి తలవంచుకున్నాడు.

"ఏమంటాచార్లుగారూ" అన్నారెవరో.

"అనడానికేముంది పెద్దావిడ కథ అయిపోయింది" అన్నాడాచార్లుగారు.

హఠాత్తుగా ఘొల్లుమని ఏడ్పులు ప్రారంభమయ్యాయి. ఏడ్పుల మధ్య రామాయమ్మగారి గుణగుణాల ప్రస్తుతి కొనసాగుతోంది.

"నిన్న రాత్రిదాకా చక్కగా ఉంది కదమ్మా రాత్రికి రాత్రి ఏమయిందో ఏమిటో!"

"అఁ తొంభై ఏళ్ళు నిండాక ఏదో ఒక రోజు తప్పదు."

"చాలా పుణ్యాత్మురాలు, తనేర్పాటు చేసిన హరికథ ముగిసేవరకూ ఉండి రావణాసురుడి చావు చెవులారా విన్నాకనే మరణించింది."

"ఆ చావుకూడా ఎంత చక్కగావచ్చిందో చూడండి. పువ్వులా వెళ్ళిపోయింది. ఓ జబ్బులేదు ఏంలేదు, భీష్ముడిలా స్వచ్ఛంద మరణం పొందినట్లుంది."

ఈ కబుర్లు వింటున్న వారిలో కరణంగారబ్బాయీ ఉన్నాడు. అందరితో పాటు అతనూ కొన్ని మాటలు అంటున్నాడు.

# 9

"నా పేరు రమణరావు" అన్నాడు కాఫీ త్రాగుతూ.

"మీరు మా నాన్నగారి స్నేహితులనుకుంటాను" అన్నాడు మురళి ఆయనెవరో అంచనా వేయడానికి ప్రయత్నిస్తూ.

"మీకు రామాయమ్మగారు తెలుసుననుకుంటాను నేను వారి లాయర్ని."

మరొకప్పుడైతే ఏ రామాయమ్మ అని అడిగి ఉండే వాడే మురళి. కానీ ఇప్పుడతనికి ప్రతి క్షణం అవిడే గుర్తుకొస్తోంది.

జ్యోతిష్కుడు చెప్పిన ప్రకారం ఆవిడ చనిపోయి రెండు వారాలు దాటి ఉండాలి. కానీ తనకింత వరకూ ఏ కబురూ రాలేదు. స్వయంగా కబురు తెలుసుకునేందుకు భయంగా ఉంది, తర్వాత తను చిక్కుల్లో పడతాడేమో నని.

"నేను మీకిప్పుడు రెండు వార్తలు తీసుకొచ్చాను. అందులో ఒకటి దుర్వార్త!" అన్నాడు రమణరావు.

మురళి బాధగా ముఖం పెట్టి "ఇటీవల నేను వింటున్న వన్నీ దుర్వార్తలే" అన్నాడు.

"అయినా తొంభైఏళ్ళు నిండినావిడ పోయారంటే అది పెద్ద దుర్వార్త అనుకోను. ఎటొచ్చీ ఇంకా కాలూ చేయీ బాగానే ఉండగా, ఎన్నో మంచిపనులు చేస్తున్న ఒక గొప్ప మనిషి మరి భూమ్మీద లేదని బాధపడాలి."

"ఏమిటి మీరనేది లాయరుగారూ మామ్మా...' అన్నాడు మురళి.

"అవును. ఆవిడ ఇంక లేరు—" అంటూ రమణరావు రామాయమ్మ పోయిన దినం చెప్పేడు. ఆయన చెప్పిన తేదీని గణించుకుని 'సరిగ్గా జ్యోతిష్కుడు చెప్పినట్లే అయింది' అనుకున్నాడు మురళి.

తను వచ్చిన పని క్లుప్తంగా వివరించాడు రమణరావు. రామాయమ్మగారు తన అనంతరం తన ఆస్తి తను ఖర్చు చేసే పద్ధతుల్లోనే ఖర్చు చేయబడాలని కోరుకుంది. ఆవిడ దృష్టిలో ఆ ప్రకారం ఆస్తిని సద్వినియోగం చేయగల

వాళ్ళిద్దరే ఉన్నారు. ఒకరు సుధాకర్రావు, రెండు మురళి. ఆస్తి అంతా సుధాకర్రావుకే చెందాలనీ అతను మరణించిన పక్షంలో, మురళికి చెందాలనీ ఆవిడ వీలు వ్రాసింది. ప్రస్తుతం సుధాకర్రావు బ్రతికి లేడు. ఆ కారణంగా రామాయమ్మగారి ఆస్తికి మురళి వారసుడయ్యేడు.

"మీ నాన్నగారి ధర్మగుణం గురించి ఆవిడ తరచుగా చెబుతూండే వారు. ధానధర్మాలతో మీ కుటుంబం సుసంపన్న స్థాయినుంచి మధ్యతరగతి స్థాయికి దిగిపోయిందని కూడా ఆవిడ ఎన్నోసార్లు నా దగ్గర బాధపడ్డారు" అన్నాడు రమణరావు.

మురళి ఆయన మాటలు వినడం లేదు. జ్యోతిష్కుడు పెదనాన్నగారి మరణం గురించి చెప్పాడు. తనకు యాభై వేలొచ్చాయి. సుధాకర్రావు, రామాయమ్మగార్ల మరణం గురించి చెప్పాడు. తనకిప్పుడు పెద్ద ఆస్తి వస్తోంది.

ఇదంతా ఎందుకు జరుగుతోంది? జ్యోతిష్కుడికి తన వల్ల ప్రయోజనమేమిటి? తనకోసం ఇన్ని హత్యలెందుకు చేస్తున్నాడు?

"ఒక చిన్న సందేహం—ఒక వేళ నేనుకూడా బ్రతికి ఉండకపోతే ఈ ఆస్తి అప్పుడెవరికి చెందుతుంది?" అనడిగేడు మురళి అనుమానంగా.

రమణరావు నవ్వి "ప్రభుత్వానికి" అన్నాడు.

మురళి ఏదో ఆలోచిస్తూ "వీలునామా చాలా రహస్యంగా వ్రాయబడిందనుకుంటాను, కారణమేమిటి?" అన్నాడు.

"ఆస్తికోసం ఆవిడ చుట్టూ చేరినవారు చాలా మందున్నారు. ఆవిడ వీలు వ్రాసినట్లు ఎవ్వరికీ తెలియదు. తెలిస్తే రోజూ ఆవిడ మీద ఒత్తిడి తీసుకొస్తూండే వారు.

అదలాగుంచి వారసులక్కూడా ముందునించీ ఆ విషయం తెలియడమిష్టం లేదు. తన మానాన తను బ్రతుకుతూ తను పోయేక తన ఆస్తి మీకివ్వడమే ఆవిడ ఉద్దేశ్యం!"

"రామాయమ్మగారిలా వీలు వ్రాసినట్లు ఇంకా ఎవరికి ముందుగా తెలుసు?"

రమణరావు ఆశ్చర్యంగా మురళి వంక చూశాడు "మీరీ ప్రశ్నలన్నీ ఎందుకడుగుతున్నారో నాకాశ్చర్యంగా ఉంది. ఈ వీలునామా సంగతి నాకుతప్ప మరెవ్వరికీ తెలియదు" అని "అన్నట్లు ఇందులోని దస్తూరీ ఆ ఊరి కరణంగారిది. ఆయనక్కూడా ఈ వీలునామా విషయం తెలుసు" అన్నాడు.

"నేనిలా అడుగుతున్నానని మరోలా అనుకోకండి.ఇలా అనుకోకుండా ఆస్తి కలిసి రావడం నాకాశ్చర్యంగా ఉంది. ఇంకా నమ్మలేకుండావున్నాను. మామామ్మకు ఇంత అభిమానముందని నాకు తెలియదు. ఆవిడ అభిమానాన్ని నాపై ఇలా చూపించగలదనీ అనుకోలేదు. ఏ అడ్డంకులూ లేకుండా ఆవిడ అభిమానం ఆస్తి రూపంలో మీద్వారా నన్ను చేరుకోగలగడమూ ఆశ్చర్యమే! బహుశా ఆ కరణం గారీ విషయాన్ని చాలా గోప్యంగా ఉంచగలిగారనుకుంటాను. ఆయన వయసేమాత్రముంటుందో!"

రమణరావు ముఖంలో ప్రశ్నార్థకం స్పష్టంగా కనపడింది "తప్పకుండా యాభై ఏళ్ళకుపైగా వుంటుంది" అన్నాడు. మురళి కాసమాధానం రుచించలేదు.

అతనికి ఖచ్చితంగా తెలుసు. రామాయమ్మగారు హత్య కావించబడింది. కానీ ఆ హత్యవల్ల తనకు మినహాగా మరెవ్వరికీ ప్రయోజనం లేదు. అటువంటప్పుడీ హత్య ఎందుకు జరిగింది?

# 10

తల్లిని, చెల్లెలిని తీసుకొని ఆ రోజు మురళి సినిమా కెళ్ళాడు.

సినిమా హాల్లో,ఇంటర్వెల్లో ఎవరో భుజంతట్టి పిలిచారు మురళిని. వెనక్కి తిరిగాడు మురళి.

"ఒకసారి బయటకు వెడదాం వస్తారా?" అన్నాడు జ్యోతిష్కుడు. మురళి అతనితో మాట్లాడకుండా, వస్తానని చెల్లెలికి చెప్పి, బయటకు నడిచాడు.

సినిమాహాలు బయట ఆవరణలో ఇద్దరూ ఒకచోట ఆగారు.

"పాపం, రామాయమ్మగారు" అన్నాడు జ్యోతిష్కుడు పెదవి విరిచి.

"అవును. విన్నాను. కానీ, ఆవిడ ఎప్పుడు ఏ క్షణాన పోతారో హంతకుడికి తెలిసినంత ఖచ్చితంగా, మీకూ తెలుసు" అన్నాడు మురళి, హంతకుడన్న పదాన్ని నొక్కి పలుకుతూ.

"నిజమే. కానీ, ఆవిడ పోవడంద్వారా హత్యగురించి కూడా సందేహించ నవసరం లేనంత ఆస్తి మీకు కలిసిందని విన్నాను" అన్నాడు జ్యోతిష్కుడు హత్య అన్నపదాన్ని నొక్కిపలుకుతూ.

మురళి గతుక్కుమన్నాడు. జ్యోతిష్కుడి ఉద్దేశ్యమతని కర్థం కాలేదు. అతను తీక్షణంగా జ్యోతిష్కుడి వంక చూసి, "ఇంకా ఎంతమంది చావులగురించి జోస్యం చెప్పదల్చుకున్నారు?" అనడిగేడు.

"అది మీ ప్రవర్తనమీద ఆధారపడి వుంది" అన్నాడు జ్యోతిష్కుడు.

"అంటే?"

"ఏమీ లేదు. నేను మీ కెన్నో మంచి జోస్యాలు చెప్పాను. అందుకు నాకు ప్రతిఫలం కావాలంటే ఇస్తారా?"

"నేను మిమ్మల్ని జోస్యం చెప్పమని అడగలేదు. ఐనా మీరు చెప్పారు. దానికి నేనేం చేసేది?"

జ్యోతిష్కుడు నవ్వాడు. "ఈ ప్రపంచంలో ప్రతి ఒక్కరికీ జరుగబోయేది తెలుసుకోవాలనుంటుంది. అందు గురించే అందరూ తహతహలాడుతూంటారు. జరుగబోయేది ఖచ్చితంగా చెప్పగలగడం ఎంతోమందికి సాధ్యపడదు. అందుకు ఎంతో అనుభవం కావాలి. శ్రమకూడా వుంటుంది. అనుభవం, శ్రమ రెండూ ఉపయోగించి నేను మీకు జోస్యం చెప్పాను. అందువల్ల కొన్ని విషయాలు మీకు ముందుగానే తెలిశాయి. కొంతమంది చావులగురించి మీకు ముందుగానే తెలిసింది. నా జోస్యం తప్పదని అనుభవ పూర్వకంగా మీరు తెలుసుకున్నారు. అయినప్పటికీ విని ఉపేక్షించి ఊరుకున్నారు. అంటే అర్థమేమిటి? చని పోయిన వ్యక్తులను రక్షించే ఉద్దేశ్యం మీకు లేదనేగా?"

మురళి ఉలిక్కిపడి, "వాళ్ళను నేనెందుకు రక్షించాలి?" అన్నాడు.

"చాలా బాగా అడిగారు. వాళ్ళని మీరెందుకు రక్షించాలి? అందులోనూ వాళ్ళ చావువల్ల మీకు లాభం చేకూరుతున్నప్పుడు.....!" అన్నాడు జ్యోతిష్కుడు.

"నా ఉద్దేశ్యమది కాదు" అన్నాడు మురళి తడ బడుతూ. "నా మానాన నేను బ్రతుకుతున్నాను. ఎవరో చెప్పిన మాటలు విని రక్షించడానికి, పరుగెత్తడానికి నాకు సమయమూ లేదు, నేను పోలీసు అధికారినీ కాను."

"రక్షించాలనుకుంటే ఇవేమీ అవసరంలేదు. ఒక చిన్న హెచ్చరిక—చాలు. వాళ్ళు జాగ్రత్తపడి వుండేవారు."

మురళికి జవాబు తోచలేదు.

"మీ భయం నాకు తెలుసు. మీరు హెచ్చరిక పంపితే అనవసరంగా మీ పేరు పోలీసుల దృష్టిలోకి వస్తుంది. ఎలాగూ మీరు నా జోస్యాన్ని బద్ధం చేయలేరు. పైగా పోలీసుల అనుమానం మీ మీదకు వస్తుంది. అందుకే గప్ చిప్‌గా ఊరుకున్నారు. మీరు చాలా పిరికివారు. కానీ, మీ పిరికితనానికి అర్థముంది. పోలీసు లసాధ్యులు. అతి చిన్నవిషయం బయటపడ్డా, అంతా మీ పీకకు చుట్టబెట్ట గలరు. నా సంగతి వేరు. నాకు పోలీసులంటే భయంలేదు. అయినా జోస్యం చెప్పాలని బ్రతికేవాణ్ణి, నాకు పోలీసు లంటే భయమెందుకు?"

ఏం మాట్లాడాలో మురళికి తోచలేదు. "ఇందాకా మీరేదో ప్రతిఫలం గురించి మాట్లాడేరు."

"ఆఁ అదే. మీరు గుర్తుచేసేక అడుగుదామని చూస్తున్నాను. ఇస్తారా చెప్పండి."

"అసలు మీకేం కావాలో చెప్పండి. దాన్నిబట్టి ఆలోచించాలి!"

"చాలా సింపుల్. మీ చేతుల్లో వున్నదే" అన్నాడు జ్యోతిష్కుడు.

"చెప్పండి" అన్నాడు మురళి భయంభయంగా.

"ఏమీ లేదు. మీ చెల్లెల్ని నాకిచ్చి పెళ్ళి చేయండి" అన్నాడు జ్యోతిష్కుడు.

"వ్వాట్" ఉలిక్కిపడ్డాడు మురళి.

ఇంటర్వెల్ పూర్తయినట్లుంది. హాల్లోంచి బెల్ మ్రోగింది.

''కంగారు పడకండి, నేను మా పెద్దవాళ్ళను తీసుకునే వస్తాను. మీకూ, నాకూ కులం సరిపోతుంది. గోత్రం ఒకటి కాదు. అన్నివిధాలా పెళ్ళికి అనుకూలం. ఆలోచించి చెప్పండి.''

మురళికి ఆలోచన తెగలేదు. హాల్లోంచి యింకోసారి బెల్ మ్రోగింది.

''ఆలోచిస్తూండండి, సినిమా అయ్యేక మళ్ళీ మాట్లాడుకుందాం'' అన్నాడు జ్యోతిష్కుడు.

ఇద్దరూ హాల్లో ప్రవేశించారు.

మురళి కింక సినిమా సరిగా బుర్రలోకి ఎక్కడంలేదు. జ్యోతిష్కుడు తమతో వియ్యమందా లనుకుంటున్నాడు. అతను చాలా ప్రమాదకరమైన వ్యక్తి. హంతకుడేమో కూడా! అటువంటి వ్యక్తికి ఇంట్లో బంధువుస్థానమివ్వడం ఊహాలోనే భయంకరంగా వుంది.

అమ్మలు చాలా అమాయకురాలు. జ్యోతిష్కుడి కామె నిచ్చి వివాహం చేయడం దారుణమైన అన్యాయమే అవుతుంది.

సినిమా నడుస్తున్నంతసేపూ జ్యోతిష్కుడి కెలా సమాధానం చెప్పాలా అని ఆలోచిస్తూనే వున్నాడు మురళి. సినిమా అయిపోయేక అతను తల్లినీ, చెల్లెలినీ రిక్షాలో ముందుగా ఇంటికి పంపేశాడు. జ్యోతిష్కుడతనికోసం రోడ్డుమీద ఎదురుచూస్తున్నాడు.

''ఆలోచించేరా?'' అనడిగేడతను మురళిని చూస్తూనే.

''ఆలోచించడాని కేముంది? నేను నిస్సహాయుణ్ణి. రెండ్రోజుల క్రితమే చెల్లాయికో సంబంధం సెటిల్ చేసేశాం!'' అన్నాడు మురళి బాధను నటిస్తూ.

"మిస్టర్ మురళీ, అన్నీ నాకు తెలుసు. మీరు మొన్న పెళ్ళిచూపులకు వచ్చినవారి దగ్గర్నుంచి ఉత్తరంకోసం ఎదురుచూస్తున్నారు. వాళ్ళు ఓకే అనే అవకాశాలు చాలా వున్నాయి. కానీ, మీరుకూడా ఓకే అంటే ఆపైన పెళ్ళికొడుకు విషయంలో నేను జోస్యం చెప్పేయాల్సి వుంటుంది" అన్నాడు జ్యోతిష్కుడు తీవ్రంగా.

"ఏమిటి మీర నేదిశ?" అన్నాడు మురళి భయంగా.

"తెలిసీ చెప్పకుండా ఎలా ఊరుకు నేది? మీ చెల్లెలు జాతకానికీ, మొన్న పెళ్ళిచూపులకొచ్చినతని జాతకానికీ సరిపడదు. పెళ్ళిముహూర్తం నిర్ణయించిన మూడోనాడు అతను మరణిస్తాడు. అతని ప్రాణాలు రక్షించాలనుకుంటే ఈ వివాహం ఆపాలి!" అన్నాడు జ్యోతిష్కుడు గంభీరంగా.

ఈసారి మురళి నిజంగా వణికిపోయాడు. ఏదో అర్థం కాని భయ మతన్నావహించింది. "మీ విషయంలో ఏ నిర్ణయమూ తీసుకోడానికి నాకు వ్యవధి కావాలి" అన్నాడు.

"ఎంతకాలమైనా ఆగుతాను. ఫరవాలేదు. కానీ..." జ్యోతిష్కుడు మాట పూర్తిచేయకుండా మురళి కళ్ళలోకి చూశాడు. మిగతా మాటలు అతని కళ్ళలో చూశాడు మురళి.

# 11

లలిత దగ్గర్నుంచి మురళికి ఉత్తరం వచ్చింది. అందులో విశేషాలేమీ వ్రాయలేదు. అర్జంటుగా అతన్ని బయల్దేరి రమ్మనమని వ్రాసిందామె.

మురళి మనసు కీడును శంకించింది. అతను తక్షణం

బయల్దేరి వాళ్ళ ఊరు వెళ్ళాడు.

మురళి వెళ్ళిన సమయానికి పట్టాభిరామయ్యగా రింట్లో లేరు. గుమ్మంలోనే లలిత ఎదురయిం దతనికి. మురళిని చూస్తూనే ఆమె ముఖం చేటంతయింది. "రా బావా, కూర్చో!" అందామె.

"అత్తయ్యేదీ?" అడిగే డతను.

"వంటింట్లో వుంది. నాన్న పనిమీద పొరుగూరు వెళ్ళారు. సాయంత్రానికి వస్తారు" అంది లలిత.

సోఫాలో చతికిలబడ్డాడు మురళి.

"ఏమిటి సంగతి?" అడిగాడు మురళి.

లలిత పరిస్థితులు వివరించింది. తండ్రి ఆమెకు వేరే సంబంధాలు చూస్తున్నాడు. ఇటీవలే ఒక సంబంధం వచ్చింది. అది పట్టాభిరామయ్యగారికి బాగా నచ్చింది. త్వరలో తాంబూలా లుచ్చుకుందా మనుకుంటున్నా డాయన.

"చాలా పెద్ద ఇబ్బందిలో పడ్డాను బావా! నాన్నకు నీతో సంబంధం ఏమాత్రమూ ఇష్టంలేదు" అంది లలిత.

"ఈ సమస్యకు ఒక్కటే పరిష్కారం. మనస్ఫూర్తిగా నన్ను ప్రేమిస్తున్నావనుకుంటే నాతో వచ్చేసేయ్" అన్నాడు మురళి.

లలిత బాధగా నవ్వి, "ఒకప్పుడైతే ఆ పనే చేసివుండేదాన్ని. కానీ, ఇప్పుడు కుదరదు. నాన్నకు గుండెజబ్బుంది. ఆయన్నాట్టే ఆవేశపరచకూడదని డాక్టర్ చెప్పాడు. నేను నీతో వచ్చేస్తే, ఆ షాక్ కి ఆయనకేదైనా అయితే" అంది.

"నిజమే. ఆఖరు ప్రయత్నంగా మావయ్యతో మళ్ళీ మాట్లాడి చూస్తాను" అన్నాడు మురళి.

"అందుకే నీకు ఉత్తరం రాశాను. పెద్ద ఆశ లేకపోయినా మన ప్రయత్నాలు మనకుండాలనే ఉద్దేశ్యంతో..." అంటూ ఆలోచనలో పడిపోయింది లలిత.

ఆ సాయంత్రం పట్టాభిరామయ్యగారు వచ్చారు.

"ఏరా, యెప్పుడొచ్చావ్?" మురళిని పలకరించాడు.

"ఉదయం వచ్చేను మావయ్యా. ఏవో పనులుండీ ఊరు వచ్చాను. వచ్చేక నిన్నుకూడా చూసిపోదామని ఆగిపోయాను."

"అంతా కులాసానా?"

మురళి తలూపాడు. పట్టాభిరామయ్య, మురళి వంక పరీక్షగా చూసి నిట్టూర్చాడు. "లలితకు సంబంధం నిశ్చయం చేశాను. విన్నావా?" అనడిగేడు.

"విన్నాను మావయ్యా. కానీ, లలిత కిష్టం లేదటగా."

"ఏడిసింది. ఆ మాట పెళ్ళైన ఏడాదికక్కనిపిస్తే అడిగి చూడు" అన్నాడు పట్టాభిరామయ్య.

"ఏడాదిదాకా ఆగడమెందుకు మావయ్యా, ఇప్పుడే అడిగి చూడు. లలిత యెవరంటే యిష్టపడుతుందో!" అన్నాడు మురళి ధైర్యంచేసి.

పట్టాభిరామయ్య నవ్వాడు, "నాకు తెలుసురా, అన్నీ నాకు తెలుసు. కానీ, అలా జరగడం దేవుడి కిష్టంలేదు. అందుకే ఇల్లరికానికి నువ్వొప్పుకోలేదు."

"ఇల్లరికం రావడాని కిప్పుడు నాకేం తక్కువయింది మావయ్యా. దేవుడు కరుణించి, నాకూ ఆస్తి కలిసొచ్చింది. లలితను నాకిస్తే అన్నివిధాలా సుఖపడుతుంది."

"ఒరేయ్, లలితను చేసుకునేవాడికి వేరే ఆస్తి ఉండక్కర్లేదురా. దాన్ని చేసుకున్నవాడు ఆటోమేటిక్‌గా

ఆ స్తిపరుడైపోతాడు. ఆ సంగతి నీకూ తెలుసు'' అన్నాడు పట్టాభిరామయ్య.

''మరి...?''

''నాకు మీ నాన్న తెలుసురా! ఆయనగారి మనసు నిండా జాలి, కరుణలే. ఫలితంగా ఆస్థంతా హారతి కర్పూరంలా హరించుకుపోయి, ఈ స్థితికి వచ్చేరు. నీక్కూడా అన్నీ మీ నాన్న పోలికలే. అందుకే ఆ రామాయమ్మ ఆస్తి నీకిచ్చింది. మీలాంటివాళ్ళ చేతుల్లోకి సంపద వస్తే సుఖపడేది లలిత కాదురా—దరిద్రులు, ముష్టివెధవలు, ఎందుకూ పనికిరాని సోమరిపోతులు! పదిలక్షలను, పాతిక లక్షలు చేయాలని తాపత్రయపడే నాకూ, కన్నీళ్ళ గాథలు విని లక్షలను కరిగించుకునే మీకూ సరిపడదు. ఇల్లరికమంటే వేరు. అప్పుడీ ఆస్తి నీకు చెందదు. కేవలం దీనికి సంరక్షకుడివే అవుతావు.''

మురళికి పట్టాభిరామయ్యగారి అభిప్రాయం తెలిసిపోయింది. ''ఒకళ్ళకు మంచి చేయాలనుకోవడం తప్పవదు మావయ్యా. కానీ, తనకు మాలిన ధర్మానికి పోయేవాడిని కాదు నేను. నీ ఆస్తిని నీ ఇష్టం వచ్చినట్లు చేసుకో. నాకు చిల్లిగవ్వకూడా ఇవ్వకు. లలిత నా దగ్గర సుఖపడుతుందో, లేదో—నీకు కాలమే ఋజువు చేయగలదు.''

''లాభంలేదు. ఇల్లరికాన్ని కాదన్నరోజునే లలితను భార్యగా ఆలోచించే హక్కు కోల్పోయావు నువ్వు. ఈ విషయంలో ఇంక చర్చలకు తావులేదు.''

తను ఇల్లరికాన్ని కాదనడమే ఆయన లలితకు వేరే సంబంధాలు చూడ్డానికి కారణమని అతనికి అర్థమైంది.

ఆయన ఆవేశపడుతున్న ఛాయలు కనిపించి మరి మాట్లాడలేదు మురళి.

# 12

"నీకూ, లలితకూ వివాహం జరిగి తీరుతుంది."

ఆశ్చర్యంగా చూశాడు మురళి, జ్యోతిష్కుడి వంక.

"ఎలా?"

జ్యోతిష్కుడు నవ్వాడు. "మీ ఇద్దరి పెళ్ళికీ ఇటూ అటూ కూడా కలిపి ఒకేఒక ఆటంకముంది. ఆ ఆటంకం పేరు పట్టాభిరామయ్య. అవునా?"

తల ఊపాడు మురళి.

"జాతకాన్నిబట్టి చూస్తే ఆ ఆటంకానికి ఆయుష్షు లేదు" జ్యోతిష్కుడు ఆగాడు.

మురళి కంగారుగా అతని ముఖంలోకి చూశాడు.

"ఈ నెల ఇరవయ్యోదో తేదీన ఆయన పెళ్ళి తాంబూలాలు ఇచ్చుకోవాలని అనుకుంటున్నాడు. ఈ రోజు పదహారవ తేదీ. సరిగ్గా ఎల్లుండి అనగా పద్దెనిమిదవ తేదీ రాత్రి ఆయన మరణించబోతున్నారు."

మురళి ఉలిక్కిపడి, "ప్లీజ్, మావయ్యను హత్య చేయవద్దు" అన్నాడు.

"హత్యలు నేనెందుకు చేస్తాను. కేవలం జోస్యం చెప్పాను" అన్నాడు జ్యోతిష్కుడు తాపీగా.

"వద్దు. మీ జోస్యం నిజం కాకూడదు" అన్నాడు మురళి కంగారుగా.

జ్యోతిష్కుడు తీక్షణంగా మురళి కళ్ళలోకి చూశాడు. "నా జోస్యం అబద్ధం కాదు, కాలేదు. విధిని ఎదిరించడం ఎవరికీ సాధ్యంకాదు. జరుగబోయేది చెప్పగలను. కానీ, ఆపలేను."

ఒక్కక్షణం ఆగి, "తెలివి తక్కువగా ముందుగా

హెచ్చరించడానికి ప్రయత్నించవద్దు. అలా చేయడంవల్ల ఒక మామూలు చావును పోలీసులు హత్యగా పరిగణించే అవకాశముంది. అందువల్ల మొట్టమొదట పోలీసులు మిమ్మల్నే అనుమానిస్తారు. దాంతో మీ చరిత్రే బయట పడుతుంది. ఇటీవల మీ చరిత్ర నిండా మరణాలూ, అందు వల్ల లాభాలూ..." అన్నాడు.

"నిజం నిలకడమీద తెలుస్తుంది. నేను నిజంగా నిర్దోషిని. ఏ హత్యలూ చేయలేదు. అవన్నీ మీ కారణంగానే జరిగాయి. చిట్టచివరకు మీరు పట్టుబడక తప్పదు" అన్నాడు మురళి.

జ్యోతిష్కుడు చిత్రంగా మురళివంక చూశాడు' "ఏమిటి నాకు ఇంతవరకూ జరిగాయనుకుంటున్న హత్యలు చేయడంవల్ల ప్రయోజనం? మీకు డబ్బు చేరుతుంటే నాకేం ఒరిగింది! జరుగబోయేది నాకు తెలుస్తోంది కాబట్టీ, అందువల్ల మీకు ప్రయోజనముందని తెలుసును కాబట్టీ, నేను మీకు ముందుగా చెబుతాను. అందుకు మీరు నన్ను హంతకుడని భావిస్తే, మీ ఆలోచనల్లోని కల్మషత్వం బయటపడుతుంది, తప్పితే నేను హంతకుణ్ణి కాను."

మురళికూడా ఆశ్చర్యంగా జ్యోతిష్కుడి వంక చూసి, "నిజమే, ఏమిటి మీకు నావల్ల వున్న ప్రయోజనం?" అనడిగాడు.

"నాకు జ్యోతిషం వచ్చు. కానీ, అది మీకే చెబుతున్నానంటే కారణమేమిటి? నేను మీ చెల్లెల్ని ప్రేమించాను. ఆమె లేనిదే నేను బ్రతకలేను. కాబోయే బావగారనే ఉద్దేశ్యంతో మీకు శుభవార్తలు ముందుగా అందిస్తున్నాను."

మురళికి ఇంక వినాలనిపించలేదు. "తప్పకుండా అది కాదు. అంతకుమించిన ప్రయోజనమేదో మీ రాశిస్తున్నారు" అన్నాడు.

"మీ రెలాగనుకున్నా నా కభ్యంతరం లేదు. ప్రస్తుతానికి మీరు మీ మావయ్యకు రాబోయే చావుగురించి ఎవరికీ చెప్పకండి. మీ మనసులోనే వుంచుకోండి. గుర్తుంచుకోండి, పద్దెనిమిదవ తేదీ రాత్రి..."

# 13

లలిత అసహనంగా తనగదిలో అటూ ఇటూ పచార్లు చేస్తోంది. ఆ రోజు సినిమా కార్యక్రమముంది. సినిమాలకు వెళ్ళడం లలితకు కొత్తాకాదు, పెద్ద విశేషమూ కాదు. అయితే ఆ రోజు సినిమాకు పట్టాభిరామయ్యకూడా వస్తున్నాడు. అదే పెద్ద విశేషం!

వ్యాపార వ్యవహారాల్లో మునిగి తేలే పట్టాభిరామయ్యకు సినిమాలపట్ల చెప్పుకోదగ్గ ఆసక్తి లేదు. ఎప్పుడైనా చూసినా తెలిసినవా ళ్ళెవరితోనో అనుకోకుండా వెళ్ళి చూసివస్తాడు. అప్పుడైనా అంత ఆసక్తిగా చూడడు. తన స్నేహితుడితో వ్యాపారవిషయాలు మాట్లాడుతూంటాడు. సకుటుంబంగా సినిమాలు చూసిన సందర్భాలు బహు తక్కువ.

కాలేజీలో ఈ మధ్య ఉపన్యాసాల పోటీలో లలితకు మొదటి బహుమతి వచ్చింది. ఆ సందర్భంలో ఆమె తన స్నేహితురాళ్ళందరికీ పార్టీ చేసి సినిమాకు తీసుకెళ్ళింది. ఆ సినిమా లలితకు బాగా నచ్చింది. అది ఇంచుమించు పట్టాభిరామయ్యలాంటి వాడి కథ.

సినిమాలో పట్టాభిరామయ్య దుర్మార్గుడు కాదు. కానీ,

డబ్బుమనిషి. ఆయనకు బంధువులకన్నా, ఆత్మీయతకన్నా డబ్బు ముఖ్యం. లక్షలకు లక్షలు సంపాదిస్తున్నాడు. కానీ, జీవితంలో అసలైన సుఖమన్నది ఎరుగడు. తనెందుకు సంపాదిస్తున్నాడో, తన జీవితానికి అర్థమేమిటోనని ఆయన ఆలోచించే క్షణం వస్తుంది. అప్పుడే ఆయన జీవితమూ ముగుస్తుంది.

కథ చెప్పిన తీరు హృద్యంగా వుంది. సినిమా నీటుగా వుంది. ఇది తన తండ్రి చూసి తీరవలసిన చిత్రమని లలితకు తోచింది. అందువల్ల ఆమె తండ్రిని ఎలాగో అలా ఈ సినిమాకు తీసుకువెళ్ళాలని పట్టుబట్టింది. గత వారంరోజులుగా ప్రయత్నిస్తూ ఈ వేళ్టికి ఆయన్నొప్పించగలిగింది.

పట్టాభిరామయ్య సకుటుంబంగా సినిమాకు బయల్దేరాడు. పనివాళ్ళనందరినీ వెళ్ళిపొమ్మని, ఇంటికి తాళంపెట్టి మరీ సినిమాకు బయల్దేరాడు.

సినిమాహాల్లో దీపాలారిపోయాక లలిత తండ్రిని మరీ హెచ్చరించింది. సినిమా చాలా శ్రద్ధగా చూడమని. చిత్రంలోని ప్రతి సన్నివేశమూ అర్థవంతమైనదని మరీమరీ చెప్పింది. ఆ రోజు పట్టాభిరామయ్య ఉత్సాహంగా ఉన్నాడు. ఆయన సినిమాను శ్రద్ధగానే చూస్తున్నాడు.

ఇంటర్వల్ కావడానికి ఓ పావుగంటుందనగా ఎవరో పట్టాభిరామయ్య భుజం తట్టారు. వెనక్కు తిరిగాడాయన. చీకట్లో ముఖం సరిగ్గా తెలియలేదు.

"మీ కుర్చీ క్రిందగా పడున్నాయి. ఈ తాళాలు మీవేననుకుంటాను" అంటూ అతను ఓ తాళం చెవుల గుత్తిని ఆయనకు అందించాడు.

అప్రయత్నంగా పట్టాభిరామయ్య జేబులు తడుము

కున్నాడు. జేబులో తాళం చెవులు లేవు. చీకట్లో కూడా తన తాళంచెవుల గుత్తి గుర్తు పట్టాడు.

శ్రద్ధగా సినిమాను చూడడంలో గమనించలేదు ఎంత సేపటి నుంచి తన జేబులో తాళాలు లేవో—

పట్టాభిరామయ్యకు అనుమానం కలిగింది. తన తాళాల గుత్తి బరువైనది. క్రింద పడితే చప్పుడవాలి. ఆ చప్పుడు ఎంత ఆదమరపుగా ఉన్నా సరే తనకు వినపడి తీరుతుంది. అది క్రింద పడి ఉండడానికి వీల్లేదు. జేబులోంచి క్రింద పడకుండా కుర్చీ క్రింద కెలా వచ్చాయి తాళాలు?

అప్పుడే పట్టాభిరామయ్యకు మరో విషయం గుర్తుకొచ్చింది ఈ రోజు తాళాలు తన కూతురి దగ్గరుండాలి. తాళాలు అన్నీ బాధ్యతలూ నాకొదిలి పెట్టి మీరు జాగ్రత్తగా సినిమా చూడండి నాన్నా, అని చెప్పిందామె. తనకు సినిమా గురించి చెప్పాలన్న తాపత్రయంలో ఆమె సర్వమూ మరిచిపోయినట్లుంది.

"ఇంటి తాళాలు జాగ్రత్తగా ఉన్నాయా లలితా!" అడిగాడు పట్టాభిరామయ్యగారు.

"ఆఁ" అంటూ నడుం దగ్గర తడుముకుని ఉలిక్కి పడింది లలిత. ఆమె చటుక్కున లేవబోయింది. ఆమెను లేవకుండా ఆదిమి పట్టాడు పట్టాభిరామయ్య.

"కంగారు పడకు. రుమాలుకు కట్టి బొడ్లో దోపుకుంటే సరిపోయిందా. కాస్త జాగ్రత్తగా చూచుకోవద్దూ. సర దాకు నేనే నీ దగ్గర్నుంచి తీశాను. అయినా నీకు తెలియ లేదు" అన్నాడు పట్టాభిరామయ్య.

"భలేవారు నాన్నా ఎంత మంచి సినిమాలో ఉన్నా మీకు తాళాలమీదే దృష్టి పోదు" విసుక్కుంది లలిత.

పట్టాభిరామయ్యకు మరి సినిమామీద దృష్టి లేదు. ఇంటర్వెల్ అయేవరకూ ఆయన అసహనంగా హాల్లో కూర్చున్నాడు. కూతురి జాడ్లో ఉన్న తాళాలు చప్పుడు కాకుండా తన కుర్చీ క్రిందకు వచ్చాయి. అవి క్రింద పడ్డ వన్న మాటలు అసత్యం. ఎవరో వాటిని కాజేసి తన ఇంటికి వెళ్ళి అందినంత దోచుకుని తిరిగి తాళాల నిక్కడ పారేసి వుండాలి.

పట్టాభిరామయ్య ఇంకా ఆలోచిస్తున్నాడు. తన ఇల్లు మంచి సందడిగా ఉండే వీధిలో ఉంది. రాత్రి పది దాటినా వీధిలో జనం బాగా తిరుగుతుంటారు. ఎవరింటి కెవ రొచ్చారో పట్టించుకునే వారెవ్వరూ లేరు. ఇంట్లో పని వాళ్ళెవరూ లేరు. ఎవడైనా ఇంటి తాళాలు సంగ్రహించి దొంగలా ఇంట్లో ప్రవేశించి అందినవి తీసుకుని పోవచ్చు. ఎవ్వరూ అనుమానించరు.

నైట్ వాచ్ మన్ రాత్రి పదిగంటల ప్రాంతాల వచ్చి ఉదయం ఆరు గంటల వరకూ ఉంటాడు. ఇంట్లో ఇన ప్పెట్లో రొక్కం మూడు వేలుంది. పాతిక వేలు విలువ చేసే నగలున్నాయి. ప్రమాదాన్ని శంకించి తనాట్టే బ్యాంకులో ఉంచడు. చాలా వరకూ నగలు బ్యాంకు లాకర్సులో భద్రపరిచాడు.

ఇంటర్వెల్ కాగానే పట్టాభిరామయ్య లేచి లలితతో "నేనొక పది నిముషాలు ఆలశ్యంగా వస్తాను, కంగారు పడకు" అన్నాడు.

"ఎక్కడికెడుతున్నారు నాన్నా?" అంది లలిత.

"వచ్చేక చెబుతాను" అన్న ఆయన ముఖంలో ఆదు ర్దాను స్పష్టంగా చూడగలిగింది లలిత. కాని ఏం మాట్లాడ

లేదు. అంతవరకూ పట్టాభిరామయ్యకు అటూ ఇటూ కూర్చున్న లలిత, రాజేశ్వరమ్మలు పక్కపక్క సీట్లోకి మారారు.

"నాన్నమీద ఈ సినిమా ప్రభావమాత్రం ఉన్నట్లు లేదు. ఆయన మారతారేమోనన్న ఆశతో ఈ సినిమాకు తీసుకు వచ్చాను" అంది లలిత తల్లితో.

"అం పుట్టుకతో వచ్చిన బుద్ధి పుడకలతో కానీ పోదు లెద్దూ" అని నాల్కరుచుకుని లెంప వేసుకుంది రాజేశ్వరమ్మ.

## 14

పట్టాభిరామయ్య ఇంటి ముందు కారాపి దిగాడు. చెప్పుకోదగ్గ అనుమాన పరిస్థితులు ఇంటిముందు కనబడ లేదు. అయినా ఆయనకు ఆదుర్దాగా ఉంది. గబగబా గేటుతీసుకుని లోపల అడుగు పెట్టి వెళ్ళి ఇంటి తాళం తీశాడు. మధ్యహాల్లో లైటు వేశాడు.

ఇల్లు నీటుగా, నిర్మానుష్యంగా ఉంది.

అక్కణ్ణించి ఆయన ఇనప్పెట్టె ఉన్న గదిలోకి వెళ్ళాడు. అదే ఆయన పడక గది!

మనసులో దేవుణ్ణి స్మరించుకుని ఇనప్పెట్టె తలుపులు తీశాడు. ఎదురుగా రొక్కం కనబడింది. ఆత్రుతగా లెక్క పెట్టాడు, ఆయన గుండెలు వేగంగా కొట్టుకుంటున్నాయి. ఉండవలసిన దానికి ఒక్క రూపాయి కూడా తక్కువ కాలేదు. తర్వాత ఆయన నగలుంచే సొరుగు తీశాడు. ఈసారి ఆయన గుండెలు మరింత వేగంగా కొట్టుకున్నాయి. కానీ ఆయన అనుమానం నిరాధారమే అయింది. నగలు చెక్కు చెదరలేదు.

తేలిగ్గా నిట్టూర్చాడు పట్టాభిరామయ్య.

అప్పుడే ఆయనకు స్ఫురించింది. కూతురు తాళాలను బొడ్లో దోపుకుంది; తనకు కుడివైపున కూర్చుంది లలిత. ఎడమ వైపు బొడ్లో దోపుకుని ఉంటే క్రింద పడడంలో రుమాలు కారణంగా చప్పుడు కాస్త తక్కువగా అయుండ వచ్చు. తాళాలు తన సీటు క్రిందకు దగ్గర్లో పడే అవ కాశమూ ఉంది. అయినా వెనకాల కూర్చున్నవాడు లలిత సీటు క్రింద తాళాలు చూసి ఆడపిల్లను పలకరించడం బాగుండదనిపించి తన్ను పలకరించి తాళాలిచ్చి వుండ వచ్చు. ఏది ఏమైనప్పటికీ తన ఇంట్లో దొంగతనం జరగ లేదు.

పట్టాభిరామయ్య ఇనప్పెట్టె తలుపులు మూశాడు. తాళం వేసి లేచి నిలబడ్డాడు. ఆయన పడక గదిలో గోడ లకు చుట్టూ దేవుడి పటాలువ్నాయి. ఒక్కొక్క దేవుడి పటానికీ నమస్కరించుకుంటూ వస్తూ ఒక వైపుగా చూసి బ్రాన్పడిపోయాడు.

లయకారకుడైన పరమశివుడి పటం క్రింద ఒక కుర్చీలో ఒక భయంకరమైన ఆకారం కూర్చుని వుంది. పొడుగాటి జుట్టు వికృతమైన ముఖం నోట్లోంచి పొడుగుగా వచ్చిన రెండు కోరపళ్ళు. నిలువునా నల్లటి రోమాలు, నోట్లో సిగరెట్ పొగ గుప్పుగుప్పుమని వదుల్తోంది.

పట్టాభిరామయ్య తన్ను చూడగానే ఆ ఆకారం పైకి లేచి నిలబడింది.

పట్టాభిరామయ్య వణుకుతున్నాడు. ఆయన మెదడు పనిచేయడం మానేసింది. శరీరంనిండా అంతులేని భయం. ఆ ఆకారం నెమ్మదిగా మరో రెండడుగులు వేసింది.

పట్టాభిరామయ్య నోటమాట రాలేదు. ఆకారం మరో అడుగు వేసేలోగా ఆయన కుప్పలా కూలిపోయాడు.

ఆ ఆకారం పట్టాభిరామయ్యను సమీపించి అతని చేయి పట్టుకు చూసింది. సంతృప్తిగా తలాడించి ఆయన్ను ఎత్తుకుని మంచం మీద పడుకోబెట్టి భయాన్ని వ్యక్తపరుస్తూన్న ఆయన కంటి రెప్పలను మూసింది.

తర్వాత తన ముఖానికున్న మాస్కును తొలగించింది. ఒంటి మీద ఉన్న నల్లని రోమాలుగల దుస్తులను తీసింది. పాంటు జేబులో ఒక ప్లాస్టిక్ సంచీ తీసి దాంట్లో వీటిని ఉంచి అక్కణ్ణించి దొడ్డిదారిన బయటపడింది.

నీలం రంగు పాంటుమీద తెల్లషర్టు టక్ చేసుకుని ఒక లాంగ్ హైర్ యువకుడు పట్టాభిరామయ్య ఇంట్లోంచి బయటకు రావడాన్ని ఆ హడావుడి వీధిలో ఎవ్వరూ ప్రత్యేకంగా గమనించలేదు.

# 15

'గుండె జబ్బుకాదు లలితా ఒక హంతకుడు మీ నాన్నగారి ప్రాణాలు బలిగొన్నాడు.' అనుకున్నాడు మురళి బాధగా లలిత రాసిన ఉత్తరాన్ని మడిచి జేబులో పెట్టుకుంటూ.

అయితే అతనీ విషయాన్ని తన ప్రాణానికి ప్రాణంగా భావించే లలితవద్ద ఆమెను కలుసుకున్నప్పుడు కూడా బయట పెట్టలేదు.

పట్టాభిరామయ్య వ్యాపార బాధ్యతలు స్వీకరించవలసి రావడంతో మురళి ఉద్యోగాన్ని వదిలిపెట్టి తన మకాం లలితా వాళ్ళ నగరానికి మార్చవలసొచ్చింది. తన తెలివి తేటలలో రెండు, మూడు నెలలలోనే అతను అన్నీ ఆకళింపు చేసుకోగలిగాడు.

పట్టాభిరామయ్య ఆస్తినంతా రాజేశ్వరమ్మ పేరనే ఉంచి ఆమె తదనంతరం లలితకు చెందేలా వీలు వ్రాయించాడు. తను వారి ఆస్తికి కేవలం సంరక్షకుడిగా ఉండదల్చాడు. ఈ విషయంలో ఆస్తినంతా మురళి పేరుకు మార్చాలన్న లలిత, రాజేశ్వరమ్మల మాటలనతడు త్రోసిపుచ్చాడు.

"డబ్బు పాపిష్టిదత్తయ్యా అది నా మనసు నెలాగైనా మార్చవచ్చు. నేను మగవాడిని ఎలాగైనా సంపాదించగలను. మీరు ఆడవాళ్ళు కాబట్టి మీకు రక్షణ అవసరం" అన్నాడు మురళి.

"బ్రతికుండగా సాధించలేనిది చచ్చి సాధించారు మీ మామయ్య. నీ విషయంలో ఒకప్పుడాయన కోరినదిదే" అంది రాజేశ్వరమ్మ కళ్ళ నీళ్లు తుడుచుకుంటూ.

లలితకూ, మురళికీ వివాహం కావడానికిప్పుడు కేవలం ముహూర్తాలు మాత్రం అడ్డుగా నిలిచాయి.

ఒక రోజు మురళి బజార్లో ఉండగా "హాల్లో మురళీ!" అన్న పరిచితమైన కంఠం వినపడింది. అటు తిరిగిన మురళికి జ్యోతిష్కుడు కనబడ్డాడు.

మురళి అతన్ని చూస్తూనే భయపడ్డాడు. అతను కనబడినప్పుడల్లా ఎవరో చావు గురించి జోశ్యం చెప్పడమూ జరుగుతోంది. ఈ పర్యాయం అతనింకెవరి చావు గురించి చెప్పదల్చుకున్నాడో అని భయపడ్డాడు మురళి.

"పాపం మీ మావయ్య గుండె జబ్బుతో పోయారటగా" అన్నాడు జ్యోతిష్కుడు పలకరింపుగా.

"అవునట" అన్నాడు మురళి ముక్తసరిగా.

"మిస్టర్ మురళి మీకిప్పుడే రకమైన ఇబ్బందీ లేదు,

ఇంకా మీ చెల్లెలి వివాహాన్ని వాయిదా వేయడం ఒక మంచి అన్న లక్షణం కాదు'' అన్నాడు ఏ ఉపోద్ఘాతమూ లేకుండా.

మురళి నవ్వి ఊరుకున్నాడు.

జ్యోతిష్కుడు మురళివంక చూసి ''ఒక తేదీ చెప్పండి పిల్లని చూసుకుందుకు నాన్నగారితోపాటు బయల్దేరివస్తాను'' అన్నాడు.

''అయ్యామ్ సారీ మిస్టర్ — మా చెల్లిల్ని మీకిచ్చే ఉద్దేశ్యం నాకులేదు'' అన్నాడు మురళి తాపీగా.

''ఎందువల్ల?''

''అది ఒక మంచి అన్న లక్షణం కాదు కాబట్టి!'' మురళి మరింత తాపీగా.

జ్యోతిష్కుడి ముఖంలో రంగులు మారాయి ''డబ్బు మనిషికి బలాన్నివ్వగలదేమో — మనిషి ప్రాణాలను కాపాడలేదు'' అన్నాడు.

మురళి తీవ్రంగా జ్యోతిష్కుడి వంక చూశాడు ''నా ముఖంలోకి చూసి చెప్పండి. మీ జ్యోతిషం ప్రతిభ నేను అనుభవపూర్వకంగా తెలుసుకున్నాను కాబట్టి అడుగుతున్నాను నేనింకా ఎంతకాలం బ్రతుకుతాను?''

జ్యోతిష్కుడు క్షణంపాటు తడబడ్డాడు. తర్వాత నెమ్మదిగా ''మీ విషయంలో జోస్యం చెప్పడం నాకిష్టం లేదు. నా బావగారు పదికాలాల పాటు సుఖంగా జీవించాలన్నదే నా అభిమతం'' అన్నాడు.

''మీ అభిమతం తప్పక నెరవేర్తుంది మీరు నా చెల్లెలి ప్రసక్తి లేకుండా ఉంటే'' — అన్నాడు మురళి. జ్యోతిష్కుడు తన చెల్లిలిని వివాహం చేసుకొని, తనకు

చావు జోస్యం చెప్పడని నమ్మకం ఏమిటి? అందువలన అతనిని గట్టిగా ఎదిరించడానికే నిశ్చయించుకున్నాడు మురళి.

"పదండి పక్కనున్న పార్కులోకి పోయి మాట్లాడుకుందాం. మీతో చాలా మాట్లాడాలి" అన్నాడు జ్యోతిష్కుడు.

ఇద్దరూ పార్కులోకి వెళ్ళి కూర్చున్నాక జ్యోతిష్కుడు అన్నాడు "మీకు నేను చెప్పిన ప్రతి జోస్యమూ జరిగింది. ప్రతిదానివల్లనూ మీకు లాభించింది. ఆ విషయం మీరు గుర్తుంచుకోవాలి—"

"గుర్తుండడంవల్లనే కదా మా చెల్లెలు గొంతుకోయలేనంటున్నాను" అన్నాడు మురళి.

"నిస్వార్థ బుద్ధితో మీకు సహాయపడినందుకైనా మీరు నాకు మీ చెల్లెల్నిచ్చి వివాహం చేయాలనుకోవడం లేదు. ఇది చాలా" అన్నాడు జ్యోతిష్కుడు.

"నిస్వార్థ బుద్ధితో సహాయం చేస్తే మళ్ళీ నా చెల్లెల్ని పెళ్ళి చేసుకోవాలన్న స్వార్థమేమిటి?" తీవ్రంగా అడిగాడు మురళి.

జ్యోతిష్కుడు తమాషాగా నవ్వి "అది స్వార్థం కాదు. మిమ్మల్ని రక్షించాలన్న తాపత్రయత. మీ చెల్లెలికి వివాహమైన వారం రోజులకు మీకు మరణగండముంది. నా జీవితంలో బావగారికి శతాయుష్షుంది. మీ చెల్లెలి జాతకంకంటె నా జాతకం బలమైనది. ఆకారణంగా మీ ప్రాణగండం తీరుతుంది. మీ క్షేమం కోరేవాణ్ణి కాబట్టి ఈ వివాహం చేసుకోదల్చాను" అన్నాడు.

అతని మాటల్లోని సారాంశం మురళికి అర్థమైంది. అతను మాటలు కాదని తను బ్రతకలేడు.

"ఎన్నో హత్యలు తెలివిగా చేశారు మీరు. కానీ నన్ను మీరంత సులభంగా హతమార్చలేరు. ముందుగానే పోలీసుల రక్షణ కోరతాను నేను" అన్నాడు మురళి.

జ్యోతిష్కుడు నవ్వి "అయితే కంచే చేను మేస్తుందని మీకు తెలియదా?" అనడిగాడు.

మురళికి జ్యోతిష్కుడి మాటలు అర్థమైనట్లులేదు. అతను ప్రశ్నార్థకంగా జ్యోతిష్కుడి కళ్ళలోకి చూసి "కంచె చేను మేసే మాటయితే చేనుకు కంచె ఎందుకు?" అన్నాడు.

"అనవసరమనే నేను చెబుతున్నాను. నేను చెప్పిన ప్రాణగండం మీకు పోలీసుల ద్వారానే రానున్నది."

నమ్మలేనట్లు మురళి చూస్తూంగా జ్యోతిష్కుడు మళ్ళీ అన్నాడు -"సుధాకరరావు, రామాయమ్మ, పట్టాభి రామయ్యగార్లను మీరు పురిగొల్పిన కారణంగా, మీ కోరికపై, డబ్బాశతో నేను హత్య చేశాను. హత్య లెలా జరిగినదీ నేను వివరించగలను జ్యోతిష్కుణ్ణి కదా మరి— నేను స్వయంగా నేరాన్నంగీకరిస్తే పోలీసులు తప్పక నమ్ముతారు. ఎందుకంటే ఈ నాలుగు హత్యల వల్ల నాకేమీ ప్రయోజనం లేదు. అన్నింటివల్లా మీరు పూర్తి ప్రయోజనం పొందారు. నాలుగు హత్యలు ఒకదాని తర్వాత ఒకటిగా జరిగి ఒకే మనిషికి లాభించడం కాకతాళీయంగా జరిగిందంటే ఎవరు నమ్మగలరు?" జ్యోతిష్కుడు ఆగి ప్రశ్నార్థకంగా మురళివంక చూశాడు.

మురళికి ముచ్చెమటలు పోశాయి. ఇటువంటి ప్రమాదాన్ని తనూహించలేదు. జ్యోతిష్కుడు తన్ను హంతకుడిగా నిరూపించే పథకంలో ఉన్నట్లు అతనికి చూచా

యగా కూడా తోచలేదు. మీదుమిక్కిలి తనే జ్యోతిష్కుడిని బెదిరించవచ్చు ననుకున్నాడు. జ్యోతిష్కుడు హంతకుడని తనకు తెలుసు. కానీ కథ అడ్డం తిరిగింది.

“మీరెవరో నాకు తెలియదు. ధనలాభంకోసం నిండు ప్రాణాలు తీసే దుర్మార్గుణ్ణి కాదు నేను. నాకు ధనలాభాన్నాశించి మీరు మీకు సంబంధంలేని వారిని హత్యలు చేశారు. అందువల్లనే మీకేం ప్రయోజనం లేదంటున్నారు. అటువంటప్పుడు ఇదంతా ఎందుకు చేశారు? నావల్ల మీకు జరగవలసిన కార్యమేమిటి?” అన్నాడు మురళి దీనంగా.

“నేను మీ చెల్లెల్ని ప్రేమించాను. ఆమెను నాకిచ్చి పెళ్ళి చేయండి.”

“నేనూ నా చెల్లెలూ అత్యంత సామాన్యులం. ఆ స్త్రీ కోసం హంతకుణ్ణి కాలేను నేను. ఒక హంతకుడితో నూరేళ్ళ కాపురం నా చెల్లెలివల్లకాదు. కాబట్టి దయుంచి ఈ విషయంలో మమ్మల్ని క్షమించి వదిలిపెట్టేయండి” అన్నాడు మురళి.

జ్యోతిష్కుడి ముఖం గంభీరంగా అయిపోయింది—“మిస్టర్ మురళీ! మీరు సామాన్యులు కావచ్చు కానీ అమాయకులు కారు. చిన్న సంఘటన చెబుతాను. నాకు తెలిసిన ఒక ధనికుడు ఒక గొర్రెను కొన్నాడు. దాన్ని రోజూ బాగా మేపుతూ వచ్చాడు. అది తెగబలిసింది. ఒక రోజు ధనికుడు ఇంట్లో పార్టీ వచ్చింది. గొర్రెను సిద్ధం చేశారు. వంటవాడు కత్తినెత్తిన సమయానికి గొర్రె కట్లు తెంచుకుని పారిపోయింది. ధనికుడు దానికి పెట్టిన తిండి ప్రసాదించిన బలంలోనే అది అంత బలాన్ని సంపాదించగలిగింది. అప్పుడా ధనికుడేం చేస్తాడో చెప్పండి?” అన్నాడు.

జవాబు మురళికి తెలుసును. దాంతోపాటు జ్యోతిష్కుడి ఉద్దేశ్యమూ అర్థమయింది. మళ్ళీ జ్యోతిష్కుడే ప్రారంభించాడు. "నేను గొర్రెనించి మాంసాన్నాశించ లేదు. పాలు కోరుతున్నాను. న్యాయం కాదంటారా?"

మురళి ఆలోచనలో పడ్డాడు. ఏ పరిస్థితుల్లోనూ అమ్మల్ని దుర్మార్గుడికిచ్చి పెళ్ళి చేయరాదు. ఇతడి వద్ద అమ్మలెంతో కాలం జీవించదు.

"మిస్టర్ మురళీ! నాలో అపారమైన తెలివితేట లున్నాయి. వాటిని ఇన్సూరెన్సు ఏజంటుగా ఉపయోగిద్దామనుకున్నాను. మా నాన్నగారి ద్వారా నాకు రామాయమ్మగారు రాసిన వీలునామా వివరాలు తెలిసిన మీదట మీ గురించీ వాకబు చేశాను. సుధాకరరావువల్ల నాకేట్టే ప్రయోజనం కనపడలేదు. అప్పుడు నేను మిమ్మల్నెన్నుకున్నాను. అప్పట్నించి నా కార్యక్రమాలను క్రమంగా అమలులోకి తీసుకువచ్చాను. ప్రతి చావూ మీకు లాభించేదే. అందుకు కారణభూతుణ్ణి నే నన్న విషయం మీరు గ్రహించడంకోసమే ముందుగా ఆ విషయాలన్నీ చెబుతూ వచ్చాను.

"ఒక్క సుదర్శనం విషయంలో తప్పితే మిగతా విషయాల్లో నేను పెద్ద రిస్కు తీసుకోలేదు. అన్నీ అనుకున్న ప్రకారం అమలు జరుపగలిగాను. మీకు అంతులేని సంపద లభించింది. ఏ విధంగానూ ఎవ్వరూ అనుమానించలేనంత ఎలిబీ మీకుంది. ఏ విధంగానూ కూడా ఎవ్వరూ నన్నుమానించలేదు. హంతకులకూ నాకూ ఏ విధమైన సంబంధమూ లేదు. ఇంతవరకూ బాగానే ఉంది. మీరు కోరకుండా మీకు సంపదలిచ్చాను నేను. అందులో కొద్దిగానైనా

ఇచ్చే అభిప్రాయం మీకు లేదు—'' జ్యోతిష్కుడు ఆగాడు.

''నా చెల్లెలితో వివాహం తప్ప మరేదైనా అడగండి'' అన్నాడు మురళి ప్రాధేయపూర్వకంగా.

జ్యోతిష్కుడు కొద్ది క్షణాలు ఏమీ మాట్లాడలేదు.

''అడుగుతున్నాను: అయిదు లక్షలు...'' అన్నాడు జ్యోతిష్కుడు.

''అయిదు లక్షలా...?''.

''అవును, ఆశ్చర్యపోకండి. నేను అల్ప సంతోషిని. టెన్ పర్సంట్ అడిగాను. అవసరపడితే మీబోటిగాడు మరొకడికి జోస్యం చెప్పి డబ్బు సంపాదించుకోగలను'' అన్నాడు జ్యోతిష్కుడు.

''మీరు మళ్ళీమళ్ళీ నావెంట పడరని గ్యారంటీ ఏమిటి?'' అడిగాడు మురళి.

''నమ్మాలి. నమ్మక తప్పదు. హత్యల గురించి పోలీసులకు చెప్పడం నాకూ సరదా కాదు. అందువల్ల నాకూ శిక్ష పడుతుంది కదా! నా కష్టానికి కొంత ప్రతిఫలం మీదగ్గర్నుంచీ తీసుకుంటున్నాను. దీని తరువాత మన మింక ఒకళ్ళనొకళ్ళు చూసుకోము. నేను మరోలా కొత్త క్లయింటుని వెతుక్కుంటాను'' అన్నాడు జ్యోతిష్కుడు.

''రేపు మధ్యాహ్నం రెండు గంటలకు మీకు అయిదు లక్షలు క్యాష్ రూపంలో అందజేస్తాను'' అన్నాడు మురళి.

జ్యోతిష్కుడు తమాషాగా నవ్వాడు ''చూశారా— మీరెంత పెద్దవారైపోయారో! అయిదు లక్షలరూపాయలు క్యాషివ్వడానికి ఒక్క రోజు గడువు చాలు''ఒక్క క్షణం ఆగి ''ఈ పద్ధతి బాగుంది కదండీ! మీమీద కే విధమైన

అనుమానమూ రాని పరిస్థిల్లో మీ బంధువులు మరణించారు. అటు మరణానికి కారకుడికీ, ఇటు మీకూ కూడా లాభం చేకూరుస్తున్నారు. ఇది కేవలం నా స్వంత గ్రేట్ ఐడియా" అన్నాడు గర్వంగా.

మురళి సాలోచనగా తల పంకించి, "ఒక చిన్న మనవి. అయిదులక్షల రూపాయలూ మీ కిస్తాను. కానీ, అవి పోయినట్లు పోలీసు రిపోర్టిస్తాను, ఒకరోజు ఆగి. నోట్ల నంబర్లు మాత్రం పోలీసులకు తెలియజేయను. నా కాబోయే అర్ధాంగి దృష్టిలో నేరస్థుడిగా నిలబడకుండా వుండేందుకు నాకు తోచే ఉపాయ మిదే" అన్నాడు.

జ్యోతిష్కుడు క్షణమాత్రం ఆలోచించి, "మిమ్మల్ని నేను నమ్ముతున్నాను" అన్నాడు.

# 16

"నేను నమ్మలేను" అన్నాడు మురళి.

"నిజం, కావాలంటే నువ్వే అడుగు" అంది లలిత.

"అవసరం లేదులే. ఫోన్ పెట్టేసెయ్. మనం వెళ్ళి చూద్దాం" అన్నాడు మురళి.

నమ్మడం నిజంగానే కష్టంగా వుంది మురళికి. జ్యోతిష్కుడి శక్తిసామర్థ్యాలమీద అంతులేని నమ్మకముం దతనికి. అటువంటిది తన డబ్బు దొరికిందని పోలీస్ స్టేషన్ నించి ఫోన్ వస్తే నమ్మడం చాలా కష్టంగదా. అతనికి కాస్త భయంగావుంది కూడా. తను కావాలనే ఇలా చేయించాడని అత డనుమానిస్తే...

మురళి, లలిత పోలీస్ స్టేషనుకు వెళ్ళారు. అక్కడ కన పడ్డ దొంగను చూసి మురళి చాలా ఆశ్చర్యపడ్డాడు. ఆ దొంగ, జ్యోతిష్కుడు కాదు. "ఇతనా దొంగ?" అన్నాడు మురళి.

"దొంగ కాదు, హంతకుడు!" అన్నాడు పోలీసు ఇన్‌స్పెక్టర్.

ఆశ్చర్యపడ్డాడు మురళి.

కథంతా పూర్తిగా విన్నాక అతనికి జరిగినది తెలిసింది. జ్యోతిష్కుడి దగ్గర డబ్బుందని కనిపెట్టిన ఈ దొంగ, అతన్ని హత్యచేసి డబ్బుతో పారిపోతూ పోలీసులకు దొరికిపోయాడు. మురళి పోయిందని రిపోర్టిచ్చిన మొత్తమూ, ఈ మొత్తమూ సరిపోయిన కారణంగా డబ్బు మురళిదే అయుండాలని పోలీసులు నిర్ణయించారు. కానీ, ఇప్పుడతనా విషయాన్నింకాస్త దృఢంగా ఋజువు చేసుకోవాల్సుంది.

"ఒకే ఒక్క సాక్ష్యముంది" అన్నాడు మురళి.

"ఏమిటది?" అడిగాడు ఇన్‌స్పెక్టర్.

"నేనెప్పుడైనా నోట్ల కట్టలు రిసీవ్ చేసుకున్నప్పుడు, ప్రతి కట్ట పదమూడో నోటుమీద నా సంతకం పెడతాను. అది నా లక్కీ నెంబరు. ఆ విషయం రిపోర్టిచ్చినపుడు నాకు గుర్తులేదు. ఇప్పుడే గుర్తుకొచ్చింది" అన్నాడు మురళి.

పరీక్షించగా మురళి చెప్పినమాట నిజమేనని తేలింది' పోలీసుల స్వాధీనంలో వున్న వందరూపాయల నోట్లకట్ట అన్నింట్లోనూ పదమూడో నంబరు నోటుమీద మురళి సంతకముంది.

లలితతో కలిసి తిరిగి ఇంటికి వెడుతున్నప్పుడు మురళి గుండె బరువెక్కింది. పోలీసుస్టేషన్లో చూసిన గుండెల్లో కత్తి దిగబడివున్న జ్యోతిష్కుడి ఫొటో అతని గుండెలు పిండుతోంది.

జ్యోతిష్కుడు తన అదృష్టంకోసం హత్యలు చేశాడు. ఒకటి కాదు, రెండు కాదు—నాలుగు హత్యలు చేశాడు. ఫలితంగా అయిదులక్షలు తనసుంచి ఆశించాడు.

కానీ, విధి మరోలా తలచింది. అతను తననుంచి ఆ అయిదులక్షలనుకూడా విడదీయలేకపోయాడు. ఇప్పుడతను ఏ ప్రతిఫలమూ లేకుండా తనగురించి పాటుబడినట్లయింది.

ఎంతమంది చావులగురించో ముందుగా జోస్యం చెప్ప గలిగిన జ్యోతిష్కుడు, పాపం—తన చావుగురించి మాత్రం ముందుగా జోస్యం చెప్పకోలేకపోయాడు.

—: ఐ పో యిం ది :—

# అంతరిక్ష దొంగలు!

అజీజ్

"వీరు మిస్టర్ హెరాల్డ్ ఫిష్! పేరు విని ఈ పాటికి గ్రహించి వుంటారు. అమెరికన్ గూఢచారి శాఖ జనరల్ సెక్రటరీ వీరే! హి ఈజ్ మిస్టర్ రాజారెడ్డి" అంటూ మమ్మల్ని పరస్పరం పరిచయం జేసేడు ఎస్. బి. డైరెక్టర్ పినాకపాణి.

నాతో కరచాలనం జేసి, "ప్లీజ్. టేక్ యువర్ సీట్" అన్నాడు హెరాల్డ్ ఫిష్ కుర్చీ చూపిస్తూ.

కూర్చున్నాను.

అది ఢిల్లీలోని స్పెషల్ బ్రాంచ్ డైరెక్టర్ సీక్రెట్ ఆఫీస్. మద్రాసునించి బైలుదేరి ఢిల్లీ విమానాశ్రయంలో దిగగానే సరాసరి ఇక్కడికి వచ్చేను.

సిగిరెట్ డబ్బా నా ముందుకి తోస్తూ అన్నాడు పినాకపాణి. "మిస్టర్ రాజారెడ్డీ! మన ప్రభుత్వం అత్యంత విచిత్రమైన కొన్ని విషమపరిస్థితుల్లో ఇరుక్కోడంవల్ల మిమ్మల్ని ఉన్నపళంగా మద్రాసునించి ఇలా పిలిపించవలసి వచ్చింది!"

"అమెరికాలో వుండవలసిన హెరాల్డ్ ఫిష్‌గార్ని ఇక్కడ మీ ఆఫీసులో చూడగానే అనుకున్నాను పరిస్థితి తీవ్రమై వుంటుందని," అన్నాను టిన్‌లోంచి సిగరెట్ లాగుతూ.

"ఔను! వివరంగా చెబుతాను వినండి. పదిహేను రోజుల క్రితం మన అంతరిక్ష పరిశోధనా సంస్థ 'సేటెలైట్' అనే గూఢచారి ఉపగ్రహాన్ని అంతరిక్షంలోకి వదిలింది. అందులో అత్యంత శక్తివంతమైన కెమెరాలూ, టేప్ రికార్డర్లూ, ఇతర ఎలక్ట్రానిక్ పరికరాలూ అమర్చబడ్డాయి. నిజానికి అదొక స్పై రాకెట్ అని చెప్పాలి.

తొంభై నిమిషాల కొకసారి భూప్రదక్షిణ చేస్తూ ప్రపంచంలోని కొన్ని అత్యంత ముఖ్యమైన ప్రదేశాల ఫోటోలు తీస్తూ, సరిహద్దుల్లో మన శత్రుసైనిక గతివిధులు రికార్డ్ చేస్తూ, వాటన్నిటినీ ఓ పెద్ద ప్లాస్టిక్ కేప్సూల్లో సమీకరించి, వారానికి ఒకసారి పేరాచూట్ ద్వారా పోర్ట్ బ్లెయర్ ద్వీపానికి ఐదుమైళ్ళ దూరాన సముద్రంలో పడవెయ్యడం దాని పని.

చైనా, జపాన్, అమెరికా, రష్యా, ఫ్రాన్స్ దేశాలు కూడా గూఢచర్యంకోసం ఇటువంటి స్పోటింగ్, సేటెలైట్ ఉపగ్రహాలని అంతరిక్షంలోకి వదిలి రహస్యాలు సేకరిస్తున్నాయని అందరికీ తెలిసిన విషయమే.

మనదేశం వదిలిన మొదటి స్పైలెట్ ఇది! వారంరోజుల క్రితం నియమిత టైం ప్రకారం మన స్పైలెట్ ఉపగ్రహం, పేరాచూట్ ద్వారా రహస్యాలు సేకరించిన కేప్‌సూల్‌ని సముద్రంలో దింపింది. అంతకిముందే, మన నౌకాదళం బోట్స్ ఆ ప్రదేశాన్ని పదిమైళ్ళ వ్యాసంలో చుట్టు ముట్టి వున్నాయి.

పేరాచూట్ దిగగానే, కేప్‌సూల్‌ని రీసెర్చ్‌కోసం అంతరిక్ష పరిశోధనా సంస్థ లేబరేటరీలోకి తెచ్చి చూసిన మన సైంటిస్టులు దిగ్భ్రాంతి చెందేరు. కేప్‌సూల్లో వున్న ఫోటో ఫిల్ములూ, టేప్‌లూ అన్నీ వట్టివే!

ఫిల్ములు ఎటువంటి ఫోటోలూ తియ్యలేదు. టేప్‌లు ఎటువంటి శబ్దాలూ రికార్డ్ జెయ్యలేదు. అన్నీ ఏమై పోయేయి? ఎవ్వరు దొంగిలించేరు?'' అంటూ క్షణం ఆగేడు పినాకపాణి.

''బహుశా, స్పైలెట్‌లోని పరికరాలు సరిగ్గా పనిజెయ్యలేదేమో?'' అన్నాను నా సందేహాన్ని వ్యక్తంజేస్తూ.

పినాకపాణి తల విదిలించి, ''నో. నో. పరికరాలన్నీ సజావుగానే పనిజేస్తున్నాయి. కేప్‌సూల్ దిగిన మూడవ రోజు మన ప్రభుత్వానికి ఈ ఆకాశరామన్న ఉత్తరం అందింది, చూడండి!'' అంటూ ఓ ఫైల్ తెరిచి దాంట్లోంచి ఓ కాగితం తీసిచ్చేడు.

ఇంగ్లీషులో టైప్ జేసిన లెటర్ అది. చాలా జాగ్రత్తగా చదివేను. ''మీ స్పైలెట్ వదిలిన కేప్‌సూల్లో ఏ రహస్యాలైతే వుంటాయని మీరు ఆశపడ్డారో, ఆ ఫోటోలూ, టేప్‌లూ మా దగ్గిర సురక్షితంగా వున్నాయి. కావాలనుకుంటే, మీరు వాటిని తీసుకోవచ్చు. ధర, కోటి డాలర్లు!

ఈ బేరం మీకు నచ్చితే, రెండురోజుల్లోపల, న్యూయార్క్ టైమ్స్ దినపత్రికలో ఓ ప్రకటన జారీ జెయ్యాలి. రెండురోజుల్లో మీ అభిప్రాయం తెల్పకుంటే, ఆ రహస్యాలన్నీ వేరే దేశానికి అమ్మేస్తాం! ఆలోచించండి!''

అంతే. అంతకి మించి ఒకరి సంతకంగానీ, మరో వాక్యంగానీ లేవు. ఈ ఉత్తరం అందిన మరుక్షణం మన ప్రభుత్వంలో తీవ్ర సంచలనం బయలుదేరింది. భూమికి ఎన్నో వేల మైళ్ళదూరంలో, అంతరిక్షంలో తిరుగుతున్న శాటిలైట్ లోంచి, భూమ్మీద కంట్రోల్ రూం కన్నుగప్పి రహస్యాలు ఎవ్వరు దొంగిలించేరు? ఎలా దొంగిలించ గలిగేరు? ఇది సంభవమేనా?

మనదేశమే కాదు. అమెరికా, ఫ్రాన్స్, జపాన్, రష్యా, చైనాలుకూడా ఆ దొంగబారినించి తప్పించుకోలేక పోయేయి. అంతరిక్ష సైన్సులో ఎంతో ప్రగతి సాధించిన, కొమ్ములు తిరిగిన సైంటిస్టులని పోషిస్తున్న అమెరికావంటి మహాదేశాన్ని ఆ అంతరిక్ష దొంగలు నాలుగుసార్లు దోచుకున్నారు.

అమెరికా వదిలిన నాలుగు గూఢచారి గ్రహాలనించి ఇలాగే రహస్యాలు దొంగిలించబడ్డాయి. వాటిని సంపాదించడానికి అమెరికా ప్రభుత్వం కోట్లకు కోట్లు ఆ అంతరిక్ష దొంగలకి ముట్టజెప్పవలసి వచ్చింది.

అమెరికావారి అంచనా ప్రకారం, వారిలాగే చైనా ప్రభుత్వాన్ని రెండుసార్లూ, ఫ్రాన్స్‌ను ఒకసారీ, జపాన్‌ను మూడుసార్లూ, రష్యాను రెండుసార్లూ, ఆ అంతరిక్ష దొంగలు దోచుకున్నారు. ఆ దేశాల సైంటిస్టులకి ఈ మర్మం ఏమిటో అంతుబట్టక ఇప్పటికీ తికమక పడుతున్నారు.

ఏది ఏమైనా, ఆ దొంగలని ఒకవిధంగా అభినందించాలి. ఏ దేశానికి సంబంధించిన రహస్యాలైతే వాళ్ళు దొంగిలిస్తున్నారో, ముందు ఆ దేశంతోనే బేరం కుదుర్చుకుని, డబ్బు ముట్టేక రహస్యాలని యథాతథంగా అప్పజెబుతున్నారు. ఆయా దేశాలు విధిలేక, ఎటూ పాలుపోక పెద్ద పెద్ద మొత్తాలు యిచ్చి వాటిని కనుక్కుంటున్నారు. ఇప్పుడు మన వంతు వచ్చింది!

ఈ విషయం తెలియగానే మిస్టర్ హెరాల్డ్ ఫిష్ అమెరికానించి హుటాహుటిన యిక్కడికి వచ్చేరు. మన దేశం ఇంటర్నేషనల్ ఫ్లయింగ్ క్లబ్ మెంబర్ గనక, ఆ క్లబ్ మెంబర్లయిన అన్ని దేశాలూ దాదాపు అంతరిక్షదొంగల దోపిడీకి గురయ్యేయి గనక, వారికి మన ఈ క్లిష్టసమయంలో ఆదుకునే బాధ్యత వుంది.

ఆ అంతరిక్ష దొంగల కూపీ తియ్యడానికి అగ్రరాజ్యాల గూఢచారులెందరో ప్రపంచపు నాలుగుమూలలా వ్యాపించి వున్నారు. సైంటిస్టులు నిద్రాహారాలు మాని, గ్రహాలనించి రహస్యాలు ఎలా దొంగలించబడుతున్నాయో కనిపెట్టడంలో నిమగ్నమై వున్నారు. దురదృష్టవశాత్తు ఇంతవరకూ ఎటువంటి ఆచూకీ దొరకలేదు.

ఇంతలో తమలాగే మనదేశమూ ఈ సమస్యకి గురికావడంతో అమెరికా ప్రభుత్వానికి ఓ పథకం స్ఫురించింది. అంతరిక్ష దొంగలు మననించి కోరిన కోటి డాలర్లు అమెరికా ప్రభుత్వం ఇవ్వడానికి సిద్ధంగా వుంది.

ప్రభుత్వ ఉన్నతాధికార్లతోనూ, పాలకులతోనూ సంప్రదించేక ఓ నిర్ణయానికి వచ్చి, న్యూ టైమ్స్ దిన పత్రికలో మన ప్రభుత్వం వాళ్ళ కోరిక మన్నించినట్టు ప్రకటన జారీ జేశాం!

ఆ ప్రకటన వెలువడ్డ మరుసటిరోజు డబ్బు యెక్కడ, ఏ విధంగా అందజెయ్యాలో సూచిస్తూ, ఈ ఉత్తరం వచ్చింది చూడండి."

అంటూ ఫైల్లోంచి మరో కాగితం తీసి అందించేడు పినాకపాణి.

"భారతదేశంనించి నేరుగా మీ ప్రతినిధినో, లేక మొరాకో దేశంలోని మీ దౌత్యాధికారినో, మొరాకో రాజధాని రబాత్ పంపాలి.

ఆ వ్యక్తి సరిగ్గా ఈ నెల పద్నాల్గవ తేదీన సాయంత్రం ఆరుగంటలకి రబాత్ విమానాశ్రయంలోని ఎంక్వైరీ కౌంటర్ దగ్గర నిల్చోవాలి. అక్కడ అతనికి తెలియజెయ్యబడుతుంది, డబ్బు ఎక్కడ ఏ విధంగా ముట్టజెప్పాలో.

జాగ్రత్త! ఎటువంటి పిచ్చివేషాలు వేసినా, అతి తెలివికి పోయి మా ఆచూకీ తెలుసుకోడానికి ప్రయత్నించినా, మీ మనిషి నిర్దయగా చంపబడతాడు. అంతరిక్ష గ్రహాల నించే రహస్యాలు దొంగిలించే మేము ఎటువంటివాళ్ళమో మీకు వేరే చెప్పనవసరం లేదు!"

కాగితం మడిచి తిరిగి పినాకపాణి కిస్తూ, "నా ఊహ సరైనదైతే రబాత్ కు నేనే పంపబడుతున్నా ననుకుంటాను. మనకోసం అమెరికా ప్రభుత్వం అంత డబ్బు దేనికి ఖర్చు పెడుతోంది?" అడిగేను.

పినాకపాణి నవ్వాడు. "మీ సందేహం సహజమైనదే. రష్యా చైనాలు వ్యక్తిగతంగా, రాజకీయపరంగా ఒకరికొకరు బద్ధశత్రువులు. కానీ, ఆ అంతరిక్ష దొంగల్ని కనుక్కోడానికి ఆ రెండు దేశాలూ స్నేహపూర్వకంగా, కలిసికట్టుగా కృషిజేస్తున్నాయి.

రష్యా మన మిత్రరాజ్యం. మనం సహాయాన్ని గనక అర్థిస్తే రష్యా అన్నివిధాలా సహకరిస్తుం దనడంలో ఎటువంటి సందేహంలేదు. ప్రస్తుతం అంతరిక్ష దొంగలతో సంపర్కం వున్న దేశం మనదేశం కనక, అమెరికా మనల్ని అడ్డంపెట్టుకుని తెరవెనక వుండి ఆ దొంగల్ని పట్టుకోవాలని ఆశ పడుతున్నది. ఈ విధంగా మనదేశంతో చెలిమి కోరుతున్నది.''

•పూర్తయిన సిగరెట్‌ని ఏష్‌ట్రేలో నొక్కుతూ తలూపేను.

# 2

మొరాకో రాజధాని రబాత్ విమానాశ్రయం అదే!

ఏర్‌పోర్ట్‌లో విమానం దిగగానే లగేజ్‌లోంచి బ్రీఫ్ కేస్ అందుకుని స్టెప్స్ దిగి కిందికి వచ్చేను.

దేశ విదేశాల మనుషులతో, వచ్చేపోయే విమానాలతో విమానాశ్రయం సందడిగా వుంది. సగానికి పైగా అరబ్బులే కనిపిస్తున్నారు. రంగురంగుల రకరకాల విద్యుద్దీపాలతో విమానాశ్రయం భూతలస్వర్గంలా వెలిగిపోతోంది.

రిస్టువాచీ చూసుకున్నాను. ఆరుగంటలు!

రన్‌వే దాటి ప్లాట్‌ఫారం వేపు నడిచేను. కౌంటర్స్ మీది ప్లేట్స్ చెక్ జేసుకుంటూ వెళ్ళి ఎంక్వయిరీ కౌంటర్ దగ్గిర నిల్చున్నాను.

అక్కడో చేంతాడంత క్యూ నిల్చునుంది. పేసింజర్స్ ఒకరి తరవాత ఒకరు తమ సందేహాలూ, సమాచారాలూ కౌంటర్ క్లర్క్ నడిగి తెలుసుకుంటున్నారు.

బ్రీఫ్‌కేస్ కింద పెట్టి చుట్టూ కలయజూసేను. ఆ జన సమూహంలోనే ఎక్కడో అంతరిక్ష దొంగల ఏజెంట్ వుండివుంటాడు. అతని ధ్యాస నా మీదే వుండివుంటుంది.

నా బ్రీఫ్ కేస్‌లో కేవలం కొన్ని బట్టలూ, చిన్న సామాన్లూ తప్ప మరేమీ లేవు. కనీసం చిన్న ఆయుధం కూడా లేదు. ఈ మధ్య హైజాక్‌లు విపరీతం కావడంతో ప్రయాణీకుల దగ్గర ఎటువంటి ఆయుధాలూ వుండకూడదని అంతర్జాతీయ విమానయాన సంస్థ తీర్మానించింది.

ఏది దొరికినా, ఇక్కడి అమెరికన్, భారత దౌత్య కార్యాలయాల్లోనే దొరకాలి.

ఇంతకీ అంతరిక్ష దొంగలు నన్నిక్కడ దేనికి కాచుకో మన్నారు? నా తరవాతి ప్రోగ్రాం ఏమిటో వాళ్ళు యెలా తెలియజేస్తారు? ఎవరైనా వచ్చి ముఖాముఖి మాట్లాడతారా? లేక, మరేదైనా పద్ధతి ఉపయోగిస్తారా? ఎప్పుడే సంఘటన జరుగుతుందో అన్న క్యూరియాసిటీతో గుండె వేగంగా కొట్టుకుంటోంది.

సిగరెట్ కాల్చి కాస్త రిలాక్స్ అవాలని, కోటు జేబులో చెయ్యిపెట్టేను. సిగరెట్ కేస్‌తోబాటు వేళ్ళకి ఏదో కాగితం లాటిది తగలడంతో ఏమిటా అని తీసి చూసి నిర్ఘాంతబోయేను.

మడతపెట్టిన ఎరుపురంగు కాగితం!

ఎలా వచ్చింది?

గబగబ మడతవిప్పి చదివేను.

"ఇక్కణ్ణించి తిన్నగా కాసాబ్లాంకా జేరుకో. రేపు ఉదయం తొమ్మిది గంటలకి సహారా ఎడారిలో పడమటి దిశగా ప్రయాణం జెయ్. ఫారా అనే గ్రామం వస్తుంది. అక్కడే నీకు తెలియజెయ్యబడుతుంది, డబ్బు యెక్కడ యెప్పుడు తెచ్చివ్వాలో!"

కాగితం మడిచి జేబులో కుక్కేను.

అప్పుడు జ్ఞాపకం వచ్చింది. నేను విమానం దిగి, రన్ వే దాటి ప్లాట్ ఫాంలోకి వచ్చినప్పుడు, ఓ వ్యక్తి తల వంచుకుని హడావుడిగా నా పక్కనించి పోతూ ఢీ కొనడం, తరవాత క్షమాపణ చెప్పుకుని జనసమూహంలో కలిసిపోడం!

పొరబాటున ఢీకొన్నట్టు నటించి అతనే ఈ ఉత్తరం జేబులో వేసుంటాడు.

బ్రీఫ్ కేస్ అందుకుని, ఓ మూల కనిపిస్తున్న టెలిఫోన్ బూత్ లోకి నడిచేను. జేబులోంచి డైరీ తీసి, రబాత్ లో వున్న భారత, అమెరికన్ దౌత్య కార్యాలయాల ఫోన్ నెంబర్స్ మనసులో మననం జేసుకుని, కైన్స్ వేసి, ముందు భారత దౌత్య కార్యాలయానికి రింగ్ జేసేను.

నా గురించి చెప్పుకుని భారతదేశంనించి యిప్పుడే విమానం దిగినట్టూ టాక్సీలో బైలుదేరి అక్కడికి వస్తున్నట్టూ చెప్పి, తరవాత అమెరికన్ దౌత్య కార్యాలయానికి రింగ్ జేసేను. విమానాశ్రయంనించి భారత దౌత్య కార్యాలయానికి వెళుతున్నాననీ, సంప్రదింపులకోసం ఓ అధికారిని అక్కడికి పంపమనీ చెప్పి, బూత్ లోంచి బైట పడ్డాను.

టాక్సీ స్టాండ్ లో తళతళ మెరిసే నీలిరంగు ఇంపాలా టాక్సీలు బారులుదీరి నిల్చున్నాయి. డ్రైవర్ కి చిరునామా చెప్పి ఓ టాక్సీలో కూర్చున్నాను.

పదిహేను నిమిషాల్లో దౌత్య కార్యాలయం ముందు ఆపేడు డ్రైవర్. దిగి మీటర్ బిల్ పే జేసేను.

మన దౌత్య ప్రతినిధి బైట నిల్చుని నా కోసమే ఎదురు చూస్తున్నాడు కాబోలు, టాక్సీ దిగగానే సాదరంగా ఆహ్వానించి లోనికి తీసికెళ్ళేడు.

ఆఫీసులో అంతకుముందే అమెరికన్ ప్రతినిధి వచ్చి కూర్చునున్నాడు. నా ఐడెంటిఫికేషన్స్ చూపించి, వారితో అరగంట మాట్లాడేను. ఏర్‌పోర్ట్‌లో అంతరిక్ష దొంగలు పంపిన సందేశాన్ని చూపెట్టి, వెంటనే కాసాబ్లాంకా బైలుదేరాలనుకుంటున్నానని చెప్పేను.

ఓ ప్లిమత్ కారూ, కాసాబ్లాంకా వెళ్ళే రోడ్ మ్యాప్, అక్కడ నివసించే అమెరికన్ గూఢచారి డిక్స్ చిరునామా, నా పెర్సనల్ ఖర్చులకోసం కావలసిన కొన్ని మొరాకన్ డాలర్లూ తీసుకుని, రాత్రి ఎనిమిది గంటలకి అక్కణ్ణించి బైలుదేరేను.

# 3

మ్యాప్ సహాయంతో, ఎటువంటి రిస్క్ లేకుండా, రాత్రి పదిగంటలకి కాసాబ్లాంకా జేరుకున్నాను.

'బి' క్లాస్ సిటీ అది. ఎంక్వైరీ జేస్తూ ఆ నగరంలోని అత్యంత ఖరీదైన హోటల్ 'గోల్డ్ స్టార్' జేరుకున్నాను. ఓ సింగిల్ రూం బుక్ జేసుకుని, హోటల్ బాయ్ వెనక లిఫ్ట్‌లో పైకెళ్ళాను.

గదిలోకెళ్ళి పావుగంట తరవాత భోజనం పంపమని బాయ్‌కి చెప్పి, బట్టలు మార్చుకుని బాత్‌రూంలో దూరేను. పదిహేను నిమిషాల్లో స్నానం ముగించి, డ్రెస్ జేసుకుంటుండగా కాలింగ్ బెల్ మోగింది. వెళ్ళి తలుపు తెరిచేను.

భోజనపదార్థాలు అమర్చిన ట్రాలీ తోసుకుంటూ లోనికి వచ్చేడు బేరర్. గబగబ భోజనం కానిచ్చి టీపాయ్‌మీద ఫోన్ దగ్గరికి లాక్కున్నాను.

డైరీలో నోట్ జేసుకున్న అమెరికన్ గూఢచారి డిక్స్ ఫోన్ నెంబర్ రింగ్ జేసి రిసీవర్ అందుకున్నాను.

"ఎస్!" అవతలినించి తియ్యని స్త్రీ కంఠం వినిపించింది.

"డిక్సన్ వున్నారా?"

"ఉన్నారు. మీరెవ్వరు?"

"రబాత్ నించి వచ్చేను. ఆయన్ని అర్జంటుగా కలుసుకోవాలి. చాలా ముఖ్య విషయం! దయచేసి ఆయన్ని లైన్‌లోకి పిలుస్తారా?" అడిగేను సౌమ్యంగా.

"వెయిట్ ప్లీజ్!" అవతల నిశ్శబ్దం.

రెండు నిమిషాల తరవాత గంభీరమైన మగ కంఠం వినిపించింది.

"ఎస్! డిక్సన్ హియర్!"

"నేను! నల్ల చిరుతని!" అన్నాను.

"అలాగా! బోను తలుపు తెరిచేవుంది. రావచ్చు!"

అది మా మధ్య గుర్తుకోసం అమెరికన్ దౌత్య కార్యాలయం ఏర్పరచిన కోడ్ సిగ్నల్! రబాత్ నించి నేను బయలుదేరేటప్పుడే అమెరికన్ దౌత్యాధికారి డిక్సన్‌కి ట్రంక్ ఫోన్ చేసి నేను వస్తున్నట్టు చెప్పేడు.

"థాంక్యూ మిస్టర్ డిక్సన్! మిమ్మల్ని కలుసుకోవాలని చాలా కుతూహల పడుతున్నాను." అన్నాను.

"వెల్‌కమ్ మిస్టర్ రాజారెడ్డీ! వెల్‌కమ్ సూన్!" అంటూ తన నివాసస్థానానికి ఎలా రావాలో వివరించేడు డిక్సన్.

రిసీవర్ దించి లేచేను. గదికి లాక్ చేసి, లిఫ్ట్‌ద్వారా కిందికి చేరుకున్నాను. పార్కింగ్‌లో ఉన్న నా ప్లిమత్ కారెక్కి బయలుదేరేను. డిక్సన్ సూచనల ప్రకారం దారి చూసుకుంటూ, ఇరవై నిమిషాల్లో గమ్యం చేరుకున్నాను.

అదొక చిన్నసైజు మేడ. మెయిన్ గేటుమీద 'డిక్సన్

ఆటో మొబైల్స్, కమ్ ట్రావెలర్స్' అన్న పెద్ద సైన్ బోర్డ్ నియోన్ ట్యూబ్ కాంతిలో వెలిగిపోతోంది.

అతను పదేళ్ళనించీ, ఆ దేశంలో ఆటో మొబైల్ బిజినెస్ జేస్తున్నట్టు నటిస్తూ స్థిరనివాసం ఏర్పరచుకుని అమెరికన్ గూఢచారిగా పనిజేస్తున్నాడన్నమాట.

గేటు పక్కనే కారాపి దిగి లోనికి నడిచేను. తలుపు మూసి ఉంది. పక్కనే కాలింగ్ బటర్ నొక్కేను. లోన ఎక్కడో బెల్ మోగుతున్నట్టు శబ్దం లీలగా వినిపిస్తోంది.

రెండు నిమిషాల తరవాత, తలుపు తెరుచుకుంది.

ఎదురుగా, ఆ దేశపు పాశ్చాత్య దుస్తుల్లో నిల్చుని ఉన్న, అందమైన అరబ్ యువతి కనిపించే సరికి కాసేపు రెప్ప వెయ్యడం మరిచేను.

"రండి! డిక్సన్ పైన ఉన్నారు." అంది నవ్వుతూ.

లోన అడుగుపెట్టేను. కాళ్ళకింద మెత్తని తివాసీ. హాల్లోని వస్తువులూ, వాటిని అమర్చిన తీరూ చూస్తూంటే పాతకాలపు అరబ్ ఖలీఫాల నివాసాలు జ్ఞాపకం వస్తాయి.

హాలు పక్కన పైకి వెళ్ళడానికి మెట్లున్నాయి. ఆ యువతి తలుపు మూసి మెట్లవేపు నడిచింది. ఆమె నడకనీ, నడుస్తున్నప్పుడు లయగా కదిలే గుండ్రని పిరుదుల్నీ చూస్తూ అనుసరించేను. మెట్లగుండా పైకి జేరుకున్నాం. పైన తలుపు తెరిచి ఉన్న ఓ గదిలోకి వెళ్ళింది ఆ యువతి. నేనూ లోన అడుగు పెట్టేను.

"వెల్ కమ్, మిస్టర్ రాజారెడ్డీ!" అన్నాడు డిక్సన్.

చేతిలో విస్కీ గ్లాసుతో దిండుకి వీపు ఆనించి మంచం మీద పడుకునున్నాడు. అతని కుడికాలి మోకాలివరకూ ప్లాస్టర్ వేయబడుంది.

అతన్ని సమీపించి, "గ్లాడ్ టు మీట్ యూ, మిస్టర్

డిక్స్న!'' అన్నాను షేక్‌హాండ్ ఇస్తూ.

"ప్లీజ్, టేక్ యువర్ సీట్'' అన్నాడు.

మంచంపక్క వేసివున్న కుర్చీలో కూర్చున్నాను.

"హావ్ యూ ఎనీ డ్రింక్స్?''

"నో! ఐ డోంట్ లైకిట్!'' అన్నాను నవ్వుతూ.

"ఐ సీ, ఐతే మీ దేశంలోని కాఫీ, టీలాగే అరబ్ దేశాల్లో పేరుపొందిన భహువా అనే జ్యూస్ తాగి చూడండి'' అంటూ ఆ యువతివేపు తిరిగి, "నాకు మరో పెగ్ వాడ్కా విస్కీ, నా స్నేహితుడికి భహువా తీసుకురా!'' అన్నాడు.

ఆ యువతి తలూపి, హంసలా నడుస్తూ వెళ్ళిపోయింది.

"ఎవరీ అమ్మాయి?'' అడిగేను.

డిక్స్న నవ్వి, "నా సర్వెంట్!'' అన్నాడు.

"అప్సరసలని మరిపించే ఇంత అందమైన సర్వెంట్ దొరికిన మీరు నిజంగా అదృష్టవంతులు!''

డిక్స్న నవ్వి, "ఔను. సాధారణంగా అరబ్ యువతులు ఇలాగే వుంటారు. ఆర్థిక పరిస్థితులు బాగులేక, యెంతో అవసరం కలిగితే తప్ప అరబ్ స్త్రీలు ఒకరిదగ్గిర పనికి కుదరరు'' అన్నాడు.

ఇంతలో ఆ అమ్మాయి చెప్పినవస్తువులు ట్రేలో తెచ్చి టీపాయ్ మీదుంచి వెళ్ళిపోయింది.

చాక్లెట్ కలర్‌లో వున్న భహువా కప్పు అందుకుని, కాస్త సిప్ జేసి చూసేను. అంతవరకూ ఎరగని అద్భుతమైన రుచి! నిమిషంలో కప్పు ఖాళీజేసిపెట్టి జేబులోంచి అంతర్జాతీయ దొంగలు పంపిన ఉత్తరం తీసి డిక్స్న చేతికిస్తూ, అది ఎక్కడ ఎలా అందజెయ్యబడిందో వివరించేను.

డిక్స్న ఉత్తరాన్ని పూర్తిగా చదివి సాలోచనగా

తలూపుతూ, "డబ్బు లేకుండా మిమ్మల్ని రేపు సహారా ఎడారిలోకి రమ్మంటున్నారంటే, ఇందులో ఏదో కిటుకు వుంది!" అన్నాడు.

"నాకూ అలాగే తోస్తోంది. పోయినసారి మీ ఏజెంట్ జెప్సన్ని డబ్బుతో రమ్మన్నారు కదూ?" అడిగేను.

డిక్సన్ తలూపి, "ఔను. వాళ్ళు కోరిన మిలియన్ డాలర్లు బ్రీఫ్ కేస్‌లో పెట్టుకుని, దాన్ని ఇనప గొలుసుతో తన ఎడంచేతికి బేడీ వేసుకుని, ఇక్కణ్ణించి బైలుదేరేడు జెప్సన్. అంటే, ఆ తరవాత ఇంతవరకూ అతని జాడ లేదు.

నా కాలుకి దెబ్బ తగలకుండా వుండివుంటే, నేనూ జెప్సన్ వెనకే అతన్ని వెంబడిస్తూ వెళ్ళేవాణ్ణి. సరే, జరిగిందేదో జరిగిపోయింది. మీరేం భయపడకండి. సహారా ఎడారిలో మీరు దారి తప్పకుండా, ఎలాటి ఇబ్బందులకీ గురి కాకుండా మీ వెంట ఓ గైడ్‌ని పంపిస్తాను. ఎటొచ్చీ మీ రతన్ని చూసి భయపడకూడదు!" అన్నాడు.

"ఏం? అంత భయంకరంగా వుంటాడా?"

డిక్సన్ తలూపి, "ఈ మొరాకో దేశంలో 'తోరేగ్' అనే ఒక ఆదిమజాతి వుంది. శౌర్య పరాక్రమాలకీ, విశ్వాసానికీ వాళ్ళు పెట్టింది పేరు. మొరాకో అధునికంగా ఇంత డెవలప్ అయినా, ఆ జాతి మనుషులు ఇంకా తమ పూర్వ వేషభాషలని వదల్లేదు.

సాధారణంగా ఆ జాతి మగాళ్ళు ఆరడుగులకి తక్కువుండరు. ఆ హైట్‌కి తగ్గ వెడల్పాటి దృఢమైన శరీరాలని కలిగుంటారు. తలకి నల్లని తలపాగా చుట్టుకుని కేవలం కళ్ళు కనిపించేలా ముఖానికి నల్లముసుగు వేసుకుంటారు.

సహారా ఎడారి చూడదలచుకున్న ప్రతి విదేశీయుడి వెంటా ఆ జాతివాళ్ళే గైడ్‌ల రూపంలో వెళతారు. ఎడా

రిలో కొన్నిరకాల క్రూరమృగాలూ, విషసర్పాలూ నివసిస్తుంటాయి. వాటిని లొంగదీయడం, ఆ జాతివాళ్ళకి ఎడంచేతి పని.

ఒకవిధంగా వాళ్ళని గైడ్స్ అనే బదులు బాడీగార్డ్స్ అంటే బావుంటుంది. వెంట వచ్చినందుకు వాళ్ళకి ఫీజు రూపంలో కొంత డబ్బు చెల్లించవలసి వుంటుంది. నాకు తెలిసిన ఓ గైడ్ వున్నాడు. కాస్త ఇంగ్లీష్ మాట్లాడగలడు. అతన్ని మీ వెంట పంపిస్తాను'' అన్నాడు.

''థాంక్స్!'' అంటూ జేబులోంచి సిగరెట్ తీసి వెలిగించి, ''నా దగ్గిర రివాల్వర్ లేదు. దాని అవసరం ఎప్పుడైనా కలగవచ్చు. ఓ రివాల్వర్ ఏర్పాటు జెయ్యగలరా?'' అడిగేను.

''ష్యూర్!'' అంటూ పక్కనున్న చెక్కకర్ర లందుకుని మంచం దిగేడు డిక్స్.

కర్రల సాయంతో కుంటుకుంటూ ఓ మూల వున్న బీరువా దగ్గరికి నడిచి బీరువా తెరిచి, ''ఇలా రండి!'' అన్నాడు.

లేచి, అతన్ని సమీపించేను. బీరువా నిండా రకరకాల చిన్న పెద్ద ఆయుధాలున్నాయి. ''వీటిలో మీకేది కావాలో ఎన్నుకుని తీసికెళ్ళండి!'' అన్నాడు.

ఒక్కొక్కటే పరిశీలిస్తూ, సైలెన్సర్ బిగించిన ఓ రివాల్వర్ అందుకున్నాను. దాని తాలూకు రెండుమూడు బుల్లెట్ పాకెట్స్ తీసిచ్చేడు డిక్స్.

''ఈ కేసులో ఇంతవరకూ సాధించిన మీ ప్రోగ్రెస్ ఏమిటి?'' అడిగేను అసలు విషయం కదుపుతూ.

''ప్రోగ్రెస్ నిల్ అనే చెప్పాలి. తిరిగి తిరిగి, మళ్ళీ మొదటికే వస్తున్నాం. నా సర్వీసులో మొదటిసారి ఈ

కేసులో చేతులెత్తవలసి వస్తుందేమోనని భయం వేస్తోంది" అన్నాడు డిక్సన్.

"అంత జటిలమైన కేసా ఇది?"

"ఔను. జటిలమైనదే. ఆ అంతరిక్ష దొంగలెవ్వరో గానీ, ప్రపంచ సైంటిస్టులందర్నీ ముప్పుతిప్పలు పెట్టి మూడుచెరువుల నీళ్ళు తాగిస్తున్నారు.

మా ఉపగ్రహాలనించి వాళ్ళు దొంగిలించిన రహస్యాలు కొనుక్కోడానికి మా ప్రభుత్వం నాలుగుసార్లు పెద్ద మొత్తాలు చెల్లించవలసి వచ్చింది. మమ్మల్నే కాదు, ఆ దొంగలు ప్రతి దేశాన్నీ, సహారా ఎడారికి చేరువలో వున్న అరబ్ దేశాల్లోనే డబ్బు ముట్టజెప్పమని కోరుతున్నారు గనక, వాళ్ళ స్థావరం ఆ ఎడారిలోనే ఎక్కడో వుండి వుంటుందని, అంచనా. ఇంతవరకూ ఏమీ తేలలేదు.

ఇక ఆ అంతరిక్ష దొంగల విషయంలో నా వ్యక్తిగతాభిప్రాయం చెబుతాను వినండి. ప్రపంచంలోని ఐదు అగ్రరాజ్యాలనీ చిటికెనవేలుమీద ఆడిస్తున్న ఆ అంతరిక్ష దొంగల నాయకుడు సామాన్యుడు కాడు. అఖండ మేధా సంపత్తి కలవాడు. నిజం చెప్పాలంటే అతనొక మహా సైంటిస్ట్ అయివుంటాడు.

రెండు—వాళ్ళకొక పెద్ద ఆర్గనైజేషన్ వుండివుంటుంది. ఫ్లయింగ్ క్లబ్ సభ్య దేశాలన్నిట్లోనూ అతని ఏజెంట్స్ వుండివుంటారు. సహారా ఎడారిలో ఎక్కడో ఒకచోట అతని లేబరేటరీ వుండివుంటుంది. అందులో అతను సృష్టించిన, అత్యంత శక్తివంతమైన పరికరాలు వుండివుంటాయి.

అతనేదో కొత్తరకం టెలిమెట్రిక్ సిస్టమ్ కనిపెట్టి వుంటాడు. నవ్యరీతులలో కొన్ని ఎలక్ట్రానిక్ రిసీవర్లు సృష్టించి వుంటాడు. అంతరిక్షంలో తిరిగే మన ఉపగ్రహా

లోని ఎలక్ట్రానిక్ పరికరాలు కోడ్ సిగ్నల్స్ రూపంలో
వివరాలు రికార్డ్ జేస్తాయి. ఆ దొంగ సైంటిస్ట్ తను కని
పెట్టిన రిసీవర్ల ద్వారా భూమ్మీదే వుండి ఆ వివరాలని స్వీక
రించి తన పరికరాల్లో రికార్డ్ జేసుకుంటున్నాడు. ఇంకా స్త
స్పష్టంగా చెప్పాలంటే, మన ఉపగ్రహాల్లోని టేప్
రికార్డుల్లో ఆ రహస్యాలు రికార్డ్ కానివ్వకుండా, వాటిని
తనవైపు మళ్ళించుకుంటున్నా డన్నమాట!'' అన్నాడు
డిక్స్.

''సరే, అలాగే జరుగుతోం దనుకుందాం! అతను
కేవలం కోడ్ సిగ్నల్స్ని ఉపగ్రహాల్లో రికార్డ్ కానివ్వ
కుండా తనవేపు మళ్ళించుకోగలడు. కానీ, ఉపగ్రహాల్లో
అమర్చిన టెలివిజన్ కెమెరాలనించి ఫోటోలు యెలా
మాయం జేస్తున్నాడు?'' అడిగేను.

డిక్స్ నవ్వి, ''అదీ ఈ పద్ధతిలోనే జరగవచ్చుగా?
ఉపగ్రహాల్లో అమర్చిన కెమెరాల లెన్స్లు ఉపగ్రహాల
బైట వుంటాయి. ఫిల్మ్ కెమెరా లోపల వుండదు.
కెమెరా వెనకభాగంలో ప్రత్యేకంగా తయారుజేసిన ఒక
కేస్లో వుంటుంది.

లెన్స్ తను ఏదైతే చూస్తుందో ఆ దృశ్యాన్ని ఎల
క్ట్రిక్ సిగ్నల్ సహాయంతో వెనక ఫిల్మ్ వరకూ అంద
జేస్తుంది. పైన పేర్కొన్న విధంగానే ఆ దృశ్యాలని
ఫిల్మ్ వరకూ వెళ్ళనివ్వకుండా భూమివేపు మళ్ళించ బడు
తున్నాయి'' అన్నాడు.

''ఇలా జరగడం సంభవమేనా?''

''సంభవం గనకనే, అవి కాజెయ్యబడుతున్నాయి
మరి!''

నేను పలకలేదు. కాసేపు తీవ్రంగా ఆలోచించి అన్నాను.

"మీ తర్కం ఆమోదయోగ్యంగానే వుంది. మీరు చెప్పినట్టే జరుగుతోందనుకుంటే, ఆ సైంటిస్టు లాబ్‌లో శక్తివంతమైన రాడార్ వుండివుంటుంది. ఎంతో ఎత్తైన రాడార్ వుంటే తప్ప అంతరిక్షంలో తిరిగే ఉపగ్రహాల రహస్యాలు భూమ్మీదికి లాగడం అసంభవం!"

డిక్సన్ తలూపేడు.

"ఐతే, ఎడారిలో అతని స్థావరం ఎక్కడో కనుక్కోడం సులభమే కదా? మనదగ్గిర ఎంతో అధునాతనమైన శబ్దతరంగాలని పసిగట్టే పరికరాలున్నాయి. పైగా, అతని స్థావరంలో వుండే ఎత్తైన రాడార్, దూరంనించే కనిపిస్తుంది కదా?"

డిక్సన్ నవ్వి, "అటువంటి రహస్యమైన శబ్దతరంగాలని కనుక్కోడానికి మా సైంటిస్టులు నిర్విరామంగా కృషి చేస్తూనే వున్నారు. కాని, ఇంతవరకూ యెలాంటి కూపీ తియ్యలేకపోయేరు.

పోతే, మీరు చెప్పిన రాడార్ సంగతి—మా విమానాలూ, అరబ్ దేశాల విమానాలూ సహారా ఎడారిపైన గస్తీ తిరుగుతూ అటువంటి రాడార్ ఎక్కడైనా కనిపిస్తుందేమో కనుక్కోడానికి అహోరాత్రులు శ్రమించి విఫలమయ్యేయి" అన్నాడు.

## 4

డిక్సన్‌కు గుడ్‌నైట్ చెప్పి, సెలవు తీసుకుని హోటల్ చేరుకున్నాను. తలుపు మూసి, బట్టలు మార్చుకుని, స్లీపింగ్ గౌన్ తొడుక్కుంటూ పడుకోడానికి మంచంవేపు నడిచేను.

సరిగ్గా అదే సమయంలో మ్రోగింది టెలిఫోన్!

ఎవరా అని రిసీవర్ ఎత్తి, "ఎస్!" అన్నాను.

"రాజారెడ్డిగారేనా?" అవతలినించి అపరిచిత స్త్రీ కంఠం విని నివ్వెరబోయేను. వేళగాని వేళ, దేశంకాని దేశంలో ఒక అపరిచిత స్త్రీకి నా పేరెలా తెలుసు? నే నిక్కడున్నానని ఎలా తెలుసు?

చెప్పలేని ఆశ్చర్యంతో, "ఔను! మీ రెవ్వరు?" అడిగేను.

"చెబుతాను. నేను మిమ్మల్ని కలుసుకోవచ్చా?" ఆమె మాట్లాడే తీరు అమెరికన్‌లా వుంది.

"ఎప్పుడు?" అడిగేను.

"ఇప్పుడే!"

"మీ కంఠాన్ని పోల్చుకోలేక పోతున్నాను!"

"నిజమే! ఎందుకంటే, ఇంతకి ముందు మనం ఎక్కడా కలుసుకోలేదు!"

"ఐతే, మీ పరిచయం ఏమిటో చెప్పి, నా కుతూహలాన్ని దూరం జెయ్యండి."

"నా పరిచయాన్ని ఇలా ఫోన్‌లో గాక, ముఖాముఖి జేసుకుంటేనే బావుంటుం దనుకుంటాను."

"ఇంత రాత్రివేళ ఎక్కణ్ణించి మాట్లాడుతున్నారు?"

"ఇదే హోటల్లోని రూం నెంబర్ 110 నించి."

"అలాగా! ఐతే, రండి!"

"థాంక్యూ!"

పదినిమిషాల తరవాత తలుపుమీద టకటక చప్పుడైంది. రివాల్వర్ అందుకుని అటు నడిచేను.

ట్రిగ్గర్ మీద వేలు రెడీగా వుంచి గడియ లాగేను. ఎలాటి ప్రమాదాన్నీ మెడకి చుట్టుకోడం నా కిష్టంలేదు.

చటుక్కున తలుపు తెరిచి, రెక్క వెనక నక్కేను.

గదిలో అడుగుపెట్టిన ఆ అమెరికన్ యువతిని చూడ గానే, క్షణం రెప్పవెయ్యడం మరచిపోయేను.

ముప్పై అయిదేళ్ళుంటాయ్ యామెకి. భుజాలవరకూ కత్తిరించిన బంగారు రంగు జుత్తు, నీలి కళ్ళు, ఎర్రని పెదాలు. పాలరాతి గ్రీకు శిల్పాన్ని జ్ఞప్తికి తెచ్చే ఆ అందమైన అమెరికన్ రంభని యెక్కడా చూసిన గుర్తులేదు.

తలుపు వెనకనించి ఇవతలికి వచ్చిన నన్ను చూసి, "హాలో!" అంది.

మర్యాదకోసం తలూపి చిన్నగా నవ్వేను.

"మిమ్మల్ని కలుసుకోడానికి వచ్చే అతిథులకి యిలాగే స్వాగతం పలుకుతారా?" అడిగింది పిస్తోలువేపు చూపిస్తూ.

"నా గురించి మీకు పూర్తిగా తెలిసివుంటే, ఇదికూడా తెలిసి వుండాలి. నేను చేపట్టిన వృత్తిలో రవ్వంత పొరపాటు నా ప్రాణాలకే ముప్పు తెచ్చిపెడుతుందని!" అన్నాను గాన్ జేబులో పిస్తోలు వేసుకుంటూ.

ఆమె నవ్వి, "తెలుసు. అందుకే మీ కేర్ ఫుల్ మైండ్ ని అభినందిస్తున్నాను. ఐనా, నావంటి ఒక ఆడది మిమ్మల్నేం చెయ్యగలదు? నేను మీ శత్రువుని కాను!" అంది చనువుగా వెళ్ళి సోఫాలో కూర్చుంటూ.

"ఏమో, ఎవ్వరికి తెలుసు? ముందు మీరు నా శత్రువు కాదని నిరూపించాలి."

"ఎలా?"

"మీ పేరేమిటి?"

"నా పూర్తిపేరు గ్లోరియా లెబ్లిన్! అమెరికాలోని లెబ్లిన్ ఎలక్ట్రానిక్స్ పేరు మీరు వినే వుంటారు."

"ఔను. విన్నాను. అమెరికాలోని ప్రముఖ ఎలక్ట్రా

నిక్ సంస్థ అది. ఆ సంస్థ ముఖ్యమైన ప్రాజెక్ట్స్‌కోసం కావలసిన ఎలక్ట్రానిక్ పరికరాలు తయారుజేసి యిస్తుంది అమెరికన్ అంతరిక్ష కార్యకలాపాల్లోనూ ఆ సంస్థ ప్రముఖపాత్ర వహిస్తుంది. ఊఁ, ఐతే?''

ఆమె నవ్వి ''ఇంకా అర్థం కాలా? నా పేరు గ్లోరియా లెబ్లిన్!'' అంది మళ్ళీ.

క్షణం ఆలోచించి అన్నాడు ''ఓహో! ఐతే, మీరా సంస్థ అధిపతి మిస్టర్ లెబ్లిన్ కూతురని చెప్పాలను కుంటున్నారా?''

''కూతురు కాదు! భార్యని!!''

క్షణం నా నోటివెంట మాట పెగల్లేదు. ఆశ్చర్యంగా ఆమెని చూస్తుండిపోయేను.

''కొన్నాళ్ళ క్రితం మావారు పోయిన విషయం మీకు తెలిసే ఉంటుంది. ఇప్పుడు నేను విధవని!''

''ఆయన పోయిన విషయం నాకు తెలుసు. కానీ, డెభ్భై ఏళ్ళ మిస్టర్ లెబ్లిన్‌కు ఇంత అందమైన వయసులో ఉన్న భార్యకూడా ఉండేదని తెలీదు!'' అన్నాను సిగరెట్ అంటించి.

క్షణక్షణానికీ వ్యవహారం ఊహించని మలుపులు తిరుగు తోంది. గ్లోరియా నవ్వి ''మనిషి మనసు ఆరోగ్యంగా ఉండాలిగానీ, వయసుతో పనేమిటి? నేను వారితో ఆరేళ్ళు కాపరం జేసేను. ఒక యువక భర్తలాగే ఆయన నన్ను ప్రేమించేవారు. అన్ని అవసరాలూ తీర్చేవారు. నా పట్ల ఆయన అపార ప్రేమకు నిదర్శనం, ఆయన తరు వాత ఇప్పుడు లెబ్లిన్ ఎలక్ట్రానిక్స్ సంస్థకీ, కోట్ల ఆస్తికీ నేనే అధిపతిని!'' అంది.

"ఏం? ఆయనికి కొడుకులూ, కూతుళ్ళూ ఎవ్వరూ లేరా?"

"ఆయన మొదటి భార్యవల్ల కలిగిన కొడుకున్నాడు. గొప్ప మేధా సంపత్తి కలవాడు. ఎలక్ట్రానిక్ ఇంజనీరింగ్‌లో ఆ కుర్రాడితో సరితూగే వ్యక్తి పూర్తి అమెరికాలోనే లేడు. అంతటి మేధావి! కానీ, ఆ అబ్బాయికింకా మైనారిటీ తీరలేదు.

అందుకే నాథర్ తన వీలునామాలో కొడుక్కి మైనారిటీ తీరేవరకూ నన్ను గార్డియన్‌గా నియమించి పోయేరు. దీన్నిబట్టి ఆయనకి నామీద ఎంతటి నమ్మకం, విశ్వాసం వుందేదో మీరు ఊహించవచ్చు," అంది గ్లోరియా.

సాలోచనగా తలూపి, "మీ సవతికొడుకు పేరేమిటి?" అడిగేడు.

"ఫిడిల్ క్రాస్! వాడికింకా ఇరవై రెండేళ్ళే!"

"ఇంతకీ మీరీ కాసాబ్లాంకాలో ఈ హోటల్లో ఏం జేస్తున్నారు? నాతో ఏమిటి పని?"

"చాలా ముఖ్యమైన పనే! కేవలం మిమ్మల్ని కలుసుకోడానికే ఇక్కడికి వచ్చాను. ఈ రాత్రి ఏడు గంటల ప్రాంతంలో నా ప్రైవేట్ విమానంలో బైలుదేరి రబాత్ విమానాశ్రయంలో దిగేను. అక్కణ్ణించి అమెరికన్ దౌత్య కార్యాలయానికి ఫోన్ జేసి కనుక్కుంటే, మీగురించి తెలిసింది. వెంటనే ఓ కిరాయి హెలికాప్టర్ తీసుకుని ఇక్కడ దిగేను."

"మీరు చెప్పేవన్నీ నిజమేనని, ఐమాన్ లెబ్లిన్ భార్య మిసెస్ గ్లోరియా లెబ్లిన్ మీరే అని ఏమిటి నమ్మకం?"

గ్లోరియా ఈసారి కాస్త గట్టిగా నవ్వి "చూపిస్తాను" అంటూ వేసుకున్న ఖరీదైన గౌన్ బాడీలోకి చెయ్యి

పోనిచ్చింది.

అప్పుడు చూసేను. ఆమె తెల్లని గుండ్రని ఎత్తైన బంతుల్ని.

బాడీ లోపల చిన్నసైజు లేడీస్ రివాల్వర్ పెట్టుకుందేమో? అది తీస్తుందేమో? అన్న అనుమానం మెరుపులా రావడంతో నేనూ నా కుడిచేతిని స్లీపింగ్ గౌన్ జేబు దగ్గర రెడీగా పెట్టుకున్నాను.

ఆమె చేతిలో ఓ గులాబీరంగు కవరుంది.

"దీన్ని చూడండి. అప్పుడైనా మీకు నా మీద నమ్మకం కుదరవచ్చు." అంది కవర్ని ముందుకు చాస్తూ.

అందుకుని తెరిచేను. లోపల తెల్లని కాగితం కనిపించింది. తీసి మడత విప్పేను.

పావుతావు సైజు కాగితం అది. పైన అమెరికా ప్రభుత్వపు ప్రింటెడ్ స్టాంప్ ఉంది. పెన్‌తో ఇంగ్లీషులో విడివిడిగా రాసిన ఉత్తరం అది. కింద సంతకం చూసి నివ్వెరబోయేను. అది అమెరికా ఇంటెలిజెన్స్ శాఖ జనరల్ సెక్రెటరీ హెరాల్డ్ ఫిప్‌ది!

ఉత్తరం నా పేరనే ఉంది. గబగబ చదవసాగేను.

"మైడియర్ రాజారెడ్డి!

మా దేశంలోని లెబ్లిన్ ఎలక్ట్రానిక్ సంస్థ యజమానురాలు, స్వర్గీయ మిస్టర్ లెబ్లిన్ సతీమణి, మిసెస్ గ్లోరియా లెబ్లిన్ మిమ్మల్ని కలుసుకోడానికి కాసాబ్లాంకా వస్తోంది. ఆవిడ మీతో చెప్పబోయే విషయాలు చాలా ముఖ్యమైనవి. రహస్యమైనవి. మీరావిడతో స్నేహపూర్వకంగా సహాకరిస్తారని ఆశిస్తున్నాను.

ఇట్లు— హెరాల్డ్ ఫిప్"

సంతకం పక్కనే అమెరికన్ ఇంటెలిజన్స్ శాఖ తాలూకు ముద్ర ఉంది.

"సరే! ఇప్పుడు చెప్పండి! మీరు నాతో ఏం మాట్లాడ దలచుకున్నారు?" అడిగేను ఆమె కెదురుగా సోఫాలో కూర్చుంటూ.

"నాకు హెరాల్డ్ ఫివ్ ద్వారా తెలిసింది. అంతరిక్ష దొంగలు దోచుకున్న మీ తొలి ఉపగ్రహం తాలూ రహస్యాలని వాళ్ళకి డబ్బిచ్చి తీసుకురావడానికీ, వాళ్ళ ఆచూకి తెలుసుకోవడానికీ, మీరు పంపబడ్డారని!"

"ఇటువంటి సీక్రెట్ విషయాన్ని హెరాల్డ్ఫివ్ మీకు చెప్పారంటే, ఆయన జాగ్రత్త పాటించని వ్యక్తి అని పిస్తోంది!" అన్నాను సీరియస్‌గా.

"ఆయన సామాన్య వ్యక్తి కాదు. అమెరికన్ ఇంటలిజెన్స్ శాఖ జనరల్ సెక్రెటరీ. అటువంటి వ్యక్తి అంతటి సీక్రెట్ విషయం నాకు చెప్పాడంటే ఆయనకి నాపట్ల ఎంత నమ్మకం, విశ్వాసం ఉందో మీరే ఆలోచించండి. నేను మీకు హాని తలపెట్టడానికి రాలేదు. మీ సహాయం పొందడానికి వచ్చేను."

"ఎటువంటి సహాయం?"

"నా సవతి కొడుకు ఫిడేల్‌ని వెతకడానికి!"

"ఆ ఇరవై ఏళ్ళ యువకుణ్ణి ఎక్కడైనా మరిచి పోయేరా?" అన్నాను.

"ప్లీజ్! వేళాకోళంగా తీసుకోకండి. నేను చాలా సీరియస్ మూడ్‌లో ఉన్నాను. ప్రస్తుతం నేను లెబిన్ ఎలక్ట్రానిక్ సంస్థకీ, మిలియన్ డాలర్ల ఆస్తికీ ఏకైక అధిపతిని. మైనారిటీ తీరక ముందే ఫిడల్ నామారంనించి తప్పుకుంటే ఆ ఆస్తంతా నాకే చెందుతుంది కదా?

నా భర్త నా పట్ల ఏర్పరచుకున్న విశ్వాసాన్ని అటు వంటి ద్రోహ చింతనతో వమ్ము జెయ్యడం నాకిష్టం లేదు. పైగా, ఫిడిల్ ని నేను నా స్వంత కొడుకుగా మనసారా ప్రేమిస్తున్నాను.

వాడికి మైనారిటీ తీరగానే ఈ ఆస్తంతా వాడి చేతిలో పెట్టి నిశ్చింతంగా బ్రతకాలని ఉంది. నేను వాణ్ణి సవతి కొడుకులా ఎన్నడూ చూడలేదు!''

అంతవరకూ నవ్వుతో మాట్లాడిన ఆమె కళ్ళల్లో కన్నీటి ఛాయలు కనిపించేసరికి నేనూ గంభీరంగా మారి, ''మీ అబ్బాయి ఫిడిల్ ఏమైపోయేడు?'' అడిగేను.

''ఆరు నెలల క్రితం అకస్మాత్తుగా అంతర్ధానమై పోయేడు. మా ఎలక్ట్రానిక్ సంస్థలో, ఫిడిల్ కమ్యూని కేషన్ సెక్షన్ హెడ్ గా ఉండి, ఆ సెక్షన్ కార్యకలా పాలు చూసుకునేవాడు. ఎలక్ట్రానిక్ శాస్త్రంలో ఎంతో ఖ్యాతి నార్జించి దురదృష్టవశాత్తు సంవత్సరం క్రితం ఓ కారు దుర్ఘటనలో మరణించిన డాక్టర్ హెన్రిక్ తరు వాత, నా అబ్బాయే అంతటి వాడని పేరు పొందేడు. ఇప్పుడు వాడు ఊహించని విధంగా అంతర్ధానమైపోవ డంతో మా సంస్థ చెయ్యి తెగిపోయినట్లయింది!''

''ఎలా, ఎక్కడ మాయమయ్యేడు?''

''తెలీదు! మా పోలీస్ శాఖా, గూఢచారి విభాగం, ప్రైవేట్ డిటెక్టివ్ లూ నిద్రాహారాలు మాని అమెరికా అంతా గాలించారు. ఫలితం కనిపించలేదు. ఫిడిల్ ఎందుకు మాయమయ్యేడో, ఎలా మాయమయ్యేడో ఇంతవరకూ ఆచూకీ దొరకలేదు.''

నేను వెంటనే పలకలేదు. కాసేపు ఆలోచించి అన్నాను 'మీకు మీ అబ్బాయికీ ఎప్పుడైనా, ఏ విషయంలోనైనా

పోట్లాట జరిగిందా?"

గ్లోరియా తల విదిలించి "నో, నో! అలాంటిదేమీ జరగ లేదు. నేను ఏ ఒక్క రోజూ పల్లెత్తుమాట అని ఎరగను. అంతా వాడి ఇష్టప్రకారమే జరగనిచ్చేదాన్ని. ఏది కావల సినా క్షణాల్లో ఏర్పాట్లు జేసేదాన్ని.

అంత ప్రేమగా చూసుకుంటున్నా, వాడికి నా పట్ల సవతి తల్లి అనే అభిప్రాయం ఉండేది. ఆ ఆస్తంతా నేనే స్వాహా జేస్తాననుకునేవాడు. మనసు విప్పి నాతో మాట్లాడే వాడు కాదు!"

"దీన్ని బట్టి ఆలోచిస్తే ఫిడిల్ తనకు తానే ఏదేశాని కైగా వెళ్ళి పోయుంటాడనిపిస్తోంది!"

"నో.నో ఫిడిల్ మరో దేశంతో చేతులు కలిపి, తన మాతృదేశానికి ద్రోహం చేస్తాడని ఎట్టి పరిస్థితిలోనూ అనుకోను!"

"ఐతే, ఈ విషయంలో నేనేం జెయ్యగలను? మీ పోలీసులూ, గూఢచారులూ, ప్రైవేట్ డిటెక్టివ్ లూ కనుక్కోలేని వ్యక్తిని నేనొక్కణ్ణీ ఎక్కడని వెతకను?"

"నా భయమల్లా ఒక్కటే!"

"ఏమిటి?"

"అంతరిక్ష దొంగలతో చేతులు కలిపాడేమో అని!"

"ఈ అనుమానం మీ మనసులోకి ఎలా వచ్చింది?" అడిగేను ఆశ్చర్యంగా.

"ఎందుకంటే, వారం రోజుల క్రితం, ఫిడిల్ రాసిన 'ఉత్తరం నాకు అందింది!"

"వాట్?"

"ఔను. ఆ ఉత్తరం ఈ నగరం నించే పోస్ట్ జెయ్య బడింది."

"ఏమని రాసేడు?..

"మా ఎలక్ట్రానిక్ సంస్థ తాలూకు ఓ ప్రత్యేకమైన ఫైల్ కావాలని రాసేడు."

"ఆ ఫైల్లో ఏముంది?"

"నాకు తెలియదు. ఫిడిల్ అమెరికాలో ఉన్నప్పుడు సంస్థకోసం ఓ రీసెర్చ్ జేస్తుండే వాడు. దాని తాలూకు ఫైల్ అది! నాకు టెక్నికల్ భాష తెలీదు గనుక ఆ ఫైలులో ఏముందో చెప్పలేను!" అంది గ్లోరియా దిగులుగా.

"మీకు టెక్నికల్ భాష తెలీనప్పుడు అంత పెద్ద సంస్థ ఎలా నడపగలుగుతున్నారు?" అడిగేను ఆశ్చర్యంగా.

"నా మేనేజర్ల సహాయంతో. వాళ్ళ సహాయం గనక లేకుంటే నా గతి ఏమయ్యేదో ఆ భగవంతుడికి తెలియాలి. నా భర్త మరణానంతరం సంస్థకార్య భారమంతా వాళ్ళ చేతుల మీదే నడుస్తోంది. నాపని కేవలం సంతకాలు జెయ్యడం వరకే."

సిగరెట్ పూర్తయ్యే వరకూ నేను పలకలేదు.

తరవాత అన్నాను. "సరే! అన్ని విషయాలూ నాకు తెలిసిపోయేయి. ఇప్పుడు చెప్పండి, నానించి మీరేం కోరుతున్నారు?"

"నేను ఎట్టి పరిస్థితిలోనైనా సరే, నా కొడుకు ఫిడిల్ విషయం కనుక్కోవాలను కుంటున్నాను."

"అదృష్టవశాత్తూ అతను మీకు దొరికితే ఏం జేస్తారు"

"కాళ్ళావేళ్ళా పడి తిరిగి అమెరికా తీసికెళ్తాను!"

"ఒక వేళ నిజంగా అతనికి ఆ అంతరిక్షు దొంగలతో సంబంధం ఉండి ఉంటే?"

"ఐనా సరే, అతన్ని నావెంట తీసికెళ్ళి తీరతాను!"

"తీసికెళ్ళి, దేశద్రోహిగా విచారణ జరపమని మీ ప్రభుత్వానికప్పజెప్పాలనా?"

"నో, నో, అతని మీద ఎటువంటి విచారణ జరపబడదు. హెరాల్డ్ ఫిష్‌తో అన్ని విషయాలూ మాట్లాడే వచ్చేను. ఫిడిల్ కిప్పుడు ఇరవై రెండేళ్ళే, కాస్త కోపం, ఆవేశం జాస్తి! చిన్న వయసైనా, ఎలక్ట్రానిక్ ఇంజనీరింగ్‌లో అతన్ని మించిన వ్యక్తి ప్రస్తుతం అమెరికాలో లేదు.

అటువంటి జీనియస్ వ్యక్తి తప్పుదారిలో తన జీవితాన్ని పాడుచేసుకోవడం మా ప్రభుత్వానికి ఎంత మాత్రం ఇష్టం లేదు. అందుకే, అతని తప్పులని చిన్నతనపు చేష్టలుగా ఎంచి, క్షమాభిక్ష పెట్టడానికి మా ప్రభుత్వం సిద్ధంగా ఉంది!"

"మీరీ ఊరికి వచ్చేక ఇక్కడి మీ గూఢచారి డిక్సని కలిసేరా?"

"నో. నో. ఇంకా కలవలేదు."

"మీ అబ్బాయి కోరిన ఆ ఫైలు ఇప్పుడెక్కడుంది?"

"ఇక్కడే, నా గదిలోనే ఉంది."

"దాన్ని ఓమారు నాకు చూపిస్తారా?"

"తప్పకుండా! నేను మిమ్మల్ని నమ్ముతున్నాను. మీరు నన్ను నమ్మినా నమ్మకపోయినా ఫరవాలేదు."

"దయచేసి ఇప్పుడే ఆ ఫైల్ తెచ్చి నాకు చూపించడానికి మీకేమైనా అభ్యంతరం ఉందా?"

"నో! ఇప్పుడే పట్టుకొస్తానుండండి." అంటూ లేచి తలుపులు తెరుచుకుని వెళ్ళిపోయింది గ్లోరియా.

ఆమెతో జరిగిన సంభాషణ మరోసారి రివిజన్ జేసుకున్నాను.

పావుగంట తరువాత ఫైల్ పట్టుకుని, తలుపులు లాక్ జేసి వచ్చి సోఫాలో కూర్చుంది గ్లోరియా.

ఫైల్ తెరిచి దాంట్లో ఉన్న ఓ కేబినెట్ సైజు ఫోటో తీస్తూ—"ఫైల్ చూసేముందు ఈ ఫోటో ఒకసారి చూడండి!" అంది.

ఫోటో అందుకుని పరీక్షగా చూసేను.

అదొక గ్రూఫ్ ఫోటో. అందులో గ్లోరియా, తనభర్త లెబ్లిన్ ప్రక్కన కూర్చుంది. వారి వెనుక నలుగైదుగురు అమెరికా రాజకీయ నాయకులూ ఉన్నారు.

"అందులో కుడిపక్క చివర్న నిల్చుకున్న యువకుడే మా అబ్బాయి ఫిడిల్!" అంది గ్లోరియా.

నా దృష్టి ఆ యువకుడి మీద నిలిచింది. డార్క్ బ్లూ కలర్ సూటులో నిండుగా నవ్వుతూ చాలా స్మార్ట్‌గా కనిపిస్తున్నాడు.

ఫోటో తిరిగి ఆమెకిస్తూ "ఇప్పుడు నమ్ముతున్నాను మీరు నిజంగా మిసెస్ గ్లోరియా లెబ్లిన్ అని!" అన్నాను.

"థాంక్యూ!" అంటూ ఫైల్ ముందుకు చాచింది.

అందుకుని కవర్ మీది కొటేషన్ చదివేను.

'పెర్సనల్ రీసెర్చ్ ఫైల్' అని ఉంది.

సాలోచనగా తలూపుతూ ఫైల్ తెరిచి జాగ్రత్తగా పరిశీలించసాగాను. కొద్ది నిముషాల్లోనే గ్రహించేను, అది ఎలక్ట్రానిక్ థెరపీకి సంబంధించిన ఏదో రీసెర్చ్ మేటర్ అని.

"ఈ ఫైల్‌ని ఎక్కడ, ఏ విధంగా అందజెయ్యమని చెప్పేడు ఫిడిల్?"

"ఇంకా ఏమీ చెప్పలేదు. ఉత్తరంలో కేవలం ఈ ఫైల్ తీసుకుని సరాసరి కాసాబ్లాంక్ చేరమనీ, ఈ

హోటల్లో దిగమనీ రాసేడు. అతని ఆదేశానుసారం ఇక్కడికి వచ్చేను. ఇప్పుడతని తరవాత సందేశంకోసం ఎదురు చూస్తున్నాను.

అప్పుడే మీ సహాయం నాకు కావాలి. ఫిడేల్ ఈ ఫైల్ కోసం స్వయంగా వచ్చి నన్ను కలుసుకున్నా, లేదా నన్ను మరెక్కడికైనా రమ్మన్నా మీరు నా వెంట ఉండాలి!"

"ఆల్ రైట్! నేను మీకు సహాయపడటానికి సిద్ధంగా ఉన్నాను. ఈ ఫైల్‌ని ఈ రాత్రి నా దగ్గర వదలి వెళ్ళటానికి మీకేమైనా అభ్యంతరం ఉందా?"

"దేనికి?"

"రాత్రంతా ఈ ఫైల్‌ని ఓమారు స్టడీ జెయ్యాలను కుంటున్నాను!"

గ్లోరియా పలక లేదు. కాసేపు ఆలోచించి ఏమనుకుందో ఏమో, "ఆల్ రైట్! మీ దగ్గరే వుంచండి. నే వెళ్ళి కాస్త విశ్రాంతి తీసుకుంటాను. గుడ్ నైట్" అని వెళ్ళి పోయింది.

టీపాయ్‌మీది ఫోన్ దగ్గరికి లాక్కుని, రబాత్‌లోని భారత రాయబార కార్యాలయానికి రింగ్ జేసేను.

వెంటనే భారతదేశానికి మెసేజ్ పంపి, మద్రాసులో వున్న నా అసిస్టెంట్ దేవిడ్‌ని రేపు సాయంత్రంలోగా మొరాక్కో జేరే ఏర్పాట్లు చేయించమని చెప్పి, రిసీవర్ దించి తేలిగ్గా నిట్టూర్చేను. దేవిడ్ సహాయం లేనిదే నే నొక్కణ్ణీ ఈ కేసులో పనిజెయ్యలేననిపిస్తోంది.

గదితలుపు లాక్ జేసి వచ్చి, సోఫాలో కూర్చుని గ్లోరియా ఇచ్చివెళ్ళిన ఫైల్ తెరిచేను.

# 5

టెలిఫోన్ గణగణ మోగడంతో కోటు తొడుక్కుంటూ వెళ్ళి రిసీవర్ ఎత్తేను. "గుడ్ మార్నింగ్ సార్!" అవతల హోటల్ మేనేజర్ కంఠం వినిపించింది.

రిస్టువాచీ చూసుకున్నాను. ఉదయం ఎనిమిది గంటలు.

"గుడ్ మార్నింగ్! ఏమిటి?" అడిగేను.

"మీరు తోరీగ్ జాతి ఎడారి గైడ్ ని పిలిపించేరా?"

అప్పుడు జ్ఞాపకం వచ్చింది. రాత్రి డిక్సన్ నా వెంట ఓ గైడ్ ని పంపుతానన్న విషయం. "ఔను. అతను వచ్చేడా?" అడిగేను.

"ఔను. ఇప్పుడే వచ్చేడు. మీ గురించి అడిగితే ఫోన్ జేసి కనుక్కుంటానని నిల్చోబెట్టేను. గదికి పంపించమంటారా?"

"నో. నో. అతన్ని పోర్టికోలో నా కోసం వెయిట్ జెయ్యమనండి. తయారై ఇప్పుడే వస్తున్నాను."

"ఓ. కే!" అవతల క్లిక్ మంది.

సరిగ్గా అదే సమయంలో గదిలో కాలింగ్ బెల్ మోగింది. రిసీవర్ క్రెడిల్ జేసి వెళ్ళి తలుపు తెరిచేను.

గ్లోరియా లెబ్లన్!

"గుడ్ మార్నింగ్ మేడమ్. వెల్ కమ్" అన్నాను తలుపు కడ్డం తొలిగి.

"వెరి గుడ్ మార్నింగ్. హౌవ్ ఆర్ యూ?" అంటూ లోన అడుగుపెట్టింది.

"ఫైన్!" అన్నాను ఆమెని నఖశిఖ పర్యంతమూ పరీక్షిస్తూ.

రాత్రికంటే, ఆమె అందం ఇప్పుడు కాస్త పెరిగినట్టు తోచింది. బహుశా మేకప్‌లో ప్రత్యేకంగా శ్రద్ధ తీసుకుందేమో?

ఆమె ఫైల్ తిరిగి ఆమెకిస్తూ అడిగేను. "ఫిడిల్ నించి ఏదైనా సందేశం వచ్చిందా?"

"నొ. నో. ఇంకా రాలేదు. మీరెక్కడికి తయారౌతున్నారు?"

"అంతరిక్ష దొంగల ఆదేశానుసారం, నేను సహారా ఎడారిలో ప్రవేశించి, పడమటి దిక్కున ప్రయాణం చెయ్యాలి. ఫారా అనే గ్రామం వస్తుందిట. అక్కడ నాకు మరో సందేశం ఇవ్వబడుతుందిట" అన్నాను గుళ్ళు నిండిన పిస్తోలు జేబులో వేసుకుంటూ.

"ఐతే, నేనూ మీ వెంట వస్తాను" అంది గ్లోరియా ఉత్సాహంగా.

"మీరా!?" అన్నాను నోరు తెరిచి.

"ఏం రాకూడదా?"

"రెండో వ్యక్తిని వెంటబెట్టుకు వచ్చేనని తెలిస్తే వాళ్ళకి కోపం రావచ్చు. మీ వంటి అప్సరసని వాళ్ళు ఎత్తుకుపోకుండా ఊరుకుంటారని ఏమిటి గ్యారంటీ?" అన్నాను నవ్వుతూ.

గ్లోరియా పకపక నవ్వి, "జోకులు విసరడంలోనూ మీరు ఘటికులే ననిపిస్తోంది. బాల్యంనించీ సుఖజీవనానికి అలవాటుపడ్డ నాకు, ఎడ్వెంచర్స్ అంటే చాలా ఇష్టం. ఐనా, మీ వెంట యెవ్వర్నీ తీసుకురావద్దని వాళ్ళేమీ ఆంక్షలు పెట్టలేదుగా? నన్నూ తీసికెళ్ళండి, ప్లీజ్!" అంది ప్రాధేయపడుతూ.

"అలాంటి షరతులేవీ పెట్టలేదు కానీ, మీ వంటి సుకుమారి ఆ భయంకర ఎడారిలో, మండే ఎండలో ఎలా గడపగలదా అని ఆలోచిస్తున్నాను. చాలా ప్రమాదకర ప్రయాణం!"

"ప్రమాదం నా ఒక్కదానికేనా? మీకు లేదా? ఇద్దరం వెళితే ఒకరికొకరం తోడైనా వుంటాం! ప్లీజ్. కాదనకండి."

"నా వెంట ఓ ఎడారి గైడ్ వస్తున్నాడు. నా గురించి మీరేం ఖంగారు పడకండి."

"ఐతే ఇంకేం! ఆ గైడ్ మనిద్దర్నీ ప్రమాదాలనించి కాపాడ్తాడు. ఉండండి, ఇప్పుడే వస్తాను" అంటూ హడావుడిగా కదిలొంచి బైటికెళ్ళింది గ్లోరియా.

పది నిమిషాల్లోనే ఓ ఏర్ బ్యాగ్ చంకన తగిలించుకుని తిరిగివచ్చింది.

"అదేమిటి?" అడిగేను.

"ఎడారిలో మనకావలసిన డ్రైఫుడ్ టిన్స్ మొదలైన చిన్నచిన్న సామాన్లు" అంది.

ఇహ వదిలే ఘటం కాదనుకుని ఊరుకున్నాను. తలుపు లాక్ చేసి, ఇద్దరం కిందికెళ్ళేం.

"మీ గైడ్ బైట యెదురుచూస్తున్నాడు," అన్నాడు కౌంటర్ క్లర్కు.

తలూపి, పోర్టికో వేపు నడిచేను.

ఆ గైడ్‌ని చూడగానే గ్రహించేను. రాత్రి డిక్స్ అబద్ధం చెప్పలేదని. ఆరడుగుల రెండంగుళాల పొడుగు. ఆ పొడుక్కు తగ్గ వెడల్పాటి ఛాతీ. తలకి నల్లని తలపాగా చుట్టుకుని, దాని చివరి కొసని, కళ్ళుమాత్రం కనిపించేలా మొహానికి కప్పుకున్నాడు. పాదాలవరకూ వేలాడే తెల్లని

గౌన్. నడుంకి బెల్టులా చుట్టిన నల్లని లావుపాటి తాడు. ఆ తాడు చివర వేలాడుతున్న రెండు కుచ్చులు. కుడి భుజానికి సెవెన్ పాయింట్ సిక్స్ టూ రైఫిల్, యెడం భుజానికి ఆ రైఫిల్ తాలూకు బుల్లెట్స్ నిండిన తోలు పట్టా. ఇదీ అతని అవతారం!

నన్ను చూడగానే ముందుకి వచ్చి, "మిస్టర్ రాజారెడ్డి మీరే కదూ?" అన్నాడు.

కలూపేను.

"గుడ్ మార్నింగ్! మిమ్మల్ని కలుసుకోమని డిక్స్ పంపేడు" అన్నాడు చెయ్యి చాస్తూ.

అతనితో కరచాలనం జేసి, "నా ప్రోగ్రాం ఏమిటో కూడా చెప్పి వుంటాడనుకుంటాను!" అన్నాను.

అతను తలూపి, "అంతేకాదు. ప్రయాణానికి కావలసిన సామానూ, ఓ జోంగా జీప్ కూడా ఇచ్చి పంపేడు. రండి, పార్కింగ్ లో వుంది" అన్నాడు అటు నడుస్తూ.

ఇద్దరం అటు నడిచాం. పార్కింగ్ లో ఓ జోంగా జీప్ ఆగివుంది. సాధారణంగా దాన్ని పర్వత ప్రాంతాల్లోనూ, ఎడారి ప్రాంతాల్లోనూ వాడతారు.

నీటితో నిండిన తోలు తిత్తులూ, దారిని కనుగొనే కంపాక్స్, పెట్రోల్ టిన్స్, బైనాక్యులర్స్, ఇనప రాడ్స్, రెండు మూడు పారలూ వున్నాయి లోపల. ఇసకలో ఎక్కడైనా టైర్లు దిగబడితే ఇసక తొలిగించి ముందుకు సాగడానికి ఆ పారలు తోడ్పడతాయి.

డ్రైవింగ్ సీట్లో కూర్చున్నాడతను.

నేనూ, గ్లోరియా సెకెండ్ సీట్లో కూర్చున్నాం. జీప్ కదిలింది.

అరగంట తరవాత ఎడారిలో ప్రవేశించాం. పడమటి

దిక్కున మెల్లిగా ముందుకు సాగుతోంది జీప్. కనుచూపు మేర ఎటు చూసినా ఇసకదిబ్బలు తప్ప మరేమీ కనిపించడంలేదు; దూరదూరాన యెక్కడో ఓచోట ఒకటీ అరా ఖర్జూరపు చెట్లు కనిపిస్తున్నాయి.

అప్పటికే ఎండ తీక్షణం కావడంతో గ్లోరియా బ్యాగ్ లోంచి కూలింగ్ గ్లాసెస్ తీసిపెట్టుకుంది.

మరో అరగంట గడిచిపోయింది.

"ఇదే దిక్కున మరోపదిహేను నిమిషాలు వెళ్ళామంటే ఫారా గ్రామం వస్తుంది" అన్నాడు గైడ్.

సాలోచనగా తలూపి సిగరెట్ అంటించేను.

ఎండ ఎక్కువవుతున్న కొద్దీ, ఇసక వేడెక్కుతోంది. చూస్తూచూస్తూనే మా బట్టలన్నీ చెమటతో నిండిపోయేయి. గాలివేగానికి ఎగిరే ఇసుకతో మా జుత్తూ, మొహాలూ నిండిపోయేయి. గ్లోరియా మాటిమాటికీ బ్యాగ్ లోంచి వాటర్ బాటిల్ తీసి, నోట్లోకి వెళ్ళిన ఇసక రేణువుల్ని నీళ్ళతో పుక్కిలించి ఊస్తోంది.

ఇంతలో ముందుకు వెళుతున్న జీప్ శబ్దం జేస్తూ హఠాత్తుగా ఆగిపోయింది. వెంటనే ఇంజన్ ఆఫ్ జేసేడు గైడ్.

"ఏం జరిగింది?" అడిగేను.

"అదే, చూస్తానుండండి." అంటూ జీప్ దిగి బైనెట్ కవర్ తెరిచేడు.

నేనూ, గ్లోరియా కూడా జీప్ దిగాం!

గైడ్, జీప్ కిందకి దూరి కాసేపు పరీక్షించి బైటకి వచ్చేడు.

"క్లచ్ ప్లేట్స్ వేడెక్కి కాలిపోయేయి." అన్నాడు బట్టల కంటిన ఇసక దులుపుకుంటూ.

"ఇప్పుడెలా?" అన్నాను చుట్టూ కలయజూసి.

దూరాన ఐదు ఒంటెలు వస్తున్నట్టు లీలగా కనిపించింది. బైనాక్యులర్స్ తీసి చూసేను. ఐదుగురు కూర్చున్న ఆ ఒంటెలు మావేపే వస్తున్నాయి. "అటు చూడు. ఎవ్వరో ప్రయాణీకులు మన వైపే వస్తున్నారు. వారి ద్వారా ఏదైనా సహాయం దొరకవచ్చు," అన్నాను గైడ్‌తో.

అతను నవ్వి "వాళ్ళు మామూలు ప్రయాణీకులని ఏమిటి నమ్మకం? ఎడారి దొంగలు కూడా కావచ్చు కదా?" అన్నాడు.

సరిగ్గా అదే క్షణంలో దక్షిణ దిశనించి కాస్త గాలి వేగం హెచ్చింది. ఆ గాలితో కలిసి వచ్చిన భయంకరమైన దుర్గంధం మా ముక్కు పుటాలని బద్దలు చేసింది. భరించలేని దుర్వాసన!

"ఏమిటీ దుర్గంధం? ఎక్కణ్ణించి వస్తోంది? ఓ గాడ్! భరించలేకుండా వున్నాను!" అంది గ్లోరియా కర్చీఫ్‌తో ముక్కు మూసుకుంటూ.

"చుట్టుపక్క లేదో ప్రాణి చాలా రోజుల్నించీ చచ్చి పడుంటుంది. కుళ్ళిపోయి వాసన కొడుతూంది. ఏమిటో చూసి వస్తానుండండి!" అంటూ ఆ వాసన వస్తున్న వేపు వెళ్ళేడు గైడ్.

ఇద్దరం అటే చూస్తూ నిల్చున్నాం.

ఆ వైపంతా ఎగుడూ దిగుడూ ఇసక దిబ్బలతో నిండి వుంది. గబగబ నడుస్తూ ఓ ఇసకదిబ్బ ఎక్కి అవతలికి దిగేడు.

పది నిమిషాల తరువాత ఎగిసిపడే శ్వాసతో పరుగెత్తుకు వచ్చేడు.

"ఏం జరిగింది?" అడిగేను ఆతృతగా.

"ఆ దిబ్బ కవతల ఓ అమెరికన్ శవం సగానికి పైగా కుళ్ళిపోయిపడుంది. అతని ఎడం చేతికి ఓ బ్రీఫ్ కేస్ ఇనుప గొలుసుతో బేడీ వేసుంది."

నా గుండెలో గుర్రాలు దౌడుదీసేయి!

అమెరికన్! చేతికి ఇనుప గొలుసుతో బ్రీఫ్ కేస్!! ఈ ఆలోచన రాగానే కొన్నాళ్ళ క్రితం మిలియన్ డాలర్లు తీసుకుని సహారా ఎడారిలోకి వచ్చిన అమెరికన్ ఏజంట్ జెప్సన్ నా బుర్రలో మెరిసేడు.

"మీ రిద్దరూ యిక్కడే వుండండి. నే వెళ్ళి చూసొస్తాను," అంటూ అటు కదిలేను.

పరిగెత్తుతున్నట్టు నడుస్తూ దిబ్బ ఎక్కి అవతలికి దిగేను.

వేరొకరైతే ఆ దృశ్యం చూసి వాంతి జేసుకుని కింద కూలిపోయేవారు. జేబురుమాలు ముక్కు కడ్డం పెట్టుకుని శవాన్ని సమీపించేను.

సందేహం లేదు. అతను అమెరికనే!

శవం బోర్లా పడుంది. ఓ చెంప నేలకి ఆనించి వుంది. శవం కిందా మీదా దాదాపు సగం శరీరం కీటకాల వాత బడింది. బట్టలన్నీ చిరిగి చిల్లులు పడున్నాయి. అతని ఎడం చేతికి కట్టుకున్న గొలుసుతో బ్రీఫ్ కేస్ అలాగే వుంది.

బ్రీఫ్ కేస్ మూత తెరిచి వుంది. దాని చుట్టుపక్కల డాలర్ల సైజులో కట్ జేసిన కాగితపు ముక్కలు చెల్లా చెదురుగా పడున్నాయి.

కింద కూర్చుని వాటిని పరిశీలించ సాగేను. దీన్నిబట్టి జెప్సన్ ఆ సూట్ కేస్‌లో డాలర్లకి బదులు కాగితాల కట్టలు నింపుకు వచ్చాడని తెలుస్తోంది.

ఐతే, ప్రభుత్వం ఇచ్చిన డబ్బు కాజేశాడా? కాజేసి ఈ చిత్తు కాగితాలు నింపుకు వచ్చేడా? ఈ మోసాన్ని పసిగట్టిన అంతరిక్ష దొంగలు అతన్ని హత్య జేసేరా?

కీటకాలు తినగా మిగిలివున్న అతని శరీరంమీద అక్కడక్కడా గాయాలు. కనిపిస్తున్నాయి. అంటే, చావక ముందు అతను టార్చర్ జెయ్యబడ్డాడన్నమాట!

సరిగ్గా అదే క్షణంలో వెననించి ఏదో నీడ శవంమీద పడడంతో ఆ ఆలోచనలోంచి ఉలిక్కిపడి గిరుక్కున వెనుదిరిగేను.

గుండె క్షణం ఆగిపోయినట్టు తోచింది.

అంతక్రితం బైనాక్యులర్స్ లోంచి నేను చూసిన ఐదు ఒంటెలు! ఆ ఒంటెలమీద కూర్చున్న ఐదుగురు వ్యక్తులూ నా వైపు రైఫల్స్ గురిపెట్టి వున్నారు. ఆ ఐదుగుర్నీ రైఫల్స్‌నీ చూసి నా కంతగా ఆశ్చర్యం వెయ్యలేదు కానీ, నేలమీద నా వైపు రైఫుల్ గురిపెట్టి నిల్చున్న వ్యక్తిని చూసి నిర్ఘాంతబోయేను.

అతనెవ్వరో కాదు.

నా గైడ్! మా వెంట వచ్చిన ఎడారి గైడ్!!

వాళ్ళవైపే చూస్తూ మెల్లిగా లేచి నిల్చున్నాను. నా జేబులో రివాల్వర్ వుంది. దానివల్ల ఇప్పుడేమీ ప్రయోజనంలేదు. ఏ చిన్న పొరబాటు జేసినా, ఆరుగుళ్ళూ దూసుకు వచ్చి నా శరీరంలో తిష్ట వేస్తాయి. జెప్సన్‌లా కుక్కచావు చావడం నా కిష్టంలేదు.

నా వెంట వచ్చిన గైడ్‌లాగే ఆ ఐదుగురూ తలపాగాలు చుట్టుకుని మొహానికి నల్ల బట్ట కట్టుకున్నారు.

అందులో ఒకడు తను కూర్చున్న ఒంటెని నాలుగడుగులు ముందుకు వేయించి, నన్ను తీక్షణంగా చూస్తూ,

"మిస్టర్ రాజారెడ్డీ! నీ వెవ్వరివో మాకు తెలుసు. మాకు డబ్బిచ్చి మీ రహస్యాలు తీసికెళ్ళడానికి వచ్చినట్టువచ్చి, అమెరికా ప్రభుత్వంతో చేతులు కలిపి ఈ కేసులో పని జేస్తున్నావనీ తెలుసు. మమ్మల్ని మోసగించడానికి ప్రయత్నించే వ్యక్తుల గతి ఏమవుతుందో అటు చూడు!"

అంటూ కింద పడున్న జప్సన్ శవాన్ని చూపించి, "వుక్క చావు! ఈ శవాన్ని చూపించి, నిన్ను హెచ్చరించటానికే వట్టి చేతులతో రమ్మని కబురు పంపేము.

మోసగాళ్ళన్నా, దగాకోర్లన్నా మాకు పరమ అసహ్యం. అంతరిక్ష రహస్యాల విషయంలో మేమింత వరకూ, ఏ దేశాన్నీ మోసం జెయ్యలేదు. కోరిన డబ్బు తీసుకున్నాం! వాళ్ళ రహస్యాలు వాళ్ళకి యధావిధంగా ఇచ్చేశాం!

ఈ ద్రోహి మమ్మల్ని బోల్తా కొట్టించడానికి అసలు డాలర్లు కాజేసి, బ్రీఫ్ కేస్‌లో తెల్లకాగితాల కట్టలు నింపుకు వచ్చేడు. ఫలితంగా ఇటువంటి హీనమైన చావు చచ్చేడు!"

అతను ఇంగ్లీష్‌లో మాట్లాడుతున్నాడు. ఆ మాట్లాడే తీరు అచ్చు అమెరికన్‌లా ఉంది.

"ఒక వేళ జెప్సన్ నిజంగా తానే ఆ డాలర్లు కాజేసి ఉంటే, ఆ డాలర్లతో ఎక్కడికో పారిపోక, బ్రీఫ్ కేస్‌లో కాగితాలు నింపుకుని, కోరి మృత్యుముఖంలోకి దేనికి వస్తాడు. అంత ప్రయాసపడి ఇక్కడికి వచ్చి ప్రాణాలు దేనికి పోగొట్టుకుంటాడు? బ్రీఫ్ కేస్‌లో డాలర్లకి బదులు కాగితం కట్టలున్నాయని అతనికి తెలియదేమో? అతన్ని ఎవ్వరో మోసం జేసుంటారేమో? ఈ

విషయాలు మీరు ఆలోచించారా?'' అన్నాను అతన్ని పరీక్షగా చూస్తూ.

''అవన్నీ ఆలోచించే అవసరం మాకు లేదు. మాకు కావలసింది డబ్బు! ఇక నీవు తిరుగు మొఖం పట్టించవచ్చు. మీ రహస్యాలు మీకు కావాలనుకుంటే, మేం కోరిన డాలర్లు ఎక్కడ ఎప్పుడు అందజెయ్యాలో, నీవు దిగిన హోటల్ గదిలోనే నీకు తెలియజెయ్యబడుతుంది. ఆ సందేశం కోసం ఎదురు చూస్తుండు!'' అన్నాడతను గంభీరంగా.

నాతో వచ్చిన గైడ్ వైపు చూసి, ''నీవు డిక్స్ పంపిన గైడ్‌వి కాదుకదూ?'' అన్నాను.

అతను చిన్నగా నవ్వి తలూపేడు. ''అవును మీకోసం డిక్స్ ఏర్పాటు జేసిన గైడ్‌ని అతనింట్లో కట్టి పడేసి, అతని చోట నేనొచ్చాను. ఇక్కడ పడున్న జెప్సన్ శవాన్ని నీవు కళ్ళారా చూసి వెళ్ళాలనే మా ఉద్దేశం! అందుకే, కావాలనే జీప్ క్లచ్ ప్లేట్స్ విరగ్గొట్టి ఆపేను. అర్థమైందా?''

అంటూ ఒక ఒంటె వెనక్కి వెళ్ళేడతను. ఆ ఒంటె మీద వ్యక్తి వెంటనే ఒంటెని నేలమీద కూర్చోబెట్టేడు. గైడులా నటించిన ఆ ముసుగు మనిషి ఒంటె మీద కూర్చోగానే ఒంటె తిరిగి లేచి నిల్చుంది.

నాతో మాట్లాడిన వ్యక్తి స్థానిక భాషలో వాళ్ళతో ఏదో అన్నాడు.

అంతే, ఐదు ఒంటెలూ ఒకేసారి వెనక్కి తిరిగి పరుగు లంకించేయి. చూస్తూ చూస్తూనే కనుచూపు మేర దాటు తున్నాయి. ఇప్పుడు దూరాన ఏదో మసక మసకగా

కదులుతున్నట్టు మాత్రం కనిపిస్తోంది.

నిట్టూరుస్తూ క్రింద పడున్న జెప్సన్ శవం వేపు చూసేను. కడుపులో దేవినట్టయి వెంటనే తల తిప్పే సున్నాను. పగవాడికూ్కడా అటువంటి చావు రాకూడదు!

సడన్‌గా గ్లోరియా జ్ఞాపకం రావడంతో నా గుండె వేగం అందుకుంది. వేగంగా జీవ్ ఉన్న వేపు పరుగు తీసేను. ఇసక దిబ్బ ఎక్కి అవతలికి దిగగానే కనిపించింది జీవ్. డ్రైవింగ్ సీట్లో కూర్చుని ఇటే చూస్తున్న గ్లోరియా కనిపించడంతో మనసు కుదుటపడింది.

"ఇంతసేపూ అక్కడేం జేస్తున్నారు? మీరలా వెళ్ళిన కొద్ది సేపటికి ఆ గైడ్ కూడా అటు వెళ్ళేడు. నేనొక్క దాన్నీ ఇక్కడ కూర్చుని కూర్చుని బోర్ తిపోయేను. ఆ గైడు ఏడీ?" అంది నేను జీవ్ దగ్గరికెళ్ళగానే.

అంతవరకూ జరిగిన సంఘటనలన్నీ ఆమెకు వివరించేను. "ఇప్పుడెలా? జీపు పాడైపోయింది. అంత దూరం కాలినడక ఎలా వెళ్ళేది? ఎంత త్వరగా ఈ పరిసరాల నించి వెళ్ళిపోతే అంత మంచిది. ఈ దుర్గంధాన్ని ఒక్క క్షణం కూడా భరించలేకుండా ఉన్నాను." అంది గ్లోరియా జీపు దిగుతూ.

# 6

జీవ్‌లోంచి బైనాక్యులర్స్, కంపాక్స్, రెండు నీటి తిత్తులూ, ఓ తెల్ల దుప్పటీ అందుకున్నాను. గ్లోరియా దగ్గిరున్న ఏర్ బ్యాగ్‌లో డ్రైరాషన్ ఉంది. కంపాక్స్‌లో దిశలు చూసి, మేము వచ్చిన తూర్పు దిశవేపు నడక సాగించాం!

దూరదూరాన కనుచూపు మేర మనిషి మాత్రుడు కని పించడంలేదు. మామూలు భూమ్మీద నడిచేకన్నా ఎడారి ఇసకలో కాలినడకన ప్రయాణం చెయ్యడం చాలా కష్టం. ఇసకలో కూరుకుపోయే పాదాలని తీసితీసి అడుగు వెయ్యా వలసి ఉంటుంది. కాళ్ళు వెంటనే నీరసిస్తాయి.

అక్కడక్కడా మజిలీలు చేస్తూ, ఆకలైతే బిస్కెట్లూ కేకులూ తింటూ, ఘడియకో గుటక నీళ్ళు తాగుతూ, సాయంత్రం ఐదు గంటలకల్లా చాలా దూరమే నడిచినట్లు తోచింది.

ఐనా, జనసంచారం ఎక్కడా కనిపించలేదు. కొంప దీసి దారి తప్పలేదు కదా?

కాళ్ళు పీకుతున్నాయి. పిక్కలు ఉండ గట్టుకుపోతు న్నాయి. మగాణ్ణి నాకే అలా ఉంటే, ఆడది అందునా జీవితంలో కాలినడక ఏమిటో ఎరగని అమెరికన్ లక్షాధి కారిణి గ్లోరియా స్థితి ఎలా ఉందో ఆ పరంధాముడికే తెలియాలి. నా అంచనా నిజమే అయింది.

ఓచోట ఇసకలో కూలబడి—"ఇక నడవడం నావల్ల కాదు, కాలి ఎముకలు విరిగిపోతున్నాయి!" అంది కాళ్ళు వత్తుకుంటూ.

చుట్టూ కలయ జూసేను. అప్పటికే సూర్యుడ స్తమిం చేడు. చీకట్లు ముసురుకుంటున్న కొద్దీ నిర్మానుష్యమైన ఆ ఎడారి మరీ భయంకరంగా తోచసాగింది. విచిత్రమేమి టంటే, పగలు అంత వేడి వెదజల్లిన ఇసక, సూర్యుడ స్త మిస్తున్న కొద్దీ చల్లబడసాగింది.

గ్లోరియా ఇహ ఒక్క అడుగుకూడా ముందుకేసే స్థితిలో లేదని గ్రహించేను. దాదాపు నా స్థితి అలాగే ఉంది. ఈ

పరిస్థితిలో ఈ రాత్రి ఇక్కడే గడపక తప్పదు!

"కాసాబ్లాంకా ఇంకా ఎంత దూరం ఉంటుందో తెలీదు. ఇప్పటికే బాగా అలసిపోయాం ఈ రాత్రి ఇక్కడే గడిపి, తెల్లారేక తిరిగి నడక సాగిద్దాం!" అన్నాను ఇసకలో చతికిలబడుతూ.

"అవును నా ఉద్దేశం కూడా అదే!" అంది గ్లోరియా నీరసంగా.

కాస్తోకూస్తో మిగిలిన బిస్కట్లూ కేకులూ తిని నీళ్ళు తాగాం.

అప్పటికే చలి మెల్లిమెల్లిగా ఎక్కువవుతోంది.

వెంట తెచ్చిన దుప్పటి ఆమెకిస్తూ "ఇసకలో పడుకుని ఈ దుప్పటి కప్పుకోండి. చలి బాధ అంతో ఇంతో తట్టుకోవచ్చు" అన్నాను.

గ్లోరియా దుప్పటి అందుకుని, ఇసకలో జారగిలబడి పైన దుప్పటి కప్పుకుంది.

నేనూ ఆమెకి కాస్త ఎడంగా మేను వాల్చాను.

దూరాన ఎక్కడో చిత్రవిచిత్రమైన పక్షుల అరుపులూ, జంతువుల అరుపులూ లీలగా వినవస్తున్నాయి. ఏ అర్థరాత్రో అవి ఈ వైపు వచ్చి మామీద పడితే?

జేబులో నిండుగా ఉన్న పిస్తోలు గుర్తుకు రావడంతో కాస్త ఊరట కలిగింది. ఐనా, ఓ పట్టాన నిదర పట్టడం లేదు. గ్లోరియా వైపు చూసేను. చలికి నిదర రాక మాట మాటికీ అటూ ఇటూ వత్తిగిలి పడుకుంటోంది.

గంటలు గడుస్తున్న కొద్దీ చలి భయంకర రూపం దాల్చింది. పక్కన ఏదో సరసర చప్పుడు కావడంతో ఉలిక్కిపడి పక్కకు తిరిగేను.

గ్లోరియా లేచి కూర్చునుంది!

"నిదరపట్టడం లేదా?" అడిగేను.

"ఈ చలి బాధ తట్టుకోలేకుండా వున్నాను. వేళ్ళు మొద్దుబారుతున్నాయి." అంటూ లేచివచ్చి నా పక్కన కూర్చుంది.

"ఐతే ఏంజేద్దామంటావ్?" అడిగేను మొదటిసారి ఏకవచనంతో.

"నా దగ్గిర ఒక ఉపాయం వుంది."

"ఏమిటి?

గ్లోరియా చటుక్కున నా పక్కన పడుకుని దుప్పటి మా యిద్దరిమీదా కప్పింది. "ఒకర్నొకరం హత్తుకుపడుకుంటే మన శరీరాల వేడి ఎలక్ట్రిక్ హీటర్లా పనిజేస్తుంది" అంది నా ఒడిలో ఒదుగుతూ.

మెత్తగా హాయిగా ఎంతో బావుంది. నేను పలకలేదు. ఆమెని దగ్గరికి లాక్కుని, అల్లుకుపోయాను.

# 7

తూరుపుదిక్కున తెల తెలవారసాగింది. ఇద్దరం మత్తుగా లేచాం. "తెల్లవారుతోంది. ఎండ తీక్షణం కాకముందే మనం బయలుదేరడం మంచిది. ఇప్పుడు నడవగలవా?" అడిగేను.

గ్లోరియా తలూపింది.

ఆమె ఏర్ బ్యాగ్, నీళ్ళతిత్తీ, దుప్పటీ భుజాన వేసుకుని లేచేను. కంపాక్స్ తీసి, మేం వెళ్ళాల్సిన దిశ సెట్ జేసుకుని ప్రయాణం సాగించాం.

అప్పటికే బాలభానుని తొలి కిరణం ఇసకంతా పరుచుకుని బంగారమా? అన్న భ్రాంతి కలిగిస్తోంది.

కొద్దిదూరం నడిచేమో లేదో, ఆకాశంలో ఏదో విమానం వస్తున్నట్టు పెద్ద శబ్దం వినిపించింది. మా ప్రాణాలు లేచివచ్చేయి.

బైనాక్యులర్స్ తీసి చూసేను.

హెలికాప్టర్!

ఎడారిలో చెట్టూ గుట్టా ఏమీ లేవు గనక చాలా కింద నించి ఎగురుతూ వస్తోంది.

చేతిలో తెల్లదుప్పటి పట్టుకుని రెడీగా నిల్చున్నాను. అది మా మీదికి రాగానే తెల్లగుడ్డతో చెయ్యెత్తి ఊప సాగేను. హెలికాప్టర్ కాక్‌పిట్‌లోంచి బైనాక్యులర్స్‌తో ఎవ్వరో కిందికి తొంగిచూస్తున్నారు.

హమ్మయ్య గండం గట్టెక్కింది అనుకుంటుండగానే, హెలికాప్టర్ కిందికి దిగకుండా, వెనుదిరిగి వచ్చినదార్నే వెళ్ళిపోయింది. కింద వున్న మమ్మల్ని చూసీ, యెలాంటి సహాయం చెయ్యకుండా, వెళ్ళిపోయినవాళ్ళమీద భరించ లేని కోపం వచ్చింది.

"స్టుపిడ్స్! బాస్టర్డ్స్!" అంది గ్లోరియా వాళ్ళని తిడుతూ.

నిట్టూర్చేను. "మన రాతలో ఈ పాట్లు తప్పవని రాసి వుంటే ఒకళ్ళనని ఏం లాభం? పద" అన్నాను.

రెండు ఫర్లాంగులు నడిచామనుకుంటాను. దూరాన ఏవో కదులుతున్నట్టు కనిపించడంతో చటుక్కున గ్లోరియా చెయ్యిపట్టుకుని ఆపేను.

బైనాక్యులర్స్‌తో ఆవైపు పరీక్షగా చూసేను. రెండు ఒంటెలు వస్తున్నాయి. ఒంటెలమీద రెండు మానవాకా రాలు కనిపిస్తున్నాయి.

"ఫిడిల్ అనుచరులు మళ్ళీ వస్తున్నారా?" అడిగింది గ్లోరియా భయంగా.

కాసేపటికి ఒంటెలు స్పష్టంగా కనిపించేయి. ఒక ఒంటెమీద ఖాకీ దుస్తుల్లో ఎవ్వడో కూర్చున్నాడు. రెండో ఒంటెమీదున్న వ్యక్తి ఫుల్‌సూటులో వున్నాడు. మొహాలు స్పష్టంగా కనిపించడంలేదు. వాళ్ళు మునుగు మనుషులు మాత్రం కాదని రూఢీ అయింది.

పదినిముషాల్లో ఆ ఒంటెలు రెండూ మమ్మల్ని సమీపించేయి. ఫుల్‌సూట్‌లో వున్న వ్యక్తిని చూడగానే నా కళ్ళని నేను నమ్మలేకపోయేను.

అతను నా అసిస్టెంట్ డేవిడ్!

నన్ను చూడగానే ఒంటెమీంచి దూకి పరిగెత్తుకు వచ్చేడు. "గుడ్ గాడ్! మీరు క్షేమంగానే వున్నారు కదా?" అన్నాడు ఆనందం పట్టలేక నన్ను కాగిలించుకుంటూ.

"భగవంతుడి దయవల్ల ఇంతవరకూ క్షేమమే. ఉన్న పళంగా ఎక్కణ్ణించి ఊడిపడ్డావ్?" అడిగేను.

"మీ ఆదేశానుసారం భారతదేశంనించి బైలుదేరి నిన్న సాయంత్రం రబాత్ జేరుకున్నాను. మన దౌత్య కార్యాలయం వెళ్ళి కనుక్కుంటే, మీరు కాసా బ్లాంకానించి నిన్న ఉదయమే సహారా ఎడారిలోకి ప్రవేశించేరనీ, నన్ను తిన్నగా కాసా బ్లాంక్ వెళ్ళమనీ, అక్కడ నివసించే అమెరికన్ ఏజెంట్ డిక్సన్‌ని కలుసుకోమనీ చెప్పి, ఓ కారూ రోడ్ మ్యాప్ ఇచ్చేరు.

కాసాబ్లాంకా జేరి డిక్సన్‌ని కలుసుకున్నాను. ఉదయమనగా వెళ్ళిన మీరు ఇంకా తిరిగి రాలేదనీ, తనకి ఆందోళనగా వుందనీ చెప్పేడు. ఈ భయంకర ఎడారిలో మీ

రేదైనా ప్రమాదంలో చిక్కుకున్నారేమోనని నాకూ భయం వేసింది. వెంటనే మిమ్మల్ని వెదికే ఏర్పాట్లు జెయ్యమని కోరేను.

డిక్స్ స్థానిక ఎడారి పోలీసులతో మాట్లాడేడు. తెల్లవారగానే వెతికే ఏర్పాట్లుజేస్తామని వాగ్దానంజేశారు వాళ్ళు. రాత్రంతా నేనూ, డిక్స్ నిదరపోలేదు.

తెల్లవారుజామున ఎడారి పోలీసుల హెలికాప్టర్ మిమ్మల్ని వెదకడానికి బైలుదేరింది. దానిద్వారా ఆ పోలీసులు సహారా ఎడారిలో దారితప్పిన విదేశీ యాత్రికుల్ని వెదికి కనుక్కుంటూరట!

తరవాత ఇద్దరిద్దరు చొప్పున ఒంటెలమీద యెడారి నాలుగువైపులా బైలుదేరారు పోలీసులు. నేనూ ఓ కానిస్టేబుల్ కూడా ఈ వైపు సాగేము. మా అందరి దగ్గిరా ట్రాన్స్‌మిటర్స్ వున్నాయి.

కొద్దిసేపటికి హెలికాప్టర్‌నించి సందేశం వచ్చింది. తాము మిమ్మల్ని కనుగొన్నామనీ, మా ఇద్దర్ని ఈ వైపు బైలుదేరమనీ చెప్పేరు!'' అన్నాడు డేవిడ్ గ్లోరియాని పరీక్షగా చూస్తూ.

వాళ్ళిద్దర్నీ పరస్పరం పరిచయం జేసేను.

''ఇక బైలుదేరండి. ఆలస్యం అయితే ఎండ తీక్షణం అవుతుంది'' అన్నాడు ఒంటెమీదున్న కానిస్టేబుల్.

అతని భుజానికి బైనాక్యులర్స్, ట్రాన్స్‌మిటర్ వేళ్ళాడుతున్నాయి. నడుంమీది బెల్టులో రివాల్వర్ వుంది.

నేనూ, గ్లోరియా డేవిడ్ దిగిన ఒంటె యెక్కాం. డేవిడ్ కానిస్టేబుల్ వెనక కూర్చున్నాడు. ఒంటెలు బైలుదేరే ముందు, కానిస్టేబుల్ ట్రాన్స్‌మిటర్ ఆన్ జేసి అరబ్ భాషలో ఏదో చెప్పసాగేడు. బహుశా, మేము

దొరికేమనీ, తీసుకువస్తున్నాననీ అధికార్లకి చెబుతున్నాదేమో!

ట్రాన్స్‌మిటర్ ఆఫ్ జేసి ఒంటెని అదిలించేడు కాని సేబుల్. అది వెంటనే పరుగు అంకించుకుంది. దాన్ని చూసి మేం కూర్చున్న ఒంటెకూడా జోరు తీసింది.

# 8

పదిగంటల ప్రాంతంలో, కాసా బ్లాంక్‌లో మేము దిగిన హోటల్ జేరుకున్నాం.

డేవిడ్ కూడా అదే హోటల్లో గది తీసుకున్నాడు.

వాళ్ళిద్దర్నీ వారివారి గదికి వెళ్ళి రెస్టు తీసుకోమని చెప్పి, నా గదిలో ప్రవేశించేను. టబ్‌లో తనివిదీరా స్నానంజేసి బట్టలు మార్చుకుంటున్న సమయంలో కాలింగ్ బెల్ మోగింది.

వెళ్ళి తలుపు తీసేను.

తలుపు తెరవగానే, "గుడ్ మార్నింగ్!" అంది గ్లోరియా.

ఆమె చేతిలోవున్న ఎర్రని కవరు చూడగానే నా కనుబొమలు ముడిపడ్డాయి. "గుడ్ మార్నింగ్! రా లోపలికి" అంటూ దారి ఇచ్చేను.

గ్లోరియా మౌనంగా లోన అడుగుపెట్టింది.

తలుపు మూసి సోఫాలో కూర్చున్నాక, కవర్ నాకిస్తూ "ఇప్పుడే బోయ్ తెచ్చిచ్చేడు" అంది.

కవర్‌మీద ఆమె పేరూ, రూం నెంబర్ రాసి వున్నాయి.

కాగితం బయటికి లాగి మడత విప్పేను.

"ఫైల్ తీసుకుని నీవూ, డబ్బు తీసుకుని నీ మిత్రుడూ కార్లో 'ముల్తాన్ చోటీ' అనే కొండప్రాంతం జేరు

కోవాలి. మీరు తెలివి గలవారనీ, యెటువంటి పిచ్చి పనులూ చెయ్యరనీ నమ్ముతున్నాను. ఒకవేళ తెలిసీ పొర బాట్లు చేశారా, జెప్సన్‌కు పట్టిన గతే మీకూ పడు తుంది.''

దాని కిందే, ఆ ప్రదేశాన్ని ఎలా చేరాలో సూచిస్తూ, చిన్న మ్యాప్ గీసివుంది. ఆ మ్యాప్ చివర్న ముల్తాన్ చోటీ మార్క్ చెయ్యబడుంది.

ఉత్తరం మడిచి కవర్‌లో పెట్టి తిరిగి ఆమెకిచ్చేను.

''మనిద్దరికీ కలిపి ఆదేశాలివ్వబడ్డాయి. కనక, ఇద్దరం కలిసే వెళదాం! అంతవరకూ నీవు నీ గదిలో రెస్టు తీసుకో. ఆలోగా నేను రబాత్‌లోని అమెరికన్ దౌత్య కార్యాలయానికి డబ్బు పంపమని ట్రంకాల్ చేస్తాను,'' అన్నాను.

గ్లోరియా తలూపి వెళ్ళిపోయింది.

ఫోన్ దగ్గరికి లాక్కుని, మేనేజర్‌కి భోజనం గదికి పంపమని చెప్పి, హోటల్ ఆపరేటర్‌తో వెంటనే రబాత్ లోని అమెరికన్ దౌత్య కార్యాలయానికి నా పేర్న ట్రంకాల్ బుక్ చెయ్యమనీ, లైన్ దొరికితే నాకు కనెక్ట్ చెయ్యమనీ చెప్పేను.

బేరర్ తెచ్చిన భోజనం ముగించి, సిగరెట్ అంటించానో లేదో ఫోన్ మోగింది. రిసీవర్ అందుకుని, ''ఎస్!'' అన్నాను.

''లైన్ దొరికింది! మీరు మాట్లాడవచ్చు'' అంది ఆపరేటర్.

అప్పటివరకూ జరిగిన సంఘటనలన్నీ అమెరికన్ దౌత్యాధికారికి వివరించి, మధ్యాహ్నం రెండుగంటల్లోగా డబ్బు పంపమనీ, నేను డిక్సీ ఇంట్లో వుంటాననీ చెప్పేను.

అతను వెంటనే ఏర్పాట్లు జేస్తున్నానని చెప్పి లైన్ కట్ జేసేడు.

డేవిడ్ వున్న గదికి రింగ్ జేసి, డిక్సన్ ఇంటికి వెళు తున్నానని చెప్పి, కార్లో బైలుదేరేను.

నన్ను చూడగానే సాదరంగా ఆహ్వానించేడు డిక్సన్. అతని మంచం పక్కన కుర్చీలో కూర్చుని, జరిగిన సంఘ టనలన్నీ వూసగుచ్చినట్లు వివరించేను.

సరిగ్గా పావుతక్కువ రెండు గంటలకి, డబ్బుగల బ్రీఫ్‌కేస్‌తో రబాత్‌నించి వచ్చేడు ఓ అమెరికన్ అధి కారి. నోట్లు మంచంమీద గుమ్మరించి, నా తృప్తికోసం స్వయంగా లెక్కపెట్టి బ్రీఫ్‌కేస్‌లో సర్దమన్నాడు.

లెక్కపెడుతూ ఆ కట్టల్ని వరసగా బ్రీఫ్‌కేస్‌లో పేర్చేను.

సరిగ్గా కోటి డాలర్లు! అది సామాన్యమైన రొఖ్ఖం కాదు.

అంతపెద్ద మొత్తంచూసి ఎంతటివాడికైనా మనను చలించే ప్రమాదం వుంది. భగవంతుడి దయవల్ల నా మనను అంత చంచలమైంది కాదు.

"ఇవి బ్రీఫ్‌కేస్ తాళం చెవులు" అంటూ తాళం చెవులూ యిచ్చేడు అధికారి.

బ్రీఫ్‌కేస్ కిరుపక్కలా తాళాలువేసి, తాళం చెవులు, జేబులో వేసుకున్నాను. మరో అరగంట డిక్సన్‌తో మాట్లాడి హోటల్‌కు బయలుదేరాను.

# 9

కారు గ్లోరియా నడుపుతోంది. నేను ఆ మ్యాప్ చేతిలో పట్టుకుని ఆమెకి ఎటు వెళ్ళాలో ఇన్‌స్ట్రక్షన్స్ యిస్తు

న్నాను. అగాడీర్ నగరం దాటి, ఓ నిర్మానుష్యమైన రోడ్డుమీదికి వచ్చాం.

సాయంత్రం నాలుగు గంటలైనా ఇంకా మా గమ్యం రాలేదు. అప్పటికే అనేక గ్రామాలూ, రోడ్లూ దాటాం. మ్యాప్ నిబట్టి చూస్తే ఇంకా చాలాదూరమే వెళ్ళాలనిపించింది.

ఓ గ్రామందగ్గిర కారాపి, దొరికిన పదార్థాలు తినీ, తాగీ మళ్ళీ ముందుకు సాగాం. సాయంత్రం అయిదు గంటలకి గమ్యం దగ్గిరవుతున్నట్టు తోచింది. దూరాన లీలగా కొండలు కనిపిస్తున్నాయి. కారు జనసంచారం లేని రోడ్డు మీద పోతోంది.

ఐదుగంటలకి ఆ కొండలు సమీపించేయి. రోడ్డు పాములా మెలికలు తిరుగుతూ ఓ కొండపైకి పోతోంది. రోడ్డు కిరుపక్కలా అగాధంలాటి లోయలు!

ఆరుగంటలకి కొద్దినిముషా లుందనగా, మార్క్ చేసి ఉన్నచోటికి చేరాం. ఇద్దరం కారు దిగి చుట్టూ కలయ జూశాం.

అప్పటికే సూర్యుడ స్తమించేడు. అంతా నిశ్శబ్దం! నిర్మానుష్యం!

గ్లోరియాకి భయంవేస్తోంది కాబోలు - నన్ను అతుక్కు నిల్చుని, బిక్కుబిక్కుమంటున్న ఆ కొండల్ని చూస్తోంది.

ఇంతలో హఠాత్తుగా, కుడివైపు ఏదో అలికిడయి, చటుక్కున అటు తిరిగేను.

ఫిడిల్!

పిస్తోలు మావైపు గురిపెట్టి ఓ బండచాటునించి యివతలికి వచ్చేడు. అతని వెనకే మూడువేపులనించే మరో

ముగ్గురు ఆజానుబాహులు ఇవతలికి వచ్చేరు. వాళ్ళ చేతుల్లోనూ నిప్పులు కురవడానికి ఎదురుచూస్తున్న రైఫిళ్ళు మా వేపు గురిపెట్టి వున్నాయి.

ఫిడిల్ ముసుగులో లేడు. అతని అనుచరులు మాత్రం మొహాలకి నల్లగుడ్డలు చుట్టుకునున్నారు.

"డబ్బు తెచ్చావా?" అడిగేడు ఫిడిల్ నిశ్శబ్దాన్ని ఛేదిస్తూ. ఎడంచేతికి వున్న బ్రీఫ్‌కేస్ ఎత్తి చూపేను.

"నువ్వు ఫైల్ తెచ్చేవా?"

గ్లోరియా చంకలోని బ్యాగ్ చూపించింది.

"మీ రిద్దరూ రెండడుగులు ముందుకువేసి అవి కిందపెట్టి వెనక్కి వెళ్ళండి" అన్నాడు ఫిడిల్.

నేను నవ్వి, "అలాగే నువ్వూ మా రహస్యాలు తీసి కిందపెట్టు!" అన్నాను.

"మీ రహస్యాలలో మా కేలాటి ఆసక్తి లేదు. మాకు కావలసింది డబ్బు! అది అందేక వాటిని ఒక్కక్షణం మా దగ్గర వుండనివ్వం. ముందు డాలర్లు చెక్ జేసి, తృప్తి కలిగేక మీ రహస్యాలు నీకు ఇచ్చేస్తాను. బ్రీఫ్‌కేస్ కింద పెట్టు!" అన్నాడు ఫిడిల్ గంభీరంగా.

తాళంచెవులతోసహా బ్రీఫ్‌కేస్‌ని కిందపెట్టి వెనక్కి తగ్గేను.

గ్లోరియాకూడా బ్యాగ్‌లోంచి ఫైల్ తీసి కిందపెట్టి అంది. "ఫిడిల్! ఇప్పటికైనా మించిపోయింది లేదు. ఈ తప్పుడుమార్గం వదిలి నా వెంట వచ్చెయ్. ప్రభుత్వం నిన్ను..."

"నోరు మూసుకు వెనక్కి వెళ్ళు!" అరిచేడు ఫిడిల్.

గ్లోరియా గజగజ వణుకుతూ వెనక్కి తగ్గింది.

ఫిడెల్ కదిలేడు. అడుగులో అడుగు వేసుకుంటూ బ్రీఫ్ కేస్‌ని సమీపించేడు. మెల్లిగా వంగి దాన్ని అందు కున్నాడు. తాళంచెవులతో లాక్స్ తీసేడు.

ఊపిరి బిగబట్టి అతన్నే చూస్తున్నాను.

బ్రీఫ్ కేస్ మూత తెరిచిన మరుక్షణం ఫిడెల్ మొహం రంగులు మారింది. తరవాత మెల్లిగా కళ్లెత్తి, "ఏమిటిది?" అన్నాడు బ్రీఫ్ కేస్ నావేపు తిప్పుతూ.

నా గుండె గుభిల్లుమంది!

బ్రీఫ్ కేస్ నిండా, తెల్లకాగితాల కట్టలు!!

నా చేతులతో స్వయంగా డాలర్లు నింపానే? ఏమయ్యాయి?

సహారా ఎడారిలో కుళ్ళిపోయి, కీటకాలు తింటున్న జెప్సన్ శవం, తెల్లకాగితాలు నిండిన బ్రీఫ్ కేస్ నా కళ్ళ ముందు మెదిలేయి.

ఆశ్చర్యంతో బుర్ర గిరగిర తిరుగుతోంది. ఏమిటీ మాయ? ఎలా జరిగింది? ఎక్కడ జరిగి వుంటుంది? బ్రీఫ్ కేస్‌ని నా కంటికి రెప్పలా చూసుకున్నానే! ఎవరు కాజేసేరు?

దీన్నిబట్టి ఆలోచిస్తే, అంతరిక్షదొంగలే కాక, ఇక్కడ మరో ముఠా పనిజేస్తున్నట్టు తెలుస్తుంది. ఇటువంటి మోసానికే గురై అన్యాయంగా ప్రాణాలు పోగొట్టు కున్నాడు జెప్సన్.

నా ఆలోచనల్ని తుంచివేస్తూ, నిశ్శబ్దాన్ని ఛేదిస్తూ గర్జించేడు ఫిడెల్. "జెప్సన్‌కు పట్టిన గతి నీవు కళ్ళారా చూశావ్. నీకూ అటువంటి దుర్గతి పట్టకూడదనే ముందు ఆ దృశ్యం చూపించేను. పాపం! అటువంటి చావే నీకూ రాసిపెట్టివుంటే ఎవ్వరేం జేస్తారు?"

కంఠాన్ని అదుపులో పెట్టుకుంటూ అన్నాను. "మిస్టర్ ఫిడేల్! నేను చెప్పే పచ్చి నిజాన్ని ఎవ్వరూ నమ్మరు. ఐనా నీవు నమ్మాలి. డబ్బు నా కళ్లెదుటే బ్రీఫ్ కేస్‌లో నింపబడింది. నేనే స్వయంగా లెక్కపెట్టి కోటిడాలర్ల కట్టలు అందులో నింపేను. ఎవ్వరో నా కళ్ళల్లో దుమ్ము కొట్టేరు. ఇక్కడ మీ ముఠా కాక మరో గ్రూప్ ఏదో పనిజేస్తోంది..."

"కబుర్లు కట్టిపెట్టు. నాకు కావలసింది డబ్బు. నీ దొంగ సంజాయిషీ కాదు. ఆ డబ్బు నీవే మాయం జేశావ్! ఫలితం అనుభవించు" అంటూ కుడిచెయ్యి సూటిగా నా వైపు ఎత్తి పిస్తోలు గురిపెట్టేడు ఫిడేల్.

పిస్తోలు నా జేబులోనూ వుంది. దాన్ని తియ్యడానికి ఏమాత్రం చెయ్యి కదిల్చినా, నాలుగు వేపులనించీ నాలుగు గుళ్ళు నా శరీరంలో తిష్ట వేస్తాయి!

గజగజ వణుకుతూ అంది గ్లోరియా. "ఫిడేల్! అంతపని జెయ్యక. కావలిస్తే నన్ను చంపు. చిన్నతనపు అవివేకంతో నీవు జేస్తున్న ఈ పనులు, నీ జీవితాన్ని నాశనం జేస్తాయి. ఇప్పటికీ మించిపోలేదు. నా వెంట వచ్చెయ్. ప్రభుత్వం నిన్ను క్షమించి..."

"నువ్వు నోరు ముయ్యమని ఇప్పటికే చెప్పేను. నీకూ వీడితో చావాలనుందా? సరే, అలాగే కానివ్! వీళ్ళిద్దర్నీ కాల్చి చంపండి" అన్నాడు ఫిడేల్ గొంతు హెచ్చించి.

అది ఆర్డర్.

ఫైనల్ ఆర్డర్!

"ఢాం, ఢాం, ఢాం..." రెండు సెకన్లు వరసగా పేలిన ప్రేలుడుతో ఆ కొండలు మారుమోగేయి.

గ్లోరియా కెవ్వున అరుస్తూ నేలకూలింది.

నేనుమాత్రం కింద కూలకుండా ప్రాణాలతో అలాగే నిల్చున్నందుకూ, ఫిడిల్ అనుచరుల్లో ఇద్దరు గావుకేకలు పెడుతూ తుమ్మమొద్దుల్లా కింద కూలినందుకూ, మిగతా ఇద్దరు గాయపడ్డచేతులు పట్టుకు మూలుగుతున్నందుకూ నివ్వెరబోయి చుట్టూ కలయజూసేను.

స్టెయిన్ గన్ పట్టుకుని ఓ బండ చాటునించి బైటికి వచ్చేడు మా వెనకే వచ్చిన డేవిడ్!

ఊహించని ఆ సంఘటనకి ఉన్మాదులై, వేడెక్కిన రక్తంతో, చేతుల గాయాలనికూడా లెక్కచెయ్యకుండా కింద పడ్డ ఆయుధాలు అందుకున్నారు ఫిడిల్, అతని అనుచరుడూ.

ప్రమాదాన్ని పసిగట్టి మెరుపులా నేలమీద దొర్లేను. అప్పటికే డేవిడ్, ఫిడిల్, అతని అనుచరుడి ఆయుధాలు మారు మోగుతున్నాయి. పొర్లుకుంటూ ఓ బండచాటుకి వెళ్ళేను.

గ్లోరియా మరణం నాలో క్రోధం కట్టలు త్రెంచుకున్నది.

వాళ్ళవేపు గురిపెట్టి గుళ్ళు ఖాళీ అయేవరకూ కాల్పులు సాగించేను. రెండు నిమిషాల తరువాత పరిసరాలు నిశ్శబ్దంతో మూగవోయేయి.

మరో ఐదునిమిషాలు అలాగే పడుకుని చెవులు రిక్కించి చూడసాగేను. ఎలాటి అలికిడీ కాకపోడంతో మెల్లిగా లేచి నిల్చున్నాను. అప్పటికే డేవిడ్ బండ చాటునించి ఇవతలికి వచ్చేడు.

దూరాన ఫిడిల్, అతని అనుచరుడూ నేలమీద బోర్లా పడున్నారు.

ఇద్దరం అటు నడిచేము. ఫిడిల్ అనుచరుడిలో ఎటు వంటి చలనం లేదు.

అతన్ని పరీక్షగా చూసేను. ఊపిరి బరువుగా తీస్తు న్నట్టు శరీరం ఆగి ఆగి కదులుతోంది. బోర్లా పడున్న అతన్ని మెల్లిగా తిప్పి వెల్లికిలా పడుకోబెట్టేను.

కాసేపటికి అతి కష్టంమీద కళ్ళు తెరిచేడు. ఛాతీ మీదా, పొట్టమీదా రంధ్రాలు కనిపిస్తున్నాయి. ఆ రంధ్రాల్లోంచి ఎర్రని, చిక్కని రక్తం కారుతోంది.

ఫిడిల్ ఏదో చెప్పడానికి పెదాలు కదుపుతున్నాడే కానీ, మాట బైటికి రావడంలేదు. కాసేపు రెప్పవెయ్యకుండా చూసి, తల పక్కకి వాల్చేసేడు.

ఈలోగా డేవిడ్, శవాల దుస్తులన్నీ వెదికి, ఫిడిల్ కోటు లోపలి జేబులోంచి చిన్న ప్లాస్టిక్ పాకెట్ బైటికి తీసేడు. దాన్ని అందుకుని చూసేను. పైన ఎర్రని పెయింటుతో, 'ఇండియన్ సీక్రెట్స్' అని రాసివుంది.

తృప్తిగా నిట్టూర్చేను. దేశంకాని ఈ దేశంలో ప్రాణాలకి తెగించి, దేనికోసమైతే మేం వచ్చామో ఆ వస్తువు, ఇప్పుడు నా చేతిలో వుంది. మన తొలి గూఢచారి గ్రహం నించి తస్కరించిన ఫోటోలూ, టేప్‌లూ అందులోనే వున్నాయి. కాని గ్లోరియా మరణం నా గుండెను పిండి చేస్తూనే వుంది.

# 10

"మిస్టర్ రాజారెడ్డీ! ఒకేఒక విషయం ఇంకా అర్థం కాకుండా వుంది. సహారా ఎడారిలో చంపబడ్డ మా ఏజెంట్ జెప్సన్ని మోసంచేసి, ఆ మిలియన్ డాలర్లు ఎవ్వరు కాజేసి వుంటారు? మీ కివ్వబడ్డ కోటి డాలర్ల బ్రీఫ్ కేస్ యెవ్వరు మార్చి వుంటారు?" అన్నాడు ఆమె

రికన్ గూఢచారి శాఖ జనరల్ సెక్రెటరీ హెరాల్డ్ ఫిష్.

కాసాబ్లాంకాలోని అమెరికన్ గూఢచారి, డిక్సన్ ఇంట్లో నేనూ, డేవిడ్, హెరాల్డ్ ఫిష్, డిక్సన్ కూర్చుని కాఫీ తాగుతున్నాం.

కాసాబ్లాంకా చేరగానే, డిక్సన్ ఇంటికి వెళ్ళి అతని ట్రాన్స్‌మిటర్ ద్వారా వెంటనే రమ్మని హెరాల్డ్ ఫిష్‌కి మెసేజ్ పంపేను.

మధ్యాహ్నం నాలుగ్గంటలకి అతను ప్రత్యేక విమానంలో కాసాబ్లాంకా చేరాడు.

కాఫీకప్పు టీపాయ్‌మీద పెట్టి సిగరెట్ అంటించేను. "మై డియర్ సర్! మీ సందేహాలకి సరైన సమాధానాలు నా దగ్గిరున్నాయి. మీ డబ్బు ఇప్పుడే దొరుకుతుంది."

అంటూ జేబులోకి చెయ్యి పోనిచ్చేను. బైటికి వచ్చిన నా చేతిలోని వస్తువు చూడగానే డేవిడ్‌తోబాటు అందరూ నిర్ఘాంతబోయేరు.

"ఏమిటిది? పిస్తోలు దేనికి తీశారు?" అడిగేడు ఫిష్ ఆశ్చర్యంగా.

"చెబుతాను. మీరు కాసేపు నిశ్శబ్దంగా ఉండండి!" పిస్తోలు మొన డిక్సన్ వేపు తిప్పి, "లే!" అన్నాను లేచి నిల్చుంటూ.

"ఏమిటిది? మీకేమైనా పిచ్చిపట్టలేదు కదా?" అన్నాడు డిక్సన్ నివ్వెరబోయి.

"చెప్పేది నీకే! లే!" అరిచాను.

డిక్సన్ లేవడానికి పక్కనున్న కర్రలందుకోబోయేడు.

"వాటి అవసరంలేదు. నీ కాలు బాగానే వుంది. ఏక్సిడెంట్‌లో దెబ్బ తగిలిందని కాలికి ప్లాస్టర్ వేసుకుని నటి

స్తున్నావ్! అలాగే లేచినిల్చో!'' అన్నాను కటువుగా.

డిక్సన్ బెదురు చూపులు చూస్తూ లేచి నిల్చున్నాడు.

''పద!'' అన్నాను గదిమూల వున్న ఇనప్పెట్టె వేపు సైగ జేస్తూ.

''ఎందుకు?'' అడిగేడు వణికే కంఠంతో.

''చెబుతాను. పద.'' అంటూ అతన్ని ఇనప్పెట్టె వేపు తోసేను. అప్పటికే డేవిడ్, హెరాల్డ్ ఫిష్ లేచి నిల్చు న్నారు.

డిక్సన్ మౌనంగా అటు నడిచేడు. ఇనప్పెట్టి దగ్గరికి వెళ్ళి నట్టే వెళ్ళి చటుక్కున వెనుదిరిగి తలుపువేపు పరుగు తీశాడు.

అతను పారిపోకుండా మధ్యలోనే డేవిడ్, హెరాల్డ్ ఫిష్ పట్టుకున్నారు. ఇనప్పెట్టి తెరిచిచూస్తే జెప్సన్నించీ, నానించీ, బ్రీఫ్ కేసులు తారుమారు చేసి డిక్సన్ అత్యంత చాకచక్యంతో కాజేసిన డాలర్లు కట్టలు కట్టలుగా పేర్చి కనిపించేయి.

''జెప్సన్ బ్రీఫ్ కేస్ లోనూ, నా బ్రీవ్ కేస్ లోనూ అంత డబ్బుందని ఇతనికి తప్ప మరెవ్వరికీ తెలీదు. నా బ్రీఫ్ కేస్ లో డబ్బు మాయమైనప్పుడే నా అనుమానం ఇతని మీదికి మళ్ళింది. అదే నిజమైంది!'' అన్నాను.

డిక్సన్ చేతులకి కఫ్స్ తగిలించి, కార్లో అందరం రబాత్ జేరుకున్నాం.

అక్కడి అమెరికన్ దౌత్య కార్యాలయంలోం డిక్సన్ని అప్పజెప్పి మాకు వీడ్కోలు చెప్పడానికి విమానాశ్రయం వరకూ వచ్చాడు హెరాల్డ్ ఫిష్.

మెట్లెక్కి విమానంలోకి వెళుతూ తలుపు దగ్గర ఆగి వెనుదిరిగి చూసేను.

చిరునవ్వుతో చెయ్యి ఊపుతున్నాడు హెరాల్డ్.

చిన్నగా తలూపి డేవిడ్‌తో లోనికి నడిచి సీట్లో చతికిలబడ్డాను.

గ్లోరియా నా కళ్ళలో మెదిలింది.

నిష్కపటమైన ఆమె హృదయం.

నిర్మలమైన నవ్వు.

నవ్వినప్పుడు మెరిసే ఆమె కళ్ళు జ్ఞాపకం రావడంతో మనసు భారం అయింది.

నిట్టూర్చాను!

బరువెక్కిన హృదయాన్ని మోసుకుంటూ, విమానం నీలిగగనంలోకి ఎగిరింది.

—: ఐపోయింది :—

## సప్లిమెంట్ పోటీ - 25.

133, 134, 135, 136, 137 — అంకెలను తీసుకొని మీకు నచ్చిన వరుసక్రమంలో, ఈ క్రింది గళ్ళను పూరించండి. మీ జవాబులను ఒక పోస్టుకార్డుసైజు తెల్ల కాగితంపై వ్రాసి, దానితో 75 పైసల స్టాంపులు జతపరిచి, ఈ నెల 30 వ తేదీలోగా మాకు చేరేటట్లు పంపండి.

| | | | | |
|---|---|---|---|---|
| | | | | |

మా ఆఫీసులో సీలు చేసిన జవాబుతో సరిపోలిన జవాబుకు ఏడాదిపాటు 'సప్లిమెంట్' ఉచితంగా పంపుతాం. ఫలితాలు డిసెంబర్ '76 నెల మాసపత్రికలో చూడండి.

## ముఖచిత్ర వ్యాఖ్యల పోటీ

ఈ నెల "సప్లిమెంటు" ముఖచిత్రాలు పరిశీలించండి. రెండింటికి సంబంధం ఉండేటట్లుగా ఒక్క మాటలో గాని, చిన్న వాక్యంలోగాని, వ్రాసి, ఈ నెల 10 వ తేదీ లోపు మాకు చేరేట్లు పంపండి. 'హోమ్ డెలివరీ' సభ్యులు తమ సభ్యత్వము నెంబరు వ్రాస్తేచాలు. సభ్యులు కానివారు తమవ్యాఖ్యలతో 30 పై.లు స్టాంపులుపంపాలి.

మాకు నచ్చిన వ్యాఖ్యలలో అత్యుత్తమమైన వ్యాఖ్యకు రూ. 20 లు నగదు బహుమతి పంపుతాము.

## మీరే ఎన్నుకోండి ?

ఈ "సప్లిమెంటు"లో మీకు బాగా నచ్చిన నవల పేరును ఒక పోస్టుకార్డు సైజు తెల్ల కాగితంపై వ్రాసి, ఈ నెల10 వ తేదీ లోపు మాకు పంపండి. హోమ్ డెలివరీ సభ్యులు తమ నెంబరు తప్పక వ్రాయాలి. ఇతరులు తమ జవాబుతో ఈ కూపన్ కత్తిరించి పంపాలి. ఉత్తమ నవలకు రూ. 116 లు బహుమతి ఇవ్వబడుతుంది. *

## వీడని శని!

"అయ్యా! మీ జాతకం అమోఘంగా ఉంది....కానీ మీరు ఒక నెల రోజులక్రితం ఎవరో ఒక స్త్రీని విధవను చేస్తూ పారేసిన గాజు ముక్కలు, పసుపు కుంకుమలు పొర పాటున చూడకుండా మట్టేసారు. దాని వలన కాస్త శని సంక్రమించింది. అది ఉగ్రరూపం దాల్చకుండా శాంతి చేయించుకోవటం ఎంతైనా మంచిది." అని చెప్పాడు జ్యోతిష్కుడు, ఫాడితో.

వాని మాటలు జాతకాల పిచ్చి బాగావున్న ఫాడిమీద బాగా ప్రభావం కలిగించాయి.

శాంతి చేయించుకోడానికి ఠక్కున ఒప్పుకుని దానికేం చేయాలో చెప్పమన్నాడు.

ఒక తెల్ల కాగితంమీద ఏవో రేఖలు, చక్రాలు గీసి నాగరికలిపిలో ఏదో వ్రాసి....దానిలో ఏదో వేరులాంటి పదార్థం చుట్టబెట్టి పొట్లం కట్టి ఫాడీకి ఇచ్చాడావ్యక్తి.

"ఇది మహా శక్తివంతమయిన యంత్రం. దీనిని జన సంచారం హెచ్చుగా వున్నస్థలంలో పడేసి వెనక్కి తిరిగి చూడకుండా వెళ్ళిపో.... ఎవరైనా దానిని తీసినా, లేక— ముట్టినా ఆ శని ప్రభావం వారిని చేరుతుంది" అని ఒకటికి రెండుసార్లు మా ఫాడిని హెచ్చరించి, దాదాపు ఇరవై రూపాయల వరకూ అతని వద్దనుంచి కట్నం రాబట్టుకుని

వెళ్ళిపోయాడా వ్యక్తి.

ఆ రోజు సాయంత్రం....ఫాడి సినిమాకి వెళ్ళి, టిక్కెట్ తీసుకొని మెల్లగా ఎవరూ చూడటం లేదని నిర్ధారించుకుని, హిప్ పోకెట్‌నుంచి అక్కడే ఆ పొట్లాన్ని జారవిడిచి, చరచరా ముందుకి నడిచాడు.

రెండడుగులు వేసాడో లేదో—"ఫాడీగారూ మీదేదో పొట్లాం పడిపోయింది. తీసుకోండి" అన్న పరిచితమయిన కంఠం వినిపించి వెనక్కి తిరిగి చూసాడు ఫాడి. అతను తనకు తెలిసినవ్యక్తే.

'చచ్చాంరా దేవుడా!' అనుకుంటూ 'అబ్బే అది నాది కాదులెండి' అని దబాయించబోయాడు ఫాడి 'నో....నో.... మీ పాకెట్‌నుంచే పడిందండీ....ఎందుకయినా మంచిది. ఓసారి చూసుకోండి' అన్నాడతను.

'నా పెన్నిధేదోపోతే వెతికి అప్పగించినట్లే వెధవఫోజూ వీడూనూ....నేను తియ్యకపోతే తనే నా ఎదురుగా తీసి విప్పి చూసేలావున్నాడు. ఇంక అందులో విరుగుడు సాధనాలు చూస్తే నేనేదో చీడు. చిల్లంగి పెట్టడానికి ప్రయత్నిస్తున్నాననుకొని అనుమానిస్తే తన పళ్ళు రాలడం మట్టుకు ఖాయం' అని మనసులోనే అనుకొని అయిష్టంగానే దాని నందుకుని జేబులో వేసుకున్నాడు ఫాడి.

సినిమా హాల్లో కూర్చున్నాడేగాని ఫాడి బుర్రంతా పాడై పోయింది. వెనక్కి తిరిగి చూడొద్దని జ్యోతిష్కుడు చెప్పాడు. ఛ అలా చూడక తప్పింది కాదు....ఆ! అయినా విప్పి చూడలేదు కదా! బెటర్‌లక్ నెక్స్ట్‌టైమ్ అని సమాధాన పరచుకుని ఇంటర్‌వల్ టైంలో అంతా తిరిగి హాల్లోకి వెళ్ళి పోయాక మరల ఆ పొట్లాన్ని చీకట్లో బయటపడేసి వెనక్కి

తిరిగి చూడకుండా వెళ్ళి హాల్లో కూర్చున్నాడు.

"హమ్మయ్య! ఇప్పుడెవరికంటా పడలేదు! శని విరగడ యింది" అని తృప్తిపడ్డాడు షాడి.

సినిమా అయిపోయినవెంటనే రిక్షాలో ఇంటికి బయలు దేరాడు. ఇంటి ముందు రిక్షా దిగి, రిక్షావాడికి పైసలు ఇవ్వడానికి జేబులో చెయ్యిపెట్టిన షాడికి, చేతికి ఆ పొట్లం తగిలింది. నిర్ఘాంతపోయాడు షాడి.

మరి, తను పారేసింది ఏమిటి? జేబులో మడతపెట్టివున్న రూపాయనోట్లను. ఆ మడతను చీకట్లో అదే పొట్లామని భావించి పారేశాడు.

"హతోస్మి!" ఆ శని తనను వీడేటట్లు లేదనుకొని, నెత్తిన చేతులు వేసుకున్నాడు షాడి.

—జల్లు బాజ్జీ, పార్వతీపురం.

## భలే కోడ్!!

నర్తకి రూమ్‌లోకి దాసీది వచ్చి "మీకోసం ఎవరో పెద్ద మనిషి వచ్చాడమ్మా" అని చెప్పింది.

"ఆయన పేరేమిటో అడగలేదా?" అంది నర్తకి.

"అడిగాను. ఆ ప్రశ్న వెయ్యగానే అమాంతంగా నన్ను ముద్దు పెట్టుకున్నారు."

"అలాగా! ఆయన మా వారే! ప్రవేశపెట్టు!" అంది నర్తకి.

—కాంగ్రేగుల సదానంద, వల్లంపూడి.

## బేరం?

"నాకో అర కిలో కందిపప్పు ఇవ్వండి" అంటూ వంద రూపాయలు నోటు అందించాడు ఆ యువకుడు.

షావుకారు వందరూపాయల నోటు అందుకుని మిగతా చిల్లర, కందిపప్పు ఇచ్చివేశాడు. తిరిగి మరో బేరం చూచుకోసాగాడు షావుకారు.

ఆ యువకుడు చిల్లర లెక్కపెట్టుకొని అటు ఇటు చూచి షావుకారుతో అన్నాడు.

"ఏమండీ! మీరు అర కిలో కందిపప్పుకి రూపాయ పది పైసలు తీసుకున్నారేమిటి? మార్కెట్‌లో తొంభై అయిదు పైసలకే యిస్తుంటే!"

"మా దగ్గిర బేరమేమీ లేదండి. కంట్రోల్ రేట్!"

"అయితే మీరిచ్చిన కందిపప్పు తీసేసుకోండి. నేనిచ్చిన వందరూపాయల నోట్ యిచ్చివేయండి." అన్నాడు ఆ యువకుడు.

షావుకారు విసుక్కుంటూ అతని చేతిలోవి చిల్లర, కందిపప్పు తీసుకుని, వందరూపాయల నోట్ ఇచ్చివేశాడు. ఆ యువకుడు ఆ నోట్ తీసుకుని సైకిల్‌మీద వెళ్ళిపోయాడు.

షావుకారు అతనిచ్చిన చిల్లర లెక్కబెట్టుకున్నాడు. అతని గుండె జల్లుమంది. ఆ చిల్లరలో ఇరవై రూపాయలు తక్కువయ్యాయి.

అతను గబ, గబ షాపులోంచి బయటకు వచ్చి చూచాడు. ఇంకెక్కడున్నాడు. ఆ యువకుడు ఎప్పుడో తుర్రుమన్నాడు.

— బి. వి. ఎన్. రత్నాకరరావు, కాకినాడ-4.

## ఇంటర్వ్యూ?

శర్మ ఇంటర్వ్యూ నిమిత్తం కలకత్తా వెళ్ళాడు.

ఇంటర్వ్యూకెళ్ళిన అందరూ బిక్క ముఖాలతో పైకి

వస్తున్నారు. వెళ్ళినపుడు వున్న సంతోషం వచ్చేటప్పుడు వుండడం లేదు.

శర్మను పిలవగానే లోనికి వెళ్ళాడు.

ఎదురుగా టేబుల్ వెనుక పుల్‌సూట్స్ వేసుకొని ముగ్గురు అధికార్లు కూర్చొని వున్నారు. వారిని చూస్తుంటే శర్మ గుండె లబ్, డబ్‌మని మ్రోగడం ఎక్కువయింది.

శర్మను చూస్తూనే ఒక అధికారి—

"స్పెల్ కలకత్తా" అని ఇంగ్లీషులో అడిగాడు.

శర్మ టక్కున "CALCUTTA" అని స్పెల్లింగ్ చెప్పాడు.

"రాంగ్" అని అరిచాడు రెండవ అధికారి.

"WRONG" శర్మ సమాధానం చెప్పాడు.

మూడవ అధికారికి ఒళ్ళు మండింది, "గెట్ అవుట్" గది మారుమ్రోగింది.

శర్మ జంకలేదు. "GETOUT" టక, టకా చెప్పాడు.

"ఏం నీకు ఇంగ్లీషు రాదా?" ఒకటవ అధికారి చిరునవ్వుతో అడిగాడు.

"మీరు స్పెల్ అడుగుతున్నారు నేను సమాధానం చెపుతున్నాను" అన్నాడు శర్మ.

ముగ్గురధికార్లు నవ్వుకున్నారు. శర్మ ఆ జాబ్‌లో సెలెక్ట్ అయినట్లు ప్రకటించారు.

—కాంద్రేగుల సదానంద, వల్లంపూడి.



